The East and the West
In unison best,
Away from creeds
And pois'nous seeds,
And like the psalms of a holy sage
Thy words be true from age to age!"

## VIII.

" Ere long Nature thy knell had tolled,
Thy waning life in pellmell rolled,
In mortal gore
With African Bore ;
But ere the last gasp flew from thee
Thou'st hailed thy Lion return in glee."
So far so good
Tho' not for good :
But care not Queen these earthly fights
For lust of gold or lawless rights.
Thy day is done
Thy race is run.
The heavy crown that crushed thy head
The signet ring ever by thy bed
No more shall boil thy hallowed blood.

All lines are flowers, and toils due,
Their freshness last for a seconds few."

## IX.

" Like the stump of a tree tho' close cut down
New tendrils shoot, and flow'rs full blown,
Ye left many to lift your Soul
To the cross abore—your destined goal
Your Prince Albert
A man stalwart
Now wears thy crown O blessed Queen!
No more below! O' hail the Speen
Of cross above
Greeting in love!"

## X.

The rose may bloom, but drop down soon,
Ther's rise and fall even for the Moon;
While seasons change
And minds derange,
Unchanged like Nature for e'er be thon
Communing with th' immaculate lambs above!"

**M. BhujangaRau.**



# LIFE

OF

# QUEEN VICTORIA.

(ILLUSTRATED).

BY

RAJA, M. BHUJANGARAU,

ELLORE.

# వసంత కుసుమము.

---

## శ్రీమ ద్విక్టోరియా మహారాజ్ఞీ చారిత్రము.

---



ఇది

శివపురాణాది బహు కావ్యనాటక

గ్రంథకర్తలగు

అష్టావధాని, శ్రీరాజా మంత్రిప్రెగడ భుజంగరావు

బహద్దరు జమీందారుగారి ప్రణీతము.

రెండవ కూర్పు.

**1907.**

మంజువాణీ ముద్రాక్షరశాల, ఏలూరు.

శ్రీరస్తు.

శ్రీమార్కండేయేశ్వరాయనమః.

# వసంతకుసుమము.

---




మిహికాధరాత్మజను బ్రేమమునన్ విడఁ జాల కె
ల్లెడన్, సాము మెయిన్ వహించుటను జంద్రశి
లల్ సురరాజరత్నముల్, గో మెసగంగ నేరుపు
నఁ గూర్చిన యచ్చెరువంపువిగ్రహం, బైమది గో
చరించెడు శివాకృతి మాకిడు నిష్టసిద్ధులన్. 1

క. కొండలరాయనికూఁతుం
గుండలిరాడ్భూషణాఢ్యు కూరిమిచెలి నా
ఖండలదారాదులచే
మెండుగ వరవుడముఁగాంచు మెలఁతంగొలతున్. 2

ఉ. వారణవక్త్రుఁడాదిగల వంద్యసుపర్వుల కెల్ల మ్రొక్కి కై
వారము తల్లిదండ్రుల కవారితభక్తి దలిర్పఁ జేసి బృం
దారకభాష నాంధ్రమున ధారుణిఁ గావ్యములన్ రచించి రె
వ్వారలు వారి కెల్లరకు వందన మే నొనరింతు నమ్రతన్. 3

క. నాకృతి సుకవికి దుష్కా
వ్యాకలనప్రియున కహిత మగు నీఁగ భువిం
గైకొనును పుంటివాసనఁ
గైకొను నే యత్తరువుల ఘన గంధంబుల్. 4

వ. ఇట్లు వందనీయాభి వందనంబును నిందనీయాభి నిందనంబునుం గావించి యొక్క నవీన సచ్చరిత్రం బను మహత్సంబున మత్కవితాలతం బ్రాకించువాఁడ నై దానికిం గుదురగు మద్వంశక్రమంబు వక్కాణించెద.

చ. సిరి తన నున్దొడల్ నినిచి చేతులఁ బాదములొత్తుచుండఁగాఁ
గరువలితిండి పెల్బరువు గ్రమ్ముచు మేనిరుచుల్ వెలుంగ ని
ద్దురఁ గొని మేలుకాంచిన యధోక్షజు నాభిసరోరుహంబు వ
ధ్వరజము ముద్ద యై యొసఁగు ధాత జగంబుల కెల్లఁ గర్తయై. 6

క. ఆతఁడు తపస్ప్రభావ
ఖ్యాతుల నిఖిలార్థసృష్టి కాద్యుల జ్ఞానో
పేతుల మునుల న్మనమున
నాతతగతిఁ గాంచె నందు హారితుం డలరున్. 7

క. ఆప్రాజ్ఞునిగోత్రంబు బ
హుప్రకార వితతశాఖ లొందెడు నందున్
సుప్రథితం బగుచున్ మం
త్రిప్రెగడాన్వయము వెలుఁగు దీపమ్మగుచున్. 8

ఉ. వారిప్రధానతం దెలుపు వారిది యకా సుపనామ మిమ్మడిక్
హారిగుణాఢ్య మంత్రిపెగ డాన్వయ సంభవు లైనవారలక్
వారిని వీరిఁ బోలెఁ దలపం దగ దిబ్భువి నాఱువేలవా
రారయ నెంద తేనిఁ గల రందును మామకపూర్వు లింత లే. 9

క. అందుం గులప్రతిష్ఠల
నొందుం గుఱ్ఱా జనంగ నురుశివపూజా
నందుఁడు విందులపాలిఁటి
మందారమహీరుహంబ మందయశుం డై. 10

మ. అతఁ డేలూరుపురాన శైవులట తా మర్చించినం గాని ము
న్నితరుల్ శంభునిఁ బూజసేయ వలదం చేర్పాటుగా దేవతా
యతనం బడ్డఁగ నాగ్రహించి యపుడే యన్యాలయంబుక్ లస
ద్గతిఁ గట్టించి ప్రతిష్ఠఁ జేసె నల మార్కండేయగంగాధరుక్. 11

క. గురురాజసదృశుఁ డని నలు
గురు రాజద్బుద్ధిఁ గీర్తిఁ గొనియాడంగా
గురురాజస మడఁగించుచు
గురురాజ సమాహ్వయుండు కొమరొందె నిలక్. 12

గీ. ఆమహామహుసద్వంశ మందుఁ గీర్తి
రాశి యైనట్టి యప్పల రాజమంత్రి
శేఖరుం డుదయించె నశేషసుగుణ
భూషణుం డాశ్రితోరగ భూషణుండు. 13

ఉ. అయతకీర్తి వాక్పటిమ యందును భూభరణప్రశస్తియం
దా యురగేశ్వరుం డితని కౌను సమానుఁ డటంచు వెల్లడిం
జేయు భుజంగరాయఁడ ను శ్రీకరనామముఁ దాల్చి రామయాం
బాయతనేత్రయం దొదవె నాత్మజుఁ డప్పలరాజమంత్రికిన్. 14

ఉ. అప్పలరాజనందనుఁ డ హర్పతితేజుఁ డమేయవైభవం
బుప్పతిలంగ లక్కవర ముఖ్యపుటూళ్ళ జమీనుదారుఁడై
డెప్పర మైనకీర్తిఁ బ్రకటించె దిగంతములందు నీతఁ డ
ప్పప్ప తగండె శ్రీపతి యటంచును భూపతి యంచుఁ జెప్పఁగన్. 15

క. రాజా యన బహదూ రన
రాజద్బిరుదములు దెచ్చి రాజిల్లె నతం
డీజగమున నతనికి ద్విజ
రాజే సరి గాక యన్య రాజులు సరియే 16

సీ. నైలింపసైంధవ నవనవపరిఫుల్ల
సారసపఙ్క్తితో సరస మాడి
మందరాహార్యనిర్మథితదుగ్ధపయోధి
డిండీరకాండంబు డిందుపఱచి
పూర్ణిమాచంద్రికాస్ఫూర్తివిస్ఫుటతర
కైరవసారంబుఁ గేరడించి
రాజతగిరిచరదాద్రిజశేఖరగాత్ర
కమనీయకాంతులఁ గలఁతపఱచి

గీ. పశదిశాభిత్తికాసుధా దశ వహించి
రాజిలు భుజంగరాయ నిర్మలయశంబు
గనులఁ గాంచిన ముదమందఁ గల్గుఁ గాక
దాని వాక్రువ్వనంత మేధావి గలఁ డె. 17

సీ. చిన్నమాదేవితోఁ జిన్నారి పొన్నారి
చిన్నెలు జూపెను చిన్ననాఁడు
శేషమాదేవి క శేషవిలాసవి
శేషముల్ జూపె విశేషవృత్తి
సీతమాదేవిఁ గా శీతలవాహినీ
శీతభోగంబుల చేతఁ దనిపె
రంగమాదేవిని రంగారుపాిసాద
రంగబులం దల రంగఁ జేసె

గీ. నిట చతుర్వర్గలక్ష్ముల నెనసినట్లు
నల్గురింతులతోడ మనంబు దనియ
భోగదేవేంద్రుఁ డనఁగను బొలుపు మీఱె
నితని సామాన్యవిభునిఁగా నెంచ వశమె. 18

శా. ఆలించె న్నృహసత్పురాణముల నార్యశ్రేణి బోధింపఁగాఁ
గీలించె న్మదివామదేవుపదపంకేజాతము ల్భక్తిచే
లాలించె న్ననుఁబ్రేమ మీఱఁగను బాల్యంబాదిగా దీనులం
దేలించెఁ ధనసమృద్ధి నింతులు మహీ న్నేపాంబను న్సాటియే. 19

వ. ఇట్లు జాయాచతుష్టయ సంయుక్తుఁడై పంచమజాయ యై పరఁగు
విశ్వంభరాదేవి నతిప్రయత్నంబునఁ బాలించుచుండ. 20

గీ. అగ్రమహిషికి నుదయించె నాత్మజుండు
మల్లికార్జునరావు రామమ్మ సుతయు
శేషమాంబకు సుబ్బమ శేషమ యనఁ
గలిగెఁ జాతుర్యయుతకన్య కాద్వయంబు. 21

సీ. అఖిలవిపశ్చిజ్జనావళి కెడయక
కాంక్షితార్థము లిచ్చుకల్పశాఖి
బహుతరప్రత్యర్థిబంధురసమితికి
బృథుపుష్పభరితచాంపేయశాఖి
దారిద్ర్యసంతాపతప్తార్థులకుఁబత్తి
గురుభరం బైన న్యగ్రోధశాఖి
యమితఫలంబుల నాశ్రితులకు నిచ్చు
సురుచిరవాసంత చూతశాఖి
గీ. చిత్రముభుజంగరాయఁ డీచెట్టునందు
మల్లికార్జునపుష్పమతల్లి గల్గి
ధన్యమంత్రిప్రెగడవంశవనము నెల్ల
వాసిమీఱంగ వాసింపఁజేసె నహహ. 22

మ. ఒనరం దానము లొక్కచేత నిడవే లుండుం గదే మల్లికా
ర్జునరాయండు భుజాసహస్రకముచే శోభిల్లునో కార్తవీ
ర్యునిపోల్కిం దగ దానవేళ నిది యే యూహింప నా వాని య
ర్జునసంజ్ఞాపద మిట్టియర్థమును సంసూచించు నం డ్రెల్లరుక్. 23

క. వేయించెను సత్రమ్ములు
వ్రాయించెన్ భూరిదానపత్త్రము లరులం
ద్రోయించెన్ సత్క్రియలం
జేయించె నితండు రాజశేఖరుఁ డౌటన్. 24

క. ఏలూరున మార్కండే
యాలయమున వీరభద్రు నతిభక్తిమదిం
గేలించి ప్రతిష్ఠించెం
బాలించె న్వెల్ల యనఁగఁ బరఁగినవీటిన్. 25

గీ. విజయలక్ష్మి యె సాంగ యై వెలసె ననఁగ
విజయలక్ష్మి యనం దగు వెలఁదిమిన్న
తనకు నిష్టోపభోగసంధాత్రి యౌచు
విలసదర్ధాంగలక్ష్మి యై వెలయ నొప్పె. 26

గీ. విజయలక్ష్మిద్వయంబుతో విహృతి సల్పు
మల్లికార్జునరాయని మహిజనమ్ము
లేకపత్నీవ్రతస్థుఁ డం చెంచుచుండు
రామహోమహు వర్ణింప నలవి యగునె. 27

ఉ. ఆమహితాత్మనందనుఁడ నైతిని నేను మృకండునందనా
ఖ్యామహితేశ్వరాంఘ్రియుగకంజమరందరసప్రవాహపా
నామలితాంతరంగకుఁడ నర్చ్యమదీయపితామహోల్లస
న్నామవిభాసమానుఁడ గణింగినవాఁడఁ గృతిన్ రచింపఁగన్. 28

సీ. నాకుఁగల్గెను పద్మనాభదుర్గామల్లి
కార్జునరానను నగ్రసుతుఁడు
అతఁడు తన్నామమం దమరు దేవతల క
రుణచేత నాయురారోగ్యములను
నైశ్వర్యమును గల్గి యభివృద్ధిఁ జెందుఁ గా
కిటుపైని మద్వంశ్యు లెల్లవృద్ధిఁ
దనరుదు రాచంద్రతారకంబుగ ధర్మ
మార్గానువృత్తులై మహితరీతి

గీ. సరగ విక్టోరియారాజ్ఞి సచ్చరితము
నేను రచియింపఁ గంటి నేకోనవింశ
శతతమం బగు క్రీస్తువర్షంబునందు
నిందుదయతోడ బుధులు మన్నింత్రు గాక. 29

సీ. కవిత నా నున్మాదకల్ప మీయది గల్గ
సాఁగించ కుండంగ శక్య మగునె
యది నాకు విద్యల నభ్యసించుచు నుండ
గల్గి బాల్యంబుతోఁ గలసి కొంతఁ
గననీయ కుంట శృంగారరసప్రవా
హిని నలనాటకమును మొదలగు
గ్రంథముల్ రచియించి కాలాంతరమున స
త్కవికావ్యరత్నముల్ గాంచి యందు

గీ. ధ్వనిరసచమత్క్రియాదులు మనము నంటి
నాయపాండితి రసవిహీనత మొద లగు
లోపము లెఱింగి గ్రంథవిలోకన మ్మొ
కర్జముగఁ గొంతకాలము గడపి మఱియు. 30

గీ. సంస్కృతాంధ్రకృతుల్ గొన్ని చదువఁజదువ
వానియం దభిలాష మనూన మగుట
ఘనత మంజువాణీపత్త్రికాముఖమునఁ
బ్రకట మొనరించుచుంటిని వానిఁ బిదప. 31

ఆ. చిఱుతతనమునందుఁ జేసినకృతుల తొంట
వానియందుఁ బ్రీతి వదలలేక
యప్పుడప్పు డెల్ల నచ్చునొత్తించుట
నప్పుడపు డొనర్చినట్లు దోఁచు. 32

సీ. లోకానుకారసమాకలితంబు గా
నలవరించితి రాజహంసి యొకటి
కమనీయమృదుకథారమణీయ మై యుండ
రచియించితిని మనోరమ యొకండు
వారనారీదుష్టభావంబు లెఱిఁగింపఁ
గావించితిని వారకాంత యొకటి
కల్మషంబుల నెల్లఁ గడకొత్తఁగా రచిం
చితినిమార్కండేయశతక మొకటి

గీ. అమరఁ దారావళులును బ్రహసనములును
జేసి యష్టావధానంబుఁ జేసి వేడ్క
మఱియు విక్టోరియారాజ్ఞిమహితచరిత
చంపువును జేయ గడఁగితి నింపుగుల్క. 33

మ. ధరణిం బూర్వమహీశసత్కథల పెద్దల్ కావ్యము ల్సేయుటన్
విరచింపం దొరఁకొంటి నే నిపుడు శ్రీవిక్టోరియారాజ్ఞి స
చ్చరితం భాధనికావనీపతులలోఁ జర్చింపఁగా నీ మెకున్
సరి యేవారు లభించు ట బ్బురము శశ్వత్కీర్తిసంపత్తులన్. 34

శా. ఆరాజ్ఞీమణిసచ్చరిత్రమును గావ్యంబున్ రచింపంగ నే
నారంభించితి సాహసించితి గదా హా సాస్పదం బౌదునో
గౌరీనాథుఁడు వంశదైవతము మార్కండేయశంభుండు నా
కారాధ్యుం డయి యుండ బెగ్గిలఁగ నేలాయిందు మున్మున్నుగాన్.

వ. మాకులదైవంబును నాకుం గవితాధోరణీప్రదుండును నైన మార్కండే
యేశ్వరు నీకృతికన్యారత్నంబునకుం బరిగ్రహీతఁ గాఁ బ్రార్థించితిం
గాన నిది సర్వజనహృద్యం బై యుండుం గాదె. 36

## షష్ఠ్యంతములు

క. శ్రీభూమీధరవరక
న్యాభాస్వరవామభాగునకు సురగాధీ
శాభరణున కనవద్య
ప్రాభవజితపురనిశాచరశ్రీకునకున్. 37



మార్కండేయేశ్వరునకు కృతినిచ్చుట. 10.

క. కర్కశమానసభయదున
కర్కాంబుజవైరిపావకాక్షున కమృతో
దర్కనిజదర్శనునకుఁ
మార్కండేయేశ్వరునకు మారహరునకుఁ. 38

క. శర్వునకుఁ బాదవినతసు
పర్వునకుఁ విశదగాత్రభద్రాద్రిధిపగం
ధర్వునకు హతనిశాచర
గర్వున కస్త్రీయమానగరుడార్వునకుఁ. 39

క. శైలాధిపబాలామృదు
హేలావివశీకృతాచ్ఛహృదయాబ్జునకుఁ
ధీలాలితశీలావృత
హేలాపురపాలునకును హృదయాలునకుఁ. 40

క. శశిఖండశిఖండునకుఁ
వశిమానసహంసమునకు వరహైమవతీ
దశనచ్ఛదమధురసుధా
వశసంచరదంతరంగబంభరమణికిఁ. 41

క. దర్పకదర్పఘ్నునకు న
హర్పతితారాధిరాడ్ధాంగునకు దయా
తర్పితనిజభక్తునకుం
గర్పూరవిభాసమానకాయచ్ఛవికిఁ. 42

## కథా ప్రారంభము

వ. సమర్పణముగా నా యొనర్పం బూనిన వసంతకుసుమం బను విక్టోరి
యారాజ్ఞీచరిత్రంబునకుం గథాక్రమం బెట్టిదనిన. 43

శా. భూగోళంబున విస్తృతిం దనరుచుం బూర్వార్ధ మై యొప్పునీ
భాగం బెన్నఁ ద్రిఖండభాజితము గా బ్రాచీనపుండీవినా
బాగా వార్ధిచతుష్క మధ్యమున నాభాగంబునన్ శైత్యసం
యోగాధిక్యము గల్గి చెన్నుమిగులున్ యూరోపుఖండం బొగిన్.

క. ఈఖండము శైత్యగుణ
శ్రీఖండ మనేకచిత్రశిల్పకృతవిశే
షాఖండము గా రాజిలు
నాఖండలభోగములకు నాస్పదమగుచున్. 45

ఉ. చల్లనివారు భూస్థితిఁ బ్రసన్నమనోగతిఁ జంద్రుపోలికం
దెల్లనివారు మెరుచుల నిర్మలకీర్తులఁ గాలయాపనం
బొల్లనివారు గావున మహోన్నతవైభవు లందు మానవుల్
దెల్లనివారుసంపువారర నివ్వల నిట్లు సృజించె నేమొకో. 46

ఉ. కంటికి నింపు నింపు నల ఖండము వాయువ్యపక్క యందు న
ట్లాంటికువార్ధిలోపలఁ జెలంగుబ్రిటీషుసమాఖ్య నొంది యొం
డొంటిని నొత్తుదీవులు కడున్ సిరు లొప్పఁగ వార్ధికన్య పు
ట్టింటను బాల్యవేళ రచియించిన వెన్నెలప్రోవు లో యనన్. 47

సీ. ఒకయోర మున్నీట నోలలాడుచు నుండు
గజరాజబృందంబు కరణిఁ దోఁచు
నొకచోట వారాశి నుద్వృత్తిఁ దేలిన
గ్రాహమత్స్యాదుల కరణిఁ దోఁచు
నొకవంక వాతాహ తోదన్వ దుల్లోల
కల్లోలజాలంబు కరణిఁ దోఁచు
నొకప్రక్క వాణిజ్య యుక్తిగతాగత
తరణిసందోహంబు కరణిఁ దోఁచు

గీ. నిటుల జలనిధిధుత విశంకటతరంగ
వాతనిర్ధూతజలకణ జాతసతత
శీతలితకూలశైలప్రపాత మగుచు
ద్వీపసముదయ మింపుగాఁ దేజరిల్లు. 48

గీ. అందు నిర్మలమృత్స్నమ యంబు లైన
కూటములచేత నెంతయుఁ గొమరు మిగిలి
లచ్చి కిర వొచుఁ దనరు నింగ్లాం డనంగ
ద్వీపవర్యంబు జగదేక దీప మగుచు. 49

శా. శ్వేతద్వీపము సేయఁ జాల నొకఁ డా శ్రీనాథుశుద్ధాత్మ నే
భాతిం గౌరవ మందఁ గల్గు ననుచుం బంతంబు మీరంగ నీ
శ్వేతద్వీపము నిర్మలాత్మకము గాఁ జేయుంగదాసాశ్రిత
వ్రాతంబుం దగు నిట్టిపేరు వివరిం పం దీని కే రూఢమై. 50

ఉ. అక్కడిరాజవంశ మల రాయను సన్నుతిపాత్ర మాచు బ్ర
న్నిన క్కను పేర నందుఁ గల వీరవరేణ్యులు సుప్రసిద్ధిఁ జే
రుక్కునఁ గీర్తిసంపద సముచ్ఛ్రితతేజమునన్ సమున్నతిం
దిక్కరి ధిక్కరించి గడి దేరితెమల్ప సమర్థు లెంతయున్ 51

సీ. కోరిక లెన్నేనిఁ గొదుకక యిడి స్వల్ప
మిచ్చితి మని సంశయించువారు
పెరవారి యిక్కట్లు దొరఁగింపఁ బ్రాణమ్ము
లేనియు ముదముతో నిచ్చువారు
జముఁడైన దురమునఁ జక్కఁగ నిలచిన
నెడమకేలిచ పేట నడఁచువారు
ధర్మమార్గము చొప్పుఁ దప్పి వర్తించినఁ
దనయునితలనైనఁ దరుగువారు
గీ. వీరు లనఁ దగువారలు వీరుగాక
వారి వీరిని నెల్లను వీరు లనుచు
గారవించుటఁ గన నేతి బీరకాయ
సార మంచును మున్నారుఁ జాటవచ్చు 52

క. హూణులు కృతదీనజన
త్రాణులు ధర్మైకరతులు రక్షితసుజన
శ్రేణులు సంతతసత్యాధు
రీణులు రిపుహరణ పర విశృంఖలబాణుల్. 53

శా. ఆహాంగ్లప్రభుసర్వమండలములో నాల్ఫ్రెడ్డుదిగ్రేటనం
గాహారంబులలోన నాయక మనం గణ్యత్వముం గాంచు పే
రోహో యంచు జనుల్ నుతించుచును దన్నుత్కంఠతోఁ జూడఁగా
బాహానిర్జితవైరివీరుఁ డనిం బాలించె ధర్మస్థితి౯. 54

క. గర్జాతతగుణరాన వి
నిర్జితదుర్మదసపత్ననివహుఁడు సతతో
పార్జితయశుఁడగు మూఁడవ
జార్జి యతనివంశమందు జాతుం డయ్యె౯. 55

శా. ఈజార్జిప్రభువర్యుఁ డాఋపను తేం డ్లిష్టుల్ బుధుల్ ప్రెగ్గడల్
రాజుల్ గొల్వఁగ దుష్టమానవకథాలౌల్యంబు వర్జించుచు౯
భూజానిత్వముఁ బూని నార్యులకు నేపాచ్చెంబు లే కుండఁగా
వేజాడల్ పచరించుకూళగమి నువ్వెత్తుం దోలంగించుచు౯ 56

మ. పరపీడల్ పరదేశపుందెఱువులం బట్టెం బోజుంగుందనం
బరిగెం గట్టును బుట్టఁ బట్టుకొని చౌర్యంబుల్ గమిం గూడి జా
తర కేగ న్నిలువంగఁ జాలక యసత్యం బెందునో డాఁగె రూ
పఱె దుశ్శీలము జార్జిభూవిభుఁడు రాజ్యంబుం బ్రశాసింపుచో౯. 57

క. మది మోదవార్ధితరగలు
పొదలుచు నానాట వెలికిఁ బొంగె ననంగాఁ
బదునేవురు సుతు లతనికి
నుదయించి రశేషజనులయుల్లము లలర౯, 58

క. కళల న్వేఱ్వే అగుచు
క్కాలదొరలో వీర నంగఁ గమనీయసితాం
గులు పదియేనుగు రగురా
జులు వెలసిరి తండ్రిచెంత సురుచిరలీలన్. 59

సీ. ఆయపత్యములలో నాద్యుఁ డౌనాల్గవ
జార్జికిఁ గల్గె నత్యూర్జితముగ
చార్లొట్టి యనునట్టి చక్కనికూఁతు రా
భామ లియోపాల్డు ప్రభువరుండు
పత్నిగాఁ జేకొని భావించె నిక్కాంత
తాతతండ్రులయనంతరమునందు
రాణించి యింగ్లాండు రాణిగా కుండు నే
యన్యులు గల రె రాజ్యార్హు లింక

గీ. నట్టిమగువకు నేఁ బతి నైతి నెంత
భాగ్య మొదవెను కల రె నాపాటివారు
భోగసంపద లెల్ల నాభాగ మయ్యె
మున్నొనర్చితి నోయెన్ని పున్నెములను. 60

మ. చరియింతుం గద పుష్పితోపవనముల్ చార్లొట్టితోఁ గూడి నే
భరియింతుం గద యర్థులన్ విబుధులం బంట్లన్ ధనం బిచ్చుచున్
విరియింతుం గద కీర్తిమండలము దిగ్వీధిం బ్రకాశింపఁగా
స్మరియింతుం గద యిట్టు లుండు ననుచున్ స్వర్గాదిభోగంబులన్.

వ. అని మఱియు నిట్లా లిరియోఫాల్డు విభుండు మనోరథం బెక్కి తిరు
గుచుఁ జూడం గూడని విషయంబులం జూచుచుండె నెక్కం గూ
డని యున్నతస్థలంబు లెక్కుచుండెఁ బొందం గూడనిమహాభోగం
బులం బొందుచుండె నద్దిరా! వస్తుదారిద్ర్యంబు గలదు గాని సంక
ల్పదారిద్ర్యం బెవ్వరికిని లే దనుట నిశ్చితం బై యుండె. 62

గీ. దైవగతి యెవ్వనికి నైనఁ దలఁప నశ మె
ముందుఁ గాఁ గలదానికి మోద మంద
వలన దంచును బెద్దలు దెలుపుచుంద్రు
గాన నిది యెన్నఁటికి నైనఁ గల్ల యగు నె. 63

శా. ఆహా! దైవము పిన్నరాజునకు నెం తారాటముం దెచ్చె నో
హోహో! సుందరి సుందరీ నను విడన్ న్యాయం బటే యంచు స
మ్మోహంపుంజలరాశి నాతఁడు వడి న్మగ్నంగ నొక్కప్పు డా
నీహారాంశుముఖీవతంస ముడిగెన్ దేహంబు ధాత్రీస్థలిన్. 64

వ. ఇ ట్లాసతీరత్నంబు లోకాంతరం బలంకరింపఁ గన్నీరు మున్నీరు గా
న మ్మన్నెకాఁడు వలవంత యంతరంగంబున నిలుపం జాలక బేలతనం
బున ని ట్లని యాక్రోశింపం దొడంగె. 65

క. ఎన్నెన్ని కోరికలనో
యెన్నుచు నే యుంటిఁ గాని హృదయంబున నో
కన్నియ కలలో నైన
న్మ న్నెప్పుడుఁ దలఁప నిట్టు మునుఁగు న టంచున్. 66

శా. ఏలా జర్మనిదేశ మందుఁ గల నన్నీదవ్వులం దెచ్చితో
యేలా నాకు లభింప రాని సిరులన్ హెచ్చించితో యింతలో
నేలా నేలఁ బడంగ నన్నడఁచితో యీరీతిగా నక్కటా!
యే లాభం బొనఁగూడె నీ కిటఁ గృపాహీనాత్మకా దైవమా. 67

క. అని యీ గతి నాతండును
జననీజనకులును వగవఁ జను వగు హితులం
దను వగు నాదువుల నల్లనఁ
దనుపం దిరపడి యథాయథంబు గ నుండన్. 68

గీ. అట్టి ముద్యోగు లైన రాపట్టిమిన్న
లందును ద్వితీయుఁ డై నట్టి యాచ్కానకును
బొందఁగా రాని దయ్యె సత్పుత్రనక్త్ర
పంకజవిలోకనోత్సవభాగ్యగరిమ. 69

సీ. కాలవశంబునఁ గన్పట్టు సుఖమును
దుఃఖంబు వల దని త్రోయ వశమె
తన పుత్త్రు మద్దులతనయ భూతలమును
విడచినవర్షంబు గడపు చుండి
మూఁడవజాన్నియు మూఁడవకొమరుఁ డౌ
న్లోరెన్సు నేలు విల్లియమునకును
ఎడిలెయి డను నట్టి పడఁతుక దేవిఁగా
నీల్కొల్పి మఱియును కెంటుకొ భుత



విక్టోరియారాణిగారితండ్రి డ్యూకు కెంటుప్రభువు. ఎడ్వర్డ్.   19.

గీ. వరలు నాల్గవతనయుఁ డెడ్వర్డునకును
జాయ విక్టోరియా మెరీలూయిసాఖ్యఁ
గాఁగ నిరువురి కొక్క లగ్నంబు నందుఁ
బరిణయంబుల నొనరించె భవ్యరీతి. 70

ఉ. పెండిలి మీఁఁదు నుత్సవము పృథ్విని లేదఁట యందు సర్వభూ
మండలనాథునందనులు మాన్యులు పెండ్లికొమారు లంట యాం
దొందును గాక రెం డఁట మహోత్సవసంపద లెన్న నెట్టుగా
నుండునొ కన్ను లున్న ఫల మొందనలె న్నుడువంగ నల్పమే. 71

క. ఆర్యజనవినుత సద్గుణ
ధుర్య లిమోఫాల్డు కేనితోఁబుట్టువు వి
క్టోర్యా మేరీలూయిస
చర్యల కెడ్వర్డు మదిని సంతస మొందుఁ. 72

సీ. ఒకనాఁడు జవనాశ్వశకట మారోహించి
యామెతోఁ గూడి వయ్యాళి కేగు
నొకవేళఁ గల్కితో నుప్పొంగి చెలరేఁగి
పచ్చికనేలల బంతు లాడు
నొక్కచల్లనివేళ నొండొరు కే లూని
తోరంపుపువ్వులతోఁట కేగు
నొక్కెడ నిద్దంపుటుప్పరిగల నింతి
మనసురంజిలుకథల్ వినఁగఁ జేయు

గీ. మఱి యుఁ బెక్కుతెఱంగులఁ దెలివఁ గూడి
చతురలీలావిశేషముల్ జరుపు చుండు
నిట్టు లారాచకొమరుఁ డనేకగతుల
నుల్లము ప్రమోదగరిమచేఁ బల్లవింప. 73

క. తా నెంత లిడుమ లంది యు
దీనజనావనమునందు దీక్ష గలిగి య
మ్మానవవరుఁ డెడ సేయక
దానంబుల నెల్లవారిఁ దనుపుచు నుండున్. 74

క. సైన్యపతి యైనయప్పుడు
జన్యమ్ముల కర్తము లగుసంస్కారమ్ముల్
మాన్యగతిం జేసి యసా
మాన్యప్రజ్ఞుఁడను కీర్తి మహిపై నెఱపెన్. 75

ఉ. ధైర్యము వానియింటఁ గొని దాఁచినయట్టిమహాపదార్థమా
శౌర్యసమృద్ధి వాని విడఁ జాలక నచ్చి వరించుకన్నె స
త్కార్యపరత్వ మో జనచకాలము మున్నుగ ముఖ్యమిత్ర మౌ
దార్యగుణంబు నవ్విభునిదాసుఁడుగా నగు నెంచిచూడఁగన్. 76

వ. మఱి యు సర్వజనోపకార ప్రయోజనంబు గా సంస్థాపితంబు లైన యరువదిరెండు సమాజంబులయం దధ్యక్షుం డై తత్కార్యంబుల నిర్వహింపుచు సత్యవ్రతుం డనం బ్రసిద్ధిఁ గాంచిన యెడ్వర్డు ప్రభువ రుం డొక్కనాఁడు తనమనంబున. 77

మ. అకటా! నాతలిదండ్రు లీసుఁ గొని న న్నన్యుఁ వలెం జూతురే
మొకదా వారియనుజ్ఞ మీఱుటకు నే నొల్ల న్నిజం బింత మా
మకచారిత్రము విన్నకన్నజనముల్ మన్నింతు రిట్లుండ పి
రికి విద్వేషము గల్గఁ కారణము నేరీతిం గనుంగొందు నో. 78

చ. విడువఁ గఁ జాల ధర్మపదవిన్ విడి యుంద మటన్న నప్పుడ
య్యెడుమలఁ బొందువారిఁ గని యించుక యోర్వఁ గ లేనియుల్లమే
వడువున నిల్పువాఁడ నిఁక వారికి నాపయి నెట్టు లైనఁ బ్రే
ముడి యుడిగెం గదా యమకఁ బోలు నె త్రుంచినతీన యేరికిన్. 79

ఉ. తల్లినిఁ దండ్రి నెల్లపుడు దైవము లంచుఁ దలంచు చుంటి నా
యుల్లమునందు వారి కుపయుక్తకృతుల్ రచియించు చుంటి న
న్నొల్లక నిర్దయాత్ము లయి యొవ్వనివానిఁ గఁ జూతు రయ్యయో
పల్లటిలం గఁ జాల వొకో వారిమనంబులు నన్నుఁ జూచినన్. 80

క. కావున నీయెడ నిలువం
గా వల దెట కైన నేగి కాలముఁ బుచ్చన్
దైనము గల దటపై నని
దేవేరిం గూడి తనదు దేశము వెడలెన్. 81

సీ. మనల బిడ్డలఁ బోలెఁ గనుఁగొను నెడ్వర్డు
ద వ్వేగు నని ధృతిఁ దరుగువారు
నలశాక్సికోబర్గు నర్మిలికూఁతురు
కడగండ్లఁ బడె నని యడలువారు

కన్నవారల కెంత గట్టిడెందము వీరి
నెడఁజేసి రని వెతఁ గుడుచువారు
పలుగురు కొమరులు గల రని యాతనిఁ
దొలఁగించి రే యని దూఱువారు

గీ. పాడి దప్పని మేటికిఁ బాడుదయ్యె
మెట్టిబాముల నిడె నని తిట్టువారు
నీతనియార్జవ మే కదా యింతదెచ్చె
నని నగుచువారు నై రప్పు డచటిజనులు 82

వ. ఇట్లు బయలు వెడలి మితపరివారంబుతోఁ గతిపయదినసప్రయాణంబుల నల్లనల్లనఁ దత్తద్దేశోచితయానంబుల నారోహించుచు రమణీమణి నతిప్రియత్నంబునం గాపాడుచుఁ జనిచని. 83

ఉ. అత్తరుణీలలామ కతఁ డందము మీఱుపురంబులు న్మహీ
ధ్రోత్తమముల్ నదు ల్సరసు లుత్కటపుష్పలసద్వనంబులుం
గ్రొత్తకుతూహలంబు మదిఁ గూర్పఁ గఁ జూపుచుఁ బ్రాగ్దిగంతమం
దుత్తరవార్ధిశాఖఁ గని యుత్సుకుఁ డై చెలిఁ జూచి యి ట్లనున్. 84

ఉత్సాహము.
వారిరాశిభూరివీచిబాహు లొంటి నొంటితోఁ
జేరఁ బారఁ జూచుచు న్విజృంభితాంగుఁ డై వడిం
దీరభూమి గారవించి నేర్పుమీఱఁ గౌఁగిటం
జేరఁబట్టెఁ గంటివే కృశీభవద్విలగ్నరో. 85

క. నీరమ్ము నురువుగమిచేఁ
దీరము సైకతముచేతఁ దెల్లని వౌచున్
వారాశినీరతీరము
లేరుపరుప రావు వారి జేక్షణ కంటే. 86

క. నీమోముఁ గాంచిరాకా
సోముఁ డనుచు బ్రమసె నే మొ సుదతీ తటినీ
కాముకుఁ డుప్పొంగెడు గతి
వేమారు మహోర్మిజాల విలసితుఁ డయ్యెన్. 87

శా. ఈవారాశితరంగము ల్కడునడిన్ హెచ్చొచు నంతంతకున్
గ్రావంబు ల్వలె నున్నతంబు లగుచుం గాన్పించి యువ్వెత్తునం
బోవుం జిందరనంద రై చెలి దురాత్ముల్గొండ డాకస్మిక
శ్రీ వాటిల్లఁగఁ గ్రిందు మీఁదెఱుఁగ కీరీతిం దుదం గ్రుంగ రే. 88

క. తెర యెత్తినగతి మీను
ల్పైరరేఁగుట గడలియలలఁ బె ల్లెగసిన తుం
పురుగుత్తులమొత్తం బని
కరము మదిం దోఁచుచుండెఁ గంటివె యబలా. 89

సీ. ఘుమఘుమరావంబు లమరంగఁ జెలరేఁగి
కోలాట మాడెడుకొమరుఁ జూపుఁ
బుట ముబ్బి యంతలోఁ దటుకున నణఁగుచుఁ
గుప్పిగంతులు వేయునొప్పుఁ జూపుఁ

దీరంబుచెంతకుఁ జేరుచు మరలుచుఁ
జెడుగుడి యాడెడువడువుఁ జూపు
గిరగిర సుడివడఁ దిరుగు లాడుచుఁ గుప్ప
తిరుగుడి యాడెడి తీరుఁ జూపుఁ

గీ. గసిమసఁగి నురువుముద్దలు విసరు చుండి
సఖులతో బంతు లాడెడు సౌరుఁ జూపు
మాటిమాటికి నిప్పు డీ యేటిమగఁడు
బాలలీలలఁ గ్రీడించు భాతి దోఁచు. 90

గీ. వీచిబాహూ విలాసంబు విస్తరించ
మూలములతోడ దరినున్న భూరుహములఁ
బెల్లగించెను వార్ధి గాంభీర్యఘనుఁడు
దరికిఁ జేరినకుజనులఁ దాళఁగలఁ డె. 91

చ. చలునకుఁ బుట్టినిల్లు మణి సంపద కాకరముం గభీరతా
కలనకు తావు జంతువులు కాపుర ముండు పురంబు భూరి ని
ర్మలతకు నిక్కయం చసము రాజిలఁ జేసియుఁ జేయఁ డక్కటా!
నలువ యొకింత రుచ్యతను నా కని యంబుధి యేడ్చుఁ గాంచితే. 92

చ. కలకలకంఠకంఠి యదె కౌతుకముం బొసఁగించె నంబుధిం
గలకలముల్ వణిగ్వరులుఁ గట్టినటెక్కెములం జెలంగుటం
గలకలరాన మెప్పు విహంగంబులు వచ్చుచుఁ బోవు చుంట నా
కులగతి వేఱుసేయుట కగోచర మయ్యెను మింటిచెంగటన్. 93

వ. అని యనేకవిధంబుల సంవర్ణించుచు సమస్తదిశలను ముదితం గాం
జేయుచుం గైదండ యొసంగి పారావార తటంబునం గొంతవడి
సంచరించునంత వారిరాక యెఱింగి యొక్క నావికుం డోనంగూర్చిన
నావపై నమ్మగువం గూర్చుండంజేసి యనంతరం బాజార్జిపుత్త్రిం
డారోహించె నంత. 94

చ. తరణి యొకింత తెమ్మెరకుం దాక నరిత్రముం ద్రిప్పి మెల్లనం
దెరలనుగర్ణధారుం డెగం దీయం గం జేయం గ నంతలోపలం
దరగలపైకి నెక్కుచును దగ్గుచు నేగెను జంతుకోటికీ
కరణి సుఖంబుదుఃఖమును గల్గు నఁటం చెఱిఁగించునో యనన్. 95

ఉ. ఒక్కొకచోట సుళ్ళునడు నొక్కొకచో నిరుపాయ లౌ ను వే
ఱొక్కెడ నిమ్నమౌను బుట ముబ్బు మఱొక్కెడ వేణియాకృతిం
గ్రక్కునం దోంచు నొక్కయెడ రాజపథంబును బోలు నొక్కచో
నొక్కట భంగముల్ వడుం బయోనిధినీరము నావ యేగుచోన్. 96

క. ఇటు లేగి యేగి యవ్వలి
తటముం దరియంగ న వ్వదాన్యుని చేయం
గుట మూఁతంగాంగం గొని యా
కుటిలాలక డిగియె దరవికుంచిత తను వై. 97

వ. తదనంతరంబున. 98

ఉ. ఏకరథోత్తమంబు నపు డిర్వురు నెక్కి బవేరియా యనం
బాఁకట మైనదేశమున రమ్యతరంబని గణ్య మైయమ
ర్బా కనునట్టిపట్టణవరంబున కొంతకనాఁటి కేగి సు
శ్లోకులు వార లందు మనుజు ల్మది మంద హసించి రొప్పుగన్. 99

క. ఆదంపతు లట వారల
చే దేవిని దేవుఁ బోలి సేవితు లౌచున్
మోదించు చుండి రర్థుల
కాదరముల్ లేనిదేశ మన్ననిం గల దే. 100

సీ. పెండిలి కై యొక పేదవాఁ డడిగినఁ
గరమున నన్న రొక్కం బొసంగు
నాకొని కృశియించి యాచించుభిక్షున
కరసి హస్తాంగుళీయక మొసంగు
ధర్మకార్యమునకుఁ దగువారు గోరిన
నప్పుఁ దీసి యొసంగు నంతలోన
నాటపాటలవార లాశించి వచ్చినఁ
దనకట్టుపుట్టముల్ దడయ కిచ్చు
గీ. నుర్వి నెడ్వర్డునరి వదాన్యుండు గలఁడె
యితని కిహలోకబంధువు లెల్ల దూర
మైనఁ బరలోకబంధువు లంటి వెంటఁ
దగిలి రిలఁ దేగకానికిఁ దర మె డాఁగ. 101

వ. ఇవ్విధంబున నందుండి సాధుజనులమైత్రిచే నిల్లు మఱచి వారిం దమ వారికంటె నధికబంధువులు గాఁ దలంచుచుఁ గాలంబుం గడపుచు న్నంత. 102

క. ఎన్నె న్ని స్వాదువస్తువు
లున్నం గడ కొత్తుఁ గాని యొక్కించుక నా
ల్క న్నినిచి యోకిలించును
కన్నెకు నన్నంబుఁ దినుట గడ్డై తోఁచెన్. 103

మత్తకోకిల.
వాలుచూపుల మేలిమాటల వాసి తగ్గఁ గ్రమంబు గాఁ
గేలికాననయానముల్ మదికి న్భరంబు గఁ దోఁచె న
య్యాళి యు న్వెగ టై తనర్చె నయారె యాసతి నాథుకెం
గేలియూఁతను వీడి మూఁపునఁ గేలుఁ జేర్చె క్రమంబునన్. 104

ఆ. మంద మైననడక మందతరం బయ్యె
ధవళ మైనమోము ధవళతరము
నర్థ మింత నట్టు న్యత్యస్త మొక్కటి
సూక్ష్మ మైనకౌను స్థూల మయ్యె. 105

ఉ. అంగము లెల్ల లావయినయప్పుడు కౌను గృశించె నిప్పు డ
య్యంగము లెల్లఁ జిక్కఁగ మహత్త్వముఁ జెందెను గాను చిత్ర మ
య్యంగనమేను కౌనులకు నబ్జభవుండు సృజించువేళ నే
భంగినిఁ గీ లొనర్చె నొకొ పద్మజుచేత యొఱుంగ శక్య మే. 106

ఉ. ఒత్తిన కౌనుదీవ పడు నో యని నేర్పున మేలుతీఁగల
న్హత్తి బిగించి మధ్య మిపు డల్లనఁ బెంపు వహించు చుంటచే
నొత్తిగిలంగఁ జేసి రొ ప్రయోజనశూన్యత నన్నుయట్లు గా
నత్తరి ముత్తరు ల్విడచె నంబుజపత్రవిశాలనేత్రకున్. 107

ఆ. మగువయారుతీగ యొగి సాఁగుచుండంగ
మగని కోర్కెతీగ నెగడి సాఁగె
సతికి గర్భభరము వితత మౌచుండంగఁ
బతికి మోదభరము వితతమయ్యె. 108

ఉ. ఎన్నఁడు నోటఁ బెట్టనివి యిష్టము లై మదిఁ దోఁచి భర్తతో
విన్నప మాచరించుటకు వేడ్క వహింపదు నాన నానియా
సన్న యెఱింగి యాతఁ డవి చక్కటి దెచ్చినఁ జేతఁ బూని యా
చిన్నది నాకు నై శ్రమముఁ జెందునొ నాథుఁ డటంచుఁ జింతిలున్.

శా. రాజీవప్రియయుగర్భమందుఁ గొను నాప్రాగ్దిక్కునుంబోలె నీ
రాజీవాయతనేత్ర చూడ బెడఁ గై రాజిల్లు చున్నట్టిస
త్తేజంబున్ ధరియించుచుండెఁ గద యాతిగ్మాంశునిం బోలె నిం
దే జంతూత్తమ ముండె నో యనుచుఁ దా నెద్వాగ్డ భావించెడున్.

వ. ఇవ్విధంబున విక్టోరియామేరీ లూయిసాదేవి దౌహృదంబు నిస్తరించి క్రమంబునం బరిపుష్టాంగి యై కళాసంపూర్ణయైన చంద్రమూర్తియుం బోలె మనోజ్ఞాంగియై నిండుచూలై యుండ నాకెంటుప్రభువర్యుండు నాకుం బ్రథమాపత్యం బన్యదేశంబునం గలుగుట యనర్హం బని తలంచి యొక్కనాఁడు. 111

చ. అరదముపైఁ బొలంతి నిడి యశ్వపువాగెలఁ దానె పూని నా
గరికులు కొంతదూర మరుగన్ విడఁ జాలక వీడి యామెయుం
గురు లోకయింతదూరఁగఁ గనుగొంచు హయంబుల మెల్లమెల్లనం
జరపుచు నుత్తరాంబునిధి శాఖఁ గనెం దడవేగి వేడ్కతోన్. 112

క. కాండధిని దాటి మరలం
గొండొకదవ్వేగి రాచకొలమునఁగలవా
రుండఁగ నుచితం బగు నిం
గ్లాండునఁ గెన్సింగ్టననునగరమునకేగెన్. 113

క. అందు వసింపఁగ భామిని
కిం దొమ్మిదినెలలు నిండెఁ గెన్సింగ్టనులో
సుందరులు ప్రొద్దుప్రొద్దుం
బొందుగఁ గనిపెట్టి వచ్చి పోదురు నెమ్మిన్. 114

గీ. సతికి నీళ్ళాడుప్రొద్దులు జరుగుచుండ
నామెపైఁ బ్రీతి యంతంత కతిశయించి
ఫలముగర్భమునంగలకలమలక్ష్మి
బోలెఁ గాంచుచు ముదమునఁ బొదలె నతఁడు. 115

సీ. యువజనంబుల నెల్ల నురుతరసంమోహ
మగ్నులఁ గావించు మాంత్రికుండు
ప్రబలజిహ్వాదోష బాధితకోకిల
వాగ్బంధ ముడిపెడు వైద్యవరుఁడు

దూపిల్లి యట్టమటుఁ దూలు తేంట్లకు రస
దానం బొనర్చెడు ధర్మశాలి
శాఖిలతాగుల్మ శైలూషులకు మంచి
పాత్రముల్ నియమించు సూత్రధారుఁ
గీ. డగుచుఁ బొగ డొందియొకక్రొత్త సొగసు నొసఁగి
లోకముల నెల్ల నవు డన్య థాకరించు
శక్తిచే మించుచుండు వసంతసమయ
మఖిలదేశంబు గొబ్బున నావరించె. 116

క. ధరణీరుహములు తామొం
డొరుతో నిక్కార్య మిట్టు లొకకాలమునన్
జరుపుద మనుకొని చేసిన
కరణిన్ సొరుగాకులెల్లఁ గ్రక్కున రాల్చెన్. 117

సీ. తొలు దొల్త మోసులై తోఁచిమ్రాఁకులనంటి
కోయిలకన్నుల కొమరుమిగులుఁ
దల యెత్తి మెల్లన మొలక లై కాన్పించి
పికిలికుచ్చులరీతిఁ బెంపుఁ జూపు
నంతంత రెక్కొని యా కేరుపడునంతఁ
గృకవాకుశిఖలను గ్రేణిసేయుఁ
గొనసాఁగి తీవ లై మొనఁ జూపు చున్నంత
గరుడపక్షంబుల మురువుఁ జూపుఁ

గీ. గాచి సాఁగించు మరుని చేకత్తు లనఁగ
వేళవేళకు నొకవింత డాలుఁ బూని
మంజిమంబున కిరవైన కెంజివురులు
మెల్లమెల్లన మ్రాఁకుల నుల్లసిల్లె. 118

గీ. వృద్ధులకు నత్తరినిఁ జిత్తవృత్తి గలఁగెఁ
దరుణజనముల నిఁకఁ జెప్పఁ దలఁప నేల
మొరడుమ్రాఁకులు చక్కనిమొలక లెత్తె
నింక నెలమ్రాఁకులను నచియింప నేల. 119

క. ప్రసవించె నెల్లవల్లులుఁ
గుసుమముల వసంతవేళఁ గోమలరీతిం
బ్రసవించెడు నీగతి నొక
కుసుమము నెడ్వర్డువిభుని కోమలి యనఁగన్. 120

క. నాయంతటియేలిక యీ
చాయం బ్రభవించు నంచు సకుతూహలుఁడై
పాయక కనుఁగొనుటకు నన
ఛాయాప్రియుఁ డుత్తరమునఁ జనఁగఁదొడంగెన్. 121

చ. త్వరపడి కర్జముల్ జరపి వచ్చెదువారు ను వచ్చి క్రమ్మరన్
జరుపుదు మన్నవారలు ను జయ్యన నిండ్లకు వచ్చి కార్యముల్
జెరచెడు వారు వైరి పెరసీమల కేగిన కార్యతత్పరుల్
దరుణులఁ జూచు వేడ్క యెడదం బెర రేఁచఁగ నట్టియామనిన్ 122

ఉ. ఓయెలనాగలార! వినుఁ డోతరుణోత్తములార! యిట్లు పం
చాయుధునాజ్ఞ యొండొరుల నామనివేళల వీడ కుండుఁ డో
హో యని యెల్లవారు విన నుచ్చ్రితదీర్ఘకలస్వనంబుతోఁ
గోయిలపిండు నల్దెసలఁ గ్రుమ్మరి చాటఁ దొడంగె నయ్యెడన్. 123

క. తుమ్మెదలు స్వాదుమకరం
దమ్ములు తనియంగఁ గ్రోలి తరుణులతోడన్
సమ్మద ముప్పతిలం గా
నమ్ములు సేయం దొడంగె నవనవఫణితిన్. 124

గీ. నిర్మలుల కుపకృతియు ననిర్మలులకు
నపకృతియుఁ జేయు నేలిక యవతరించు
ననుచుఁ బ్రకటించుకరణి నయ్యవసరమున
నహము లభివృద్ధిని వహించె నణఁగె నిశలు. 125

గీ. దిశలు నీహారమును బాసి తెల్వి మీఱె
నాకసం బభ్రశూన్య మై యమల మయ్యెఁ
బుష్పితారామలసిత లై పుడమి యొసఁగెఁ
బ్రజలు భాసిల్లి రపుడు నీరుజత గాంచి. 126

ఉ. అట్టివినిర్మలంపుసమయంబున నెమ్మదిఁ గెంటుకొనికిం
దొట్టినమోదవార్ధి వెలి దొల్కఁగ నెచ్చెలిపిండుకన్దొవల్
నెట్టన నుల్లసిల్ల రమణీమణి యా మెరిలూయిసాఖ్యకుం
బుట్టె సుపుత్త్రి శుభ్రరుచిఁ బూర్వదిగంగన కిందులేఖ నాన్. 127

క. పదునెనిమిదిశతములపైఁ
బదితొమ్మిదియైనక్రీస్తుసర్షమునం ది
ర్వదినాల్గవమెయి నెలనిశ
నుదయించెఁ జతుర్థఘంట నుత్సన మలరన్. 128

చ. అనుపహతప్రమోదఘటనాసదృశం బగునట్టిపుత్త్రికా
జననశుభప్రవృత్తిని వెస న్వినిపించినసత్ప్రియాసఖీ
జనమునకుం బ్రతిప్రియ మొసంగుటకుం దగినట్టివస్తువుం
గనుఁగొన లేక చిత్తమునఁ గల్గినచింత యణంచె మోదమున్. 129

ఉ. దాదులగుంపు బాలికకుఁ దానముఁజేసి కవోష్ణవారిచే
మోదము మీఱఁ గాఁ గుబుసముం దొడి పొత్తుల నించె శుక్తిగ
ర్భోదిత మైనమౌక్తికము నొప్పుగఁ బుల్గడిగించి నేర్పునన్
గేదఁగిరేకుసంపుటము గీల్కొనఁ జేసినభాతి మీఱఁగన్. 130

క. తల్లి యొు నప్పుడు గడురం
జిల్లెను బాలామణీవిశేషితరుచి యై
వల్లిక విస్ఫుటసుమనో
వల్లరిచే వాసి మీఱువైఖరి దోఁపన్. 131

క. చల్లనికమ్మనితెమ్మెర
యెల్లెడల న్వీచె లోకహితవార్తం దా
నుల్లాసంబున జనులకుఁ
దెల్లము సేయంగఁ గోరి తిరుగు నన౦ గాన్. 132

గీ. ఇట్టిశుభవార్త నగరమం దెల్లఁ బ్రాఁకి
శయ్యపై నున్నవారలసరస కేగి
శ్రుతిపుటంబుల నమృత మై సోఁకి యపుడు
మేలు నేఁడ ని నిద్దుర మేలుకొల్పె. 133

ఆ. భాగ్యలక్షణములు ప్రచ్ఛన్నదశ నున్నఁ
గన్నవారి కెల్లఁ గనులవిందు
విన్నవారి కెల్ల వీనులవిం దయ్యె
బాల పుట్టినాఁ డె మేలి దెచు. 134

ఉ. ఇంత గదమ్మ కన్గవ నిశేశ్వరుఁ డమ్మ మొగంబు వానిలోఁ
గొంత గదమ్మ నెన్నుదురు కోమలదేహము వానికాంతితోఁ
బంతము లాఁడు నమ్మ యవిభావిత మాఁ గద వమ్మ కాను బల్
వింత గద మ్మ రూపు కనువిందని పల్కిరి చాన లక్కొమన్. 135

ఉ. అంతట లోకరక్షణపరాయణ రాణి జనించుట న్శచీ
కాంతుఁడు మోమున న్నగవు గ్రమ్మి పయిం బయి వెల్లిఁగొల్పఁగా
సంతస మందుచుండె ననఁ జక్కని తెల్వదయించెఁ బ్రాగ్దిశో
ప్రాంతమునందుఁ బొల్చె నటుపై నరుణత్వము కొంతవేళకున్. 136

మ. ప్రమదారత్నము కెంటుభూధవుకళత్రం బార్యచారిత్ర యకా
కొమిరెం గాంచె నటంచు నీడజము లుద్ఘోషించుచో దిక్కులం
గమలంబు ల్వికసించె సాధుజనవక్త్రంబు ల్వలెన్ హృద్యతం
గముదంబు ల్ముకుళించె దుర్జనులయక్షు ల్బోలె నిశ్శ్రీకతన్. 137

సీ. వెలవెలఁబారె దివ్వెలు దవ్వుసాఁగిన
కరముల నంతంతఁ గిరము ముడిచి
తెలతెలవారె దిక్కులు చూడఁజూడఁగ
నిరులమొత్తమ్ములఁ దరిమివైచి
కలకల లాఁడె జక్కవలు మక్కువ మీఱి
విరహసంతాపంబు వెడల నడఁచి
మలమల లాఁడె వెన్నెలపుల్గు లాఁకఁట
వాతిచెంగటికూడు వాసి పోవ

గీ. శోభితు లశోభు లౌదు రశోభు లధిక
శోభు లౌదురు దుఃఖితుల్ సుఖితు లౌదు
రార్తసుఖులును దుఃఖితు లౌదు రహహ!
కాలమహిమంబు వర్ణింపఁ గలరె యెవరు. 138

చ. కలువలఁ బోఁడు డిందుపడెఁ గాంతివిహీనము లయ్యె నెల్లరి
క్కలు వలఁబోఁడు జేయుపనిఁ గానక చేవిలు నమ్ము లొక్కెడం
దొలఁగఁగవైచె దీపములు దుర్గతి నినుం డుదయింపఁ దేజముల్
గలప్రభు వుల్లసిల్ల నిలఁ గాంతురె యన్యులు వైభవోన్నతిన్. 139

సీ. నను నిద్రవేళ నేలినదేవుఁడీపవ
లేలెడు ననుచుఁ బ్రార్థించువారు
వింటిమి గద నేఁటివేకువఁ దొలుదొల్త
మేలివార్త యటంచు మెచ్చువారు

తొలినాఁట నరఁ జేసి నిలపినకార్యముల్
క్రమ్మరఁ జేయంగఁ గడఁగువారు
కౌఁగిటిలో నున్నకాంతను విడ లేక
విడచి కేళిగృహంబు వెడలువారు

గీ. రేపకడ మోడ్చి విచ్చి నిర్నిద్రరక్త
నేత్రయుగళముఁ జేతుల నిమిరికొనుచు
నావులించుచు శయ్యపై నటమటించు
వారు నై రెల్లవారుఁ బ్రభాతవేళ 140

శా. ఆబాలామణి పుట్టినట్టిదినమం దాబాలగోపాలముం
బూబంతుల్ దగఁబూని చిమ్ముచును గోపుల్ వేయువా రింపుగా
బాబామొత్తము సెక్కి చిత్రగతులం బాటించువారుగా రస
ప్రాబల్యంబునఁ బాడువారు నయి రప్పౌరుల్ దృఢోత్సాహు లై.

క. అందంగ రానికౌతుక
మందుచు నెద్వర్ధు సిరికి నధికతరముగా
విందు లొనరించె విందుల
కుం దగువారలకుఁ జెలులకుఁ సరసులకుఁ. 142

సీ. అజార్జిపాత్రిక నమర రష్యాచక్ర
వర్తిపే రాదిని వరలు చుండ
జనయిత్రినామంబు నొనఁగూర్చి గురుముఖ్య
ముఖ్యబంధువు లెల్ల సఖ్యగరిమ

సలలితంబుగ నలజ్జాంఘ్రినావిష్టోరి
యా యను పే రిడి రవుడు మఱియు
మేలివసంతర్తువేళ జనించుట
గుసుమకోమలదేహలసిత యౌట

గీ. సుగుణసౌరభ్యవాసిత యగుటయుఁ దగ
నారసి వసంతకుసుమమం చాఖ్య యొసఁగి
రహహ యబ్బాల కనురూప మైననామ
మిడినవారలవైదగ్ధ్య మెన్న నరిది. 143

ఆ. గడియ కొక్కకరణిఁ గౌతుక మొనఁగూర్చెఁ
దల్లి కయ్యపత్యదర్శనంబు
కూఁతురూపు గడియకొక్కతీరై దయా నొకొ
మాతచూపు గడియ మారు నొక్కొ. 144

సీ. కరములు పాదముల్ గదలంగఁ బలుమారు
నూకొనునపు డొకయొరపు నెరపు
బోర్కాడి పిమ్మటఁ బొత్తుల నుత్తాన
శాయిని యై యొకసౌరుమీఱుఁ
బాలు దావెడువేళఁ బలుగప్పఁ జుబుకంబు
గఁపించునపు డొకసొంపు బెంపుఁ
గనుబొమల్ వాతెర యొనరంగ విరచుచు
నేడుచుచో నొకయింపునింపు

గీ. నుగ్గిడెడువేళ దాదులు బుగ్గమీఁట
ఘుటఘుటరవంబుతో నొకకొమరుఁ జూపు
నట్టిముద్దులుగుల్కెడుపట్టి నహహ!
కన్నయెలనాగ దే భాగ్యగరిమగాదె. 145

ఉ. ముంగురు లింపు మీరుచును మోమునఁ దుంపెసలారఁ గాంచివా
ప్తాంగుళిపల్లవాగ్రముల నర్మిలి నజ్జనయిత్రి వేడ్కతో
జంగున బాలుబుగ్గలను జారుగతి న్నిమురంగ నంతలోఁ
బొంగుచు నవ్వునాశిశువు ముద్దుఁగొనుం గద పుణ్యమెట్టిదో. 146

క. ఒడయల కొడయఁడ నైనా
పిడికిటఁ నీపుడమి నెల్లఁ బెట్టెద నంచుం
బడిబడినిఁ జిన్నిముద్దుల
పడఁతుక పిడికిళ్ళ నపుడు బట్టఁగ సాఁగెన్. 147

క. ఏకాలంబున నెడ్వ
ర్లేకడ కేగినను జిత్త మెడయక తనయా
లోకనకౌతూహలముం
జేకొనుట న్మరల మరలఁ జెందుం గృహముల్. 148

మ. తనయుం జేతుల నెత్తి ముద్దుఁ గొని యంతన్ డించి యింకొక్కము
ద్దు నొసంగంగదె తల్లి యంచు మరలం దోడ్తోడ నే ముద్దుఁ గై
కొని యేతెంచుచు మళ్ళిమళ్ళి పదవిం గూర్మిన్ విలోకించుచుం
జని యొక్కించుక కర్జపుందెరపి నిచ్చున్ నచ్చు నాతం డొగిన్.

శా. నానాదోహదసంస్క్రియాపటిలసన్నైపుణ్యసంయుక్తి ను
ద్యానాంతస్స్ఫుటవల్లికల్ పలె ననంధ్యశ్రీ విరాజిల్లఁ గా
నానాటం బరిపుష్టిఁ జెందె బిసినీనాళోల్లసద్వ్యాలికా
నూనాంగంబులు చూడఁ జూడఁ జననీయుక్తోపచారంబులన్. 150

మ. అసితాబ్జేక్షణబాహునల్లరుల దుర్యం బైనమాసంబునం
గసుగందంగఁ జికిత్సకుం డిడినటీకా లుల్లసిల్లెం గనున్
బిసకాండంబుల హంసచంచునిహతుల్ వెల్గొంచుచందంబునన్
బొసఁగం దీవలఁ గంటకక్షతము లొప్పల్ మీఱుతీ రొప్పఁ గన్.

మ. అహహా! యాశిశుజన్మవర్షమున నన్యోన్యోపఘాతంబులన్
బహుబాధల్ బడువారు భూమిపతులం బాటింప కిచ్ఛాగతిన్
విహరింపం గఁ గడంగువారుఁ గరమున్ నిప్పచ్చరంబుల్ హతా
న్నిహతుల్ హెచ్చఁ గ నేగువారు నగుచు న్నిర్విణ్ణులై రెల్లరున్.

మ. సకలోర్వీతల మేలఁ జాలినభవిష్యద్రాజ్ఞి జన్మింపఁ గాఁ
బ్రకటం బొప్పఁగ నిట్టిక్షోభ ముదయింపన్ సాఁగె మున్మున్నుగా
నకలంకాత్ములు తేజరిల్లుటకు మున్నా నిట్టియిక్కట్లు పా
వకునిం గ్రమ్మ వె ధూమజాలములు పైపై జ్వాలకు న్మున్నుగాన్.

ఉ. ఉన్నియతోడ బుష్పముల నొప్పు దలిర్పఁ గఁ జేసి తల్లి యా
కన్నె కలంకరింప నది గాంచి యకృత్రిమనిత్యదీప్తిసం
పన్నిధి యావసంతకుసుమంబునకుం గుసుమంబు లేల యం
చు న్నెలఁతల్ తదీయముఖచుంబనముం బొనరింత్రు నవ్వుచున్.

క. తన కిం పగుభూషణముం
జనకుం డీడఁ దనకు నిం పొసంగెడుతొడవుం
జనని యిడు నయ్యపత్య
మ్మునకున్ వాత్సల్యగరిమ ముచ్చటఁ బెనుపన్. 155

శా. సంతోషంబున నొక్కనాఁ డొకమతాచార్యుండు ప్రస్తావనన్
సంతానం బొనఁగూడినందులకుఁ బుంసంతాన మే డైన నిం
కిం తై యుండును సంతసం బనుచుఁ బ్రిన్సెడ్వర్డుతోఁ బల్కె ధీ
మంతుం డాతఁ డశేషసాధుజనసంమాన్యోక్తిచే నిట్లనున్. 156

క. అయ్యా మీరిటు లానతి
యియ్యం గాఁ దగునె దూర మెఱిఁగినవా రా
దయ్యం బొసఁగినసంతతి
వెయ్యారులు ధనము గాదె వేఱొకఁ డేలా. 157

ఉ. ఎట్టికులప్రతిష్ఠలు వహింపఁగ నున్న దొ యెట్టి కీర్తికై
పుట్టె నొ యెట్టివైభవముఁ బొందు నొ యెట్టిగుణాఢ్య యౌనొ యీ
పట్టి వెలంది యంచు వెడవాటుగఁ జూడఁగ వచ్చు నయ్య మీ
యట్టి రటంచుఁ బల్కె సుతయం దతఁ డెంతటివత్సలుం డొకో. 158

వ. ఇట్లు కెన్సింగ్టను పురంబున నయ్యలగ్జాండ్రి నావిక్టోరియా కుమారి కామణికి మాసపంచకంబు సుఖంబునం జరుగ నొక్కనాఁ డాదంపతులు హృద్యం బగుపురంబున నివసించువేడుక బొడమ వసంతకుసుమాలంకృతు లై నిర్గమించి యింగ్లండుదేశంబున దక్షిణసముద్రతీరంబున కలంకారం బైన సిడ్మౌతు నాఁ బరఁగు వీఁటం బ్రవేశించి యుండిరంత. 159

ఆ. అన్వసంతకుసుమ మామోదమును బెంపఁ
దత్ప్రకైకవృత్తిఁ దవిలి యందు
వారిచిత్తభృంగ వరయుగళ మొక్క
క్షణముఁ బాసి యుండఁ జాల దయ్యె. 160

సీ. తండ్రియాజ్ఞాస్థభూధవుఁడు నిరర్గళ
వృత్తిమై రాజ్యంబు నేలు చుండ
నతనిపరోక్షంబు నందుఁ బీఠమునకుఁ
దనముగ్గు రన్నలు నొనరియుండ
వారికి సంతతి వరలె నేనియు నది
యేలిక యాటకుఁ జాలి యుండ
దైవయోగంబునఁ దనకునుఁ గొమరులు
బుట్టినవారలు పొసఁగి యుండ

గీ. నౌర యెడ్వర్డు తనకూఁతు నాప్తులకును
జూపు నింగ్లండురాణి యంచును ముదమున
నిన్ని సోపానములు దాటి యున్న తపద
మొందు నని యెంచు నే దైవయోగ మెటులొ. 161

ఆ. వేఁడి యింత సోఁకి వాడు నూపక యుండఁ
బలువురికరములను నలఁగ కుండఁ
గరుపలి యును దాఁకి పరువంబు జెడ కుండ
నెసఁగె నవ్వసంతకుసుమ మెలమి. 162

క. ఒకయుపమాత గవాక్ష
మ్మొకడ నలగ్జాండ్రినన్ సముత్సుకమున నె
త్తికొని వినోదంబునకై
యొకప్రాగ్దిన సంచరించు చుండఁగ నంతన్. 163

శా. బాలుం డొక్కరుఁ డొక్కపక్షి విదలం బారం గడబ్బాటుగా
నాలోకించి తుపాకి వ్రేటు గురి సేయం దప్పి విక్టోరియా
ఫాలప్రాంతము నొత్తి పోయిన క్రియం బారెం దదాకస్మికా
భీలత్వంబున ఘొల్లు మం చటజనుల్ భీతిల్లి రొక్కుమ్మడిన్. 164

గీ. అట్టియాపద యాసన్న మై తొలఁగుట
నా మె చిరజీవిని యనంగ నసువు పడియె
నాపదలఁ బట్టి పడగొంటు నాయు వనుచు
నెల్లవారలుఁ బల్కుట కల్ల యగునె. 165

క. అవ్వేఁటకానిఁ గొందఱు
చివ్వన నెద్వడ్డచెంతఁ జేర్చఁగ నతఁడున్
దవ్వుల కేగఁగ వలెఁ గా
కివ్విధమునఁ జేయ వచ్చునే యని విడచెన్. 166

ఉ. ప్రాణసమాన యైన తనపట్టికి జీవితమున్ హరింప నా
హాని యొనర్పఁ గాఁ గడఁగునంతటిబాలిశు నొవ్వ నాడఁ గా
నైనఁ దలంప కూరక యె యన్నినయంతటిసాధు వృందు నే
యానరవర్యసచ్చరిత మాతని కే తగుఁ గాక యెంచఁ గన్. 167

కం. ఈకరణి నతఁడు పుణ్య
శ్లోకుం డై తనదుపవిత్రశుభచరితలచే
లోకుల నెల్లం దనకున్
లోకునఁ గాఁ జేసె నపు డనుద్ధతిమీఱన్. 168

కం. అయ్యెడ్వర్డొకయప్పుడు
నయ్యాళి మొనర్ప గ్రామబాహ్యస్థలియం
దొయ్యనఁ జరించి మరలం
జయ్యన హిమసిక్తసిచయచయుఁడై వచ్చెన్. 169

చ. పరగఁగ బుద్ధికర్మ నెడఁబాయ దటందురు గా దె యాతఁ డ
ప్పురమున వచ్చి వేగఁ దడిబట్టలు వీడక మున్నె ముంగిటన్
నరవుడపుంబొలంతి యలబాలను లాలన జేయుచుండఁ గాఁ
గరములఁ బట్టి యెత్తికొని కౌఁగిటఁ జేర్చుచు ముద్దు సేయుచున్.

కం. తడ వీగతిఁ దడిపుట్టము
విడువక వాత్సల్యరసము వెల్లిఁ గొనం గా
బుడుతతమి నున్నయతనికిఁ
బొడమెన్ శైత్యాతిరేకమున వేకి మెయిన్. 171

ఉ. వెజ్జులు వచ్చి మందులును వేళ్ళకషాయము లెన్ని యిచ్చినన్
న జ్జధికంబు గాఁ దొడఁగె నాడులు దొట్రిలె నాడునాటికిన్
సెజ్జపయిం దివానిశముఁ జేర్చినయంగము స్రుక్కె నన్నముం
బజ్జ విడం బ్రసక్తియును బాసె నికేమన గెంటు తేనికిన్. 172

చ. పడఁతుక దుఃఖవారినిధిపా లొనరించి యు ముద్దుపట్టికిం
బడయక యుండఁ జేసి పితృపాలనసౌఖ్యము గన్నతల్లికిం
గడుపున వెత్తిఁ జేసిగుణగణ్యులసంఖ్యకు లోటుఁ జేసిపై
నుడువ నశక్య మాదశను నోట వచింపఁగ నెట్టు గా నగున్. 173

ఉ. అక్కట! యన్యదేశమున నా మెరిబాయిస చూడఁ జుట్టమున్
మ్రొక్కఁ గ దైవముం గనక రోజెదు నప్పసిపాప నయ్యెడం
జక్కటిఁ దీసికొంచు నతిసాంద్రవినిర్గళితాశ్రుధారలై
పెక్కుతెరంగులన్ విభునిఁ జేర్కొని పొక్కఁగ సాఁగె నెంతయున్

ఉ. హా సుగుణాఢ్య! నన్ను విడనాడితె హా పరజార్జిపుత్త్రి! నేఁ
జేసిననేర మేమి యిటు జేయఁ గ హా కులదీపకా! ననుం
బాసి చనం గ నా నె చిఱుపాపఁ గరంబులఁ బట్టి దగ్గరం
దీసుక ప్రేమ నిష్టములఁ దేల్చెడువా రిఁక నెవ్వ రయ్యయో. 175

క. ఇటు వనరుచు నాసతి చెం
గటిహితు లోదార్చఁ గొంత గాంచెఁ బ్రకృతి నం
తటిలోన లియోఫా ల్డ
చ్చటికిం జనుదెంచి యపుడు సైదోడునకున్ 176

గీ. సాంత్వవాదములను దుఃఖశాంతిఁ జేసి
యామె నత్తింట నుంచుట యర్హ మనుచు
మేనఁగోడలితో రాజధాని యైన
పుడమి తొడవగులండనుపురముఁ జేర్చె. 177

ఉ. ఎన్నఁగఁ గోరుచుట్టుపయి నే పడె రోకఁటిదెబ్బ యన్న య
ట్లన్న యుఁ జెల్లెలుꠓ శిశువు నన్న గరంబును జెందునాఁడె యా
పన్నత నొందె రాజ్యపదపాలుఁడు మూఁడనజాృష్జ యక్కటా !
యన్నిసు వెన్నికష్టముల నందఁ దగె న్నెల లేదు దాఁటఁగꠓ. 178

వ. ఇట్లిలఙ్గాండ్రినా విక్టోరియా బాలికకుం దండ్రి తాతలు నామమా
త్రశేషు లౌటం జేసి మాతులుం డయిన లియోఫాల్డు తన చెల్లెలిం
గోడలిం గ్లేర్మంటు నాఁ బరఁగుతనవీఁటికి నప్పు డప్పుడు గొంపో
వుచుం దనవిత్తంబు నం దించించుక వారలకుం బుచ్చుచుఁ దన కా
ర్యంబు లందు మువ్వంతుగా వారి యోగక్షేమంబు లరయుట యె
ప్రథానంబు జేసికొని జాగరూకుం డై యుండె నంత. 179

ఉ. మెండు గ భూరిసంపదల మేటి యనం దనరారి చూడఁగ
న్నుండువ యాసిరిం దనరి బ్రన్స్విక వంశపురాజధాని యిం
గ్లండున కెన్నఁ గాఁ దగినలాంఛన మై విలసిల్లు నెంత యుꠓ
లండనునామధేయమున లక్ష్మి నసించెడుతెల్లదమ్మి నాꠓ. 180

సీ. ఆపురంబున నుంకు గోపురంబులు లక్ష్మి
కాపురం బున్నట్టి లేపుఁజూపు
నావీఁట దనరువనీవాటములు పూల
చే వాటమగు నొప్పుచేత నొప్పు
నాపట్టణంబునఁ జూపట్టుఁగడిమికిఁ
జేపట్టు గా మించుసేన లెలమి
నానగరంబునఁ గానఁగ రాఁ డొకఁ
డైన గరా సెంత యారసినను

గీ. కన్నుదోయికి దృశ్యంబు గాదుగాన
వేలుపులపోలు మిక్కిలి మేలి దనుమఁ
గవిపరులు బల్కుచుండుౘ వాక్ప్రౌఢి మెరయ
దీన లేనట్టిసొబగు లెంౘ జేనిఁ గల వె. 181

శా. ప్రాకారం బతిచిత్ర మప్పురిని స్థైర్యం బూన కిచ్చాగతిం
గైకొం చొప్పి శతఘ్నికాశతవినిర్గచ్ఛన్మహాగోళదీ
ప్రాకారంబున వైరులం జదుపఁ దా నై యోధముఖ్యుం డనం
డీకో జాలు ననేకయంత్రములవేడిం బైపయిం జిమ్ముచున్. 182

క. దారవలోహమయప్రా
కారంబు సచేతనంబు కరణిం దానే
దోరింపం జాలం గా
వైరుల నణఁచుటకు వేఱె వలయు నె జోదుల్. 183

ఉ. అచ్చట వాడుచుండెద రనంతము లైనసువర్ణముద్రికల్
బచ్చుల కిచ్చి పుచ్చుకొను పట్లను భృత్యులవేతనంబులన్
వెచ్చముఁ దెచ్చువేళలను వెండిని రాగి నొనర్చునాణెముల్
మచ్చున కైన లేవు విడిమట్టు గదా నగరంబు లచ్చికిన్. 184

సీ. బలవద్బలీవర్దబలసమాకృష్ట మౌ
బండ్లగుం పొకయోరఁ బరచు చుండ
వానికన్నను జవవంతము లౌనశ్వ
శకటంబు లొక వంక జరుగు చుండ

వానికివానికిఁబై నేగురయమునఁ
ద్రొక్కుడుంబం క్తొక్కయిక్కఁ బోవ
వాని వానిని వాని సంచించి పరచెడు
పావబంక్తు నొకయెడం బొలుచుచుండ

గీ. నప్పురీమణి చక్రమయంబు గాఁగ
యంత్రశాలవిధంబున హరువు మీఱఁ
బెక్కురసముల బధిరితదిక్కు మాచు
మాటిమాటికిఁ గడలికి మారుమోఁయు. 185

క. అరిజనులకు దుస్తరము మ
కరముఖజంతునిలయము నగాధము కృతకే
తరము ను నావికసైనిక
భరితము నగుపరిఖ దనరుఁ బట్టణమునకున్. 186

ఉ. ఎల్లపురీవరంబులకు నేలిక యిప్పురి యంచుఁ జక్కఁగాఁ
దెల్లము సేయ నెన్నుదుటఁ దీర్చినమేల్ శశికాంతపట్ట మై
తెల్లనియాకృతిం దనరి క్షేమ్యసమాఖ్యనదీలలామ ము
త్ఫుల్లతరంగరంగ మయి పొల్పు వహించును దక్కినంబునన్. 187

ఉ. ఓడలబారుల న్నది మహోన్నతిఁ జూపుల కింపు నింపఁగా
మేడలబారు లొడ్డునకు మేలివిభూషణ మై యెసంగఁ గాఁ
జూడఁగ వింతవారలకుఁ జోద్యము గా విభజింప రాక య
య్యోడలు నిర్ణయింపఁబడు నుచ్ఛ్రితవీచివిలోలితంబు లై. 188

మ. అచట న్మేటిగృహస్థు లుచ్చతర మాహార్మ్యాళిపైఁ గేతువుల్
రచియింపంగ దదంతరాళమున జంత్రంపుంబూవల్ మింటిపైఁ
బచరించుం గద హవ్యవాహుఁడు పురీ వాస్తవ్యసంసారి యై
ప్రచురంబై తగఁ దాను గొన్నిపడగల్ భాస్వద్గతి న్నిల్పె నాన్.

గీ. వేవెలుంగులవేలుపు వీటిభటుల
తేజమున కోసరిల్లిన తెఱఁగు దోపఁ
బహుళసమయములఁ గన రాక పట్టపగటఁ
దొంగిచూచుచు నల్లనఁ దొలఁగి చనును. 190

శా. కాంతుల్ గాంతలఁ గూడి థేమ్సుతటినీ కంజాతవాతమ్ము త
త్ప్రాంతోద్యానలతానికుంజముల మందప్రక్రియం బాఁకుచున్
శ్రాంతిం దీర్చ సుధాయమానవిలసత్సల్లాపు లై యందు ఘ
స్రాంతంబందుఁ జరించు చుందురు గృహీతాన్యోన్యహస్తాగ్రు లై.

చ. అట వినువాకపోల్కి శుచి యై రుచిరాంబుసమృద్ధ యైనయ
త్తటిని యొకానొక ప్లవము దట్టముగాఁ గురియంగ నీరు మి
క్కుటముగ గడ్డ కట్టి పథికుల్ పదచారమునం జరింపఁ గాఁ
బటికపుకుట్టిమంబుక్రియ భాసిలు నిద్దపు కాంతులొప్పఁగన్. 192

గీ. చావొకటి మరలఁగఁ జేయుశక్తి లేదు
లండనుపురీపరంబున నుండువారి
కనెడునపకీర్తి యును దెల్ల నొచుఁ దోఁచె
నన్యవస్తువు లిఁకఁ దెల్ల నౌట యరు దె 193

ఉ. ఎక్కడఁ జూచినం బుడమి యీనినచాడ్పునఁ బౌరమానవుల్
పెక్కుగృహంబులన్ విపణివీథులఁ బంచల రచ్చపట్టులం
గ్రిక్కిరియంగ నుండి పరికింపఁగ విస్తృత మైనవీట నొ
క్కొక్కెడఁ బట్టు చాలక యెయియ్యందురు నావల క్షేమ్మునిమ్ముగన్.

సీ. ఏదేశవాసుల నెఱుఁగఁ దలంచిన
నాపట్టణంబున నరయ వలయు
నేచిత్రశిల్పంబు లీక్షింత మనికొన్న
నాపట్టణంబున నరయ వలయు
నెట్టిదుర్లభవస్తు వెంచి చూచెద మన్న
నాపట్టణంబున నరయవలయు
నెట్టివిన్నాణముల్ పట్టి యెంచెద మన్న
నాపట్టణంబున నరయవలయు

గీ. నచటిసొబగుల నింపుగా నరయువాఁడు
మదిని వైరాగ్యవృత్తిచే మరలుఁ గాక
యెన్నటికి నైనఁ దృప్తిజనింపఁ గలదె
పదులు నూఱులు వేలు న బలుకు లేల. 195

శా. ఆలంతన్పురరాజ్యపీఠమున ముఖ్యామాత్యు లున్ నైగముల్
శీలశ్రేష్ఠులుఁ గూడి నాలుగవజార్జి న్నిల్పఁ గా నాతఁడుం
బాలించె న్మహిమండలంబు బగఱ న్మర్దించి సామంతభూ
పాలున్ దా మఱిగాపు లై కొలచి కప్పంబుల్ పదుల్ కోట్లిడన్

గీ. అతఁడు దండ్రికి నీడు గా నవని నేల
నెల్లవారికి ముదము సంధిల్లెఁ గాని
జారచోరులకును సత్యదూరులకును
కూళలకు నింత సుఖము చేకూర దయ్యె. 197

ఆ. పతివియోగదుఃఖపతి యైనతనతల్లి
నూరడింప వచ్చి యున్నతనదు
తండ్రిఁ బోలు పెద్దతండ్రి యా యార్కొను
కూఁతు రవ్వసంతకుసుమ మరసి. 198

చ. జనకుఁ డటంచుఁ జేతులను జాఁచి పయిం బడ యార్కొనేఁడు న
త్తనయను ముద్దుఁ బెట్టుకొని దగ్గరఁ దీయుచుఁ దండ్రిఁ బోలె దా
ననుపమవత్సలత్వమున నామెకు నిష్టము లైనవస్తువుల్
బనిపడి తెచ్చి యిచ్చి తనపట్టినలెం గను చుండు నిచ్చలున్. 199

ఉ. తక్కిన యట్టిపెద్దపినతండ్రు లనాదరణంబు సేయఁ గా
నక్కొమిరెం దయం బెనుచు చమ్మరిలూయిస యించు కించు కే
రొక్కము న్యాయసాంఘికనరుల్ దమ కియ్యఁ గఁ జాలిచాలమిం
బొక్కుచు నెట్టకేని దినముల్ వెడలించుచు నుండె నీక్రియన్.

సీ. కాలునేతులు మోపి నేలఁబాకుచు నుండ
నొత్తె నేమో యని తత్తఁల్లు
విద్దెముల్ సేయుచు దద్దరిల్లి పడంగ
నొచ్చె నేమో యని నొచ్చుకొనుచు

నగ వొప్పఁ దప్పటడుగు లిడి తూలంగఁ
బడు నేమొకో యని పట్టి యెత్తు
గునుకుపరువున వచ్చి తనపైనిఁ బడు చుండ
నలసె నేమో యని యక్కుఁ జేర్చు

గీ. బున్వు దినువేళ నించుక పొరక వార
నెదఁ గరంబునఁ జమురుచు బెదరి చూచు
బిడ్డతోఁ బుట్టి పెరిగెడు ప్రేమ మిట్లు
కన్నవారలచిత్తముల్ గలఁత పరచు. 201

వ. అంత నొక్కదినంబున నొకదాది లీలావిహారార్థంబు గాఁ ద్రివర్ష
ప్రాయంబునం గలయొద్వర్ధతనూజ నొక్క జననాశ్వంబులం బూ
న్చినపుష్పరథంబుపై నునిచి ధారాళవాతసంచారరమ్యంబు లగు తా
వులం ద్రిప్పు చుండ నొకసారమేయంబు పయపాటంబులం దాఁక నది
బెదరి సారథి కనశం బై తూలిన నబ్బాలిక చక్రద్వయాంతరాళంబు
నం బడిన నొక్కసైనికుండు తదీయచేలాంచలంబుఁ బట్టి యాకర్షించి
తనకరంబుల నెత్తి యట్టియాపదం దొలంగించె నిర్దేశంబుల కెల్ల సుఖ
పరిపాలనంబుఁ జేయు నేలికసాని నంతకుఁ స్తంబువలన నాకర్షించి
యిచ్చినయాధర్మశీలుని శీలంబుఁ గొనియాడ నశక్యం బై యుండుం
దదనంతరంబ. 202

మ. పలువన్నెల్ గలపావడల్ దొడుగుచుం బల్వన్నెలొకుప్పసం
బులు పెక్కుల్ సవరించుచు న్ననుకచంబుల్ వేణిగా దిద్దుచున్
వలకొప్పున్ రచియించుచున్ వెనుకకున్ వక్రంబు లై వ్రేలఁగాఁ
గలయ న్విప్పుచు వేళ కొక్కొకయలంకారం బిడుం బుత్త్రికిన్.

క. హితపథ్యాహారమ్ము ని
యతకాలపునిద్దురయును నర్హులపొందున్
మిత మగునాటలవేడుక
జతనంబునఁ దల్లి కొమకు జరుపుచు నుండెన్. 204

చ. తొడవుల కెల్లఁ బల్ తొడవు తోరపువిద్య యె పూరుషాళికిం
బడఁతుల కద్ది నేరుచుట మంచి దటంచును బాల కప్డు క
ట్టడిమెయి విద్య నేర్పుటకు డాక్టరు డేవిసు దత్సహాయఁ గా
నడరఁగ బేరనెస్ లెహిజ నన్ దొరసాని నొనర్చి రొజ్జలన్. 205

శా. ఆబాలామణి వారియాజ్ఞలకు లోనై వారిశిక్షాగతి
ప్రాబల్యంబు స్వబుద్ధిశక్తిఁ బెరరేఁపం జెచ్చెరన్ మారుత
ప్రాబల్యంఁ బొనఁగూడి నానఁ బెరరేఁపన్ వారిధిం బోలె వి
ద్యాబాహుళ్యము సంతరించఁ దొడఁగెన్ స్వల్పప్రయత్నంబునన్.

ఉ. విత్తునఁ జక్కఁగా నడఁగి వృక్షము నీ రొనఁగూడునంత మో
సెత్తినభంగి బాలమది నిమ్మగ నెక్కొని యున్న సత్యసం
పత్తి దయానువృత్తి యును బాడి యు సద్గురుబోధనంబుచే
సత్తునఁ బూని పైపయిని సాఁగ దొడంగెఁ గ్రమక్రమంబునన్. 207

క. శంకర విను వివరించెద
నంకురదశ నున్నయట్టి యచ్చెలి గుణముల్
పొంకంబుగఁ బ్రకటించుట
కంకంబులు గాఁగఁగొన్ని యభినవచేష్టల్. 208

క. ఆయెడ్వర్డుసుత యుపా
ధ్యాయి తనకు విద్య గఱపునవసరమందుం
జేయక చేయక యొకనాఁ
డేయెఱుఁగమి నో యొనర్చె నించుకతప్పున్. 209

ఉ. ఆయెడ దైవయోగమున నాత్మజనర్తన మారయస్మెరీ
లూయిస వచ్చి యీయబల లోఁబడి యుండు నె విద్య చింతనల్
సేయు నె మీకు మార్గ్మగము సేయదు గా యన నామె నయ్యుపా
ధ్యాయియుఁ జూచి నేఁడవినయ మ్మొనరించె నొకండు నావుఁడున్.

చ. కరమున గుర్వియామె నిమిరి కన్నియ యిట్లనుఁ గాదు కాదు వి
స్మరణముఁ జెంది తమ్మ యినుమా రొనరించితిఁ దప్పు లేను వి
స్మరణముఁ జెంద సు మ్మెరుక మాలినకార్య మటంచు సత్యసం
గరమతిఁ బల్కె వార లతికౌతుక మందిరి బాలచేష్టకున్. 211

ఉ. ఆయము మీఱినట్టిన్యయ మప్పులు సేయుట నింద్య మం చుపా
ధ్యాయులు బాలికామణికి నప్పట నప్పట బాల్య మాది గాఁ
బాయక చెప్పు చుండి నిరపాయము గా నడపించు చుంట చే
నాయమ యిష్టవస్తుసముపార్జనతుష్టికి నుండు దవ్వులన్. 212

ఉ. అంగట నున్న ఖేలనపదార్థముపై మది గల్గి నేఁడు నీ
కుం గొఱ యయ్యె యొక్క మొనఁగూడినయప్పుడు నేను వచ్చి దీ
నిం గొని పోదు నాకు నయి నిల్పు మటంచును జేరి వేఁడి య
య్యంగన తత్ప్రకారము నొకప్పు డొనర్చును సత్యకీర్తియై. 213

క. ఇచ్చు మెయిం బాలామణి
వెచ్చం బొనరించుకొనఁగ విత్తము మితిగా
నచ్చటినయసాంఘికజను
లిచ్చుచు నుండెదరు కాలభృతి నపు డపుడున్. 214

గీ. ఒజ్జసానితోడ నొకనాఁట నంగటఁ
దన కభీష్టవస్తుతతిని విలిచి
చెలియ కొక్కపేటి విలుచుచోఁ దర్గుర్వి
నసువు లేమిఁ దెల్పి పొసఁగ మాన్పె. 215

క. మనమున మఱువక యాసతి
తనచేతన్ రొక్కమున్న తఱి మరలంగాఁ
జని యొకనాఁ డప్పేటికఁ
గొని యమ్మిత్రమున కిచ్చెఁ గూర్మి దలిర్పన్. 216

ఉ. అమ్మ యఁ దాను బండిపయి నాపణవీధికి నేగి యచ్చటం
బొమ్మల గాంచి యందు నొకపుత్తళికం గొని ఖేలనార్థమై
యి మ్మనఁ జేత నున్నధన మెల్ల వ్యయం బయి పోయె నొక్కప
ఱమ్మునఁ గాని రాదు గద కన్నెరొ నీభరణమ్ము నావుఁడున్. 217

క. సదనమున విన్నదన మపు
డుదయింపఁగఁ జింత జేసి యొక్కించుక యా
సుదతీమణి వెర వొదవఁగఁ
బదఁపడి తనజనని కిట్లు బల్కె వెరచుచున్. 218

క. పదియేనుదినము లన్యుల
కిది యమ్మక యుంచి తేని నేఁ గొని పోదుం
బిదప నని వణిజుఁ బ్రార్థిం
చెద ననవల్లె యని తల్లి జెప్పఁ గ నంతన్. 219

చ. శకటము డిగ్గి యవ్వణిజుసన్నిధి కేగి యథోక్తరీతి బా
లిక నుండునం గ నాతఁ డమలీమస తేజము గల్గినట్టిరా
జకులకిశోరి యా యెఱిఁగి సమ్మతి సేయఁ గ సమ్మదించి త
ల్లికి నెఱిఁగించి యిర్వురును లీల గృహంబున కేగి రయ్యెడన్. 220

శా. మాసాంతంబున భోగభాగమును సంప్రాపించి వేవేగ ము
ల్లాసం బొప్పఁ గఁ బణ్యవీధికిని బాలారత్న మేతెంచి వి
న్యాసప్రక్రియ నున్న పుత్త్రికకు నర్హం బైనమూల్యంబు వి
శ్వాసం బొప్పఁగ నిచ్చి మళ్ళి విలసత్పాంచాలికాహస్తయై. 221

వ. అట్లు మరలి నిజనివాసంబున కరుగుచు మధ్యేమార్గంబున. 222

సీ. దారిద్ర్యదేవతా తనువిలాసస్ఫూర్తి
కాటపట్టయిన దేహంబువాని
ఘనతరక్షుద్బల గాఢసమాశ్లేష
వివశీకృతాత్ముఁ డై వెలయువాని
కృశతానిరంతర కేళీవనాయిత
మంజుప్రతీక సంపత్తివాని
నత్యంతదీనతా నృత్యకళారూఢి
రంగాయమాణ వక్త్రంబువాని

గీ. పరిముహూరసనాగ్ర విప్రసరసిచ్య
మానసంచలదోష్ఠ యుగ్మంబువానిఁ
నేమొకోచెప్పటకు నిచ్ఛయించువానిఁ
గనియె నొక్కని గురుకృపాకలిత యగుచు. 223

చ. కని దటి కేగి యెవ్వఁడవు గాఢకృశీభవదంగకుండ వై
యునికికి హేతు వేమి నను నోపనిచూపులఁ జూచుచుండఁ గాఁ
బని యది యేమి యెద్ది యొకొ పల్కఁ దలంచినవానిఁ బోలుచుం
గనఁబడెదేమి సంశయముఁ గైకొన కింత యుఁదెల్పు నావుఁడున్.

గీ. చిట్టితల్లిరో నీకడఁ జెప్ప కుండ
దాఁచి యే మాదు నీముఖతామరసముఁ
గాంచునంత నె నిను వేఁడు మంచు నన్ను
బలిమిచేఁద్రోచె నాఁకఁటిబాధ మిగుల. 225

మ. అనఁ గా నెద్ది యుఁ బల్క నోపక యె విత్తాభావచింతాకులా
నన యై యుంట యెఱింగి యాతఁడు ను దండం బమ్మ నేఁబోయివ
త్తును నాదుర్విధి దప్పి పోదు గద యిందు న్నీవు చింతింప నే
మనుచుం దా మరలెం బటచ్చరముచే నశ్రూద్గమం బొత్తుచున్

క. అకంటు నీరు విడుచుట
నాఁకంటుం దొట్రుపడుట నరయుచుఁ గరుణా
వ్యాకులితస్వాంతముతో
నాకొండిక నిమిష మాగు మని నగ పొదసన్. 227

ఉ. ఆపణవీథి కాతతరయం బమర న్మరలం గ నేగి యున్
నాపయిఁ బ్రేమతో మరల నాల్గుదినమ్ములు బొమ్మ నుంచఁగా
నోపు దె యంచు నవ్వణిజు నొద్దిక వేడఁ గ మందహాససం
దీపితుఁడౌచు మూల్యమును దీసెద నే మరలంగ నావుఁడున్. 228

క. దయ నొసఁగిన దీనంబు
న్నియ మొక్కించుక లభించు నీకు నటంచుం
గ్రయధనము బుత్త్రికావిని
మయమునఁగొని వేగ నరిగె మరలఁ గ నటకున్. 229

శా. దీనన్ నీక్షుధఁ దీర్చుకొమ్మనుచుఁ దద్దీనావళీపాలనా
ధీనప్రీతి వసంతపుష్ప మపు డద్దీనాత్ము హస్తంబునం
దీనారంబు నొసంగ నాతఁడు నమందీభూతసంమోదముం
బూనెం గన్నుల నైన నంతటిధనమ్ము న్మున్ను వీక్షింపమిన్. 230

ఉ. ఎద్ది యొ పల్కఁ గాఁ దివురు నే పఱి యూరక నుండు నాత్మలో
నద్దిర యింతసొమ్మనుచు నచ్చెరు వందును మోదవార్ధిలో
గ్రద్దన మున్గి తేరు మఱి ప్రత్యయ మేగతిఁ జూపువాఁడ ని
మ్మొద్దియ కంచుఁ జింతిలును భోరన మ్రాన్పడు నాతఁ డంతలోన్.

వ. ఈతెరంగున నలబ్ధచరనసులాభ సంభూతవైనశ్యసమాకులితచేతస్కుం
డై కొంత దడ వెం దేని యుం బోయినచిత్తంబు గలవాఁడుం బోలె
నుండి యెట్టకేలకుం బ్రతిపన్నచైతన్యుం డై గద్గదకంఠంబుతో ని
ట్లనియె. 232

క. అమ్మా యీపుడమికి దై
వమ్మౌ మహారాజ్ఞిఁ జేసి వైభవ మిడినన్
సమ్మతి నీచేసెదుద్ధ
ర్మమ్మున కయ్యది యు నీడు గాదు గదమ్మా. 233

చ. అని మఱి యెద్దియో పలుక నాయిత మౌట యెఱింగి బాల యా
తనిఁ గని యాత్మసంస్తుతివిధానపరాఙ్ముఖి యౌచు ని ట్లనెం
గొని తిను మెద్ది యేని యిఁక గొబ్బున నాఁకఁటఁ గుందు చుంటి వే
చను మని యందు నిల్వక వెస న్నిజమందిరసీమకుం జనెన్. 234

ఉ. తల్లికి నీసమస్తము యథాస్థితి గా నెఱిఁగించి యమ్మ నే
నుల్లము గట్టి సేయుటకు నోపక నాకరమందుఁ గల్గుసొ
మ్మెల్ల నొసంగి యుంటి నిది యొ గ్గొకొ ల గ్గొకొ తెల్పు మన్న నా
తల్లిరో నీవు సేసినది త ప్పన నో రెటు లాడు నే యనన్. 235

క. అమ్మా నాచేతం గల
సొమ్ము నొసఁగి వచ్చునపుడు శుభదాశీర్వా
దమ్ముల నిడి యాదీనుఁడు
క్రమ్మరఁ బఱతోషితాంతరంగుం డగుచున్. 236

ఉ. నీమది నెట్లు దోఁచు జననీ యలబీద వచించినట్టిప
ల్కే మిటిలెక్క యంచు వచియింతు వొ నావుఁడుఁ గాదు కాదు బా
లామణి లెస్స గా మదిఁ దలంచి వచించెద రేని బాలకుల్
ధీమహితాత్ము లర్థులు ను డెల్పెడువాక్కులు పోవు రిత్తలై. 237

ఆ. అతనిపల్కు చిత్ర మై తోఁచుచున్నది
యేది యెట్టు లౌనొ యెఱుఁగ వశమె
రాణి వౌదు వేని రాజగుణంబుల
పట్టుగొమ్మ వగుచుఁ బ్రబలు మమ్మ. 238

క. ఈరీతి బీద లెందఱొ
ధారుణి నేలునపు డుండ్రు తత్తదుచితము
ఖ్యారాధన మొనరింపక
కారుణ్యము నెఱప కుంట గాదు సుమమ్మా. 239

ఉ. నాపుడు నేను రాణి నయినన్ విధియుక్తినిఁ గాక యుండినం
బావనధర్మశీలము నభంగురసూనృతవాదముం బుధా
సేవ యు దుర్విధావనవిశేషసమాదరణంబు నెప్పు డున్
నే విడ కుందు నాకు నిది నిశ్చలితవ్రత మమ్మ నమ్ము మా. 240

వ. ఇట్లిలజ్జాంగ్డినావిక్టోరియాకుమారికామణి వాక్రుచ్చు పలుకులకు నం
తస్సంభూతప్రభూతసమ్మద యయ్యు నవ్విక్టోరియామెరీలూయిసా
రమణీరత్నంబు కూఁతునకు వికత్థనత్వంబు శంకించి సంతోషచిహ్నం
బుల వెలిఁబుచ్చక యంతర్గతదీప యగు ఘటియుఁ బోలె నుండిగోష్ఠ్యం
తరంబుఁ బ్రస్తావించు చుండె నంత. 241

సీ. అరజాముప్రొద్దున నంబచెంగట మంచి
దుగ్ధముల్ ఫలములు దోసె మెసవు
ధృతమనోరథు లౌట ద్రుత మనోగత లౌచు
నిర్భరు వయ్యాళి కేగి పిదప

నీడఁ ద్రొక్కెడువేళ నెతిఁ బొర మానృత్తి
సలిపి యాటల వేడ్క జరిపి బాల
ప్రొద్దింత వ్రాలంగ భోజనకృత్యంబుఁ
గావించి గురునితోఁ గఱచి విద్య

ఆ. చల్లప్రొద్దువేళఁ దల్లి యు బిడ్డయు
నధిగతోరుచక్రయాన లౌచు
నాప్తదర్శనమున కైన వయ్యాళికి
నైన నేగుచుందు రనుదినంబు. 242

ఉ. చల్లనివేళ నొక్కకలశంబును జేఁగొని బాల గంధసం
పల్లలితంబు లౌచు సుమభారవినమ్రము లైనవృక్షముల్
వల్లులు నల్లికొన్న సనవాటి కొకించుక సేపు నీరముల్
జల్లు నొకప్పు డంగమునఁ జక్కని స్వేదకణంబు లూరఁగన్. 243

సీ. నీరంబు చెలు వగునీరంబుతీవల
నింపుకేళాకూళి నింపు చుండు
రోజాలవెంట శిరోజాలి చలియింప
మడమలచేఁ ద్రొక్కి మడప లెత్తుఁ
అనఁటిఁదోయంపుసొం పనఁటిబోదుల గ్రమ్మి
పారఁ గా వేడ్క లింపార నించు
గన్నేరులకుఁ దీరుగ న్నేరుపున నీరి
దొనకు నొక్కింత సం దొనరఁ జేయుఁ

గీ. ప్రొద్దుగ్రుంకంగ జనయిత్రియొద్ద నిష్ట
భోజన మొనర్చి దాది యుఁ బొత్తుకత్తె
తెలమి గూడంగ నాటల మెలఁగి రేయి
యామ మరుఁగంగ నిదురించు నంబచెంత. 244

క. మేరీలూయిసచెంతం
బారనెసు లెహీజ ననునుపాధ్యాయకడం
గారాబముతో బాలిక
వారలశిక్షావిధమున వర్తిలు చుండెన్. 245

ఉ. ఆయరవిందపత్త్రివిమలాయతనేత్రకుఁ బంచవత్సర
ప్రాయము వచ్చునప్పు డలపారలమెంటను పేరుగల్గునై
యాయికసభ్యు లెల్లఁ బ్రతిహాయన మర్వదివేలరూప్యముల్
దేయము లంచు విద్దెకయి తీర్పొనరించిరి రాజ్యపద్ధతిన్. 246

క. డాక్టరుడేవిసుశిక్షుల
విక్టోర్యాబాల స్వమతవిద్యల నెన్నో
యాక్ట్రుల భాషల నెన్నొక
రెక్టుగఁ దా నభ్యసించెఁ బృథుతరబుద్ధిన్. 247

సీ. ఐరోపుఖండమం దాది యాలాటిను
భాషలోఁ బాండిత్యపటిమఁ గాంచె
సాహిత్యము ను ధర్మశాస్త్రముల్ గణితశా
స్త్రములు ను నిజదేశచరితములు ను

న్యాతివిద్య యును సంగీతన ర్తనకళ
లాలేఖ్యచాపవిద్యానిరూ ఢి
వృక్షశాస్త్రింబుఁ బ్రకృతిశాస్త్రము ను గ్రీకు
భాష యిటాలియాభాష మరియు
గీ. జర్మనీఫ్రెన్సు దేశభాషలు ను నాలు
వత్సరంబులలోన నవ్వత్స రమ్య
వక్త్రమునఁ దేఁటిపదుపులు వారిజమునఁ
బోలె నహమహమికతోడఁ బొసఁగఁ జొచ్చె. 248

క. నెలనెలకు గుర్వి తన్మా
తులుఁడు లియోఫాల్డునకును దోరఁపువిద్యా
విలసనముఁ దెలియఁ జేయఁగ
నలరెందద్వృద్ధి కాతఁ డబ్బురపడుచున్. 249

ఉ. ఇష్టులు తండ్రి తాత దివి కేగిన కాలమునందు బాల క
ష్టమ్ము లయ్యెదుఃఖములు బాల్యఁపు పేర్మిని నట్టు లుండఁ గా
నష్టమవర్షమం దిదుమ లందఁగ బ్రాత్రతఁ గాంచె నక్కటా!
కష్టము తండ్రిఁ బోలెఁ దను గాంచెదుయార్కు విడెన్ మహీస్థలిన్.

వ. అప్పుడు. 251

ఉ. కన్నతఁ డెట్టివాఁ డొ యెఱుఁగం గలవున్నెము లే ద యాతనిం
గన్నతఁ డట్టి డయ్యె నను గాఢతరం బగుప్రేమ మీఱఁ గాఁ
గన్నతఁ డిట్టు లయ్యెఁ గృపఁ గాంచదు దైవము న న్నటంచు న
క్షన్నియ యెంతయుం బొగులఁ గాఁదొడఁగె న్సుఖు లూరడించఁగన్.

ఆబాలామణి పెద్దతండ్రి యగునయ్యార్యుఁ ప్రభు న్నిత్యముం
బూబంతుల్ రచియించి యిచ్చి ముదముం బొందించుచో స్వర్గయా
తాబద్ధోద్యముఁ డైననాఁ డిడినవిభ్రాజద్గుళుచ్ఛం బదెం
తేబత్తెంబును బోలె నాత్మ కొసఁగె న్నిర్వాణసంధానముల్. 253

విల్లియముభార్య యాపెద
తల్లి యెడిలెయిడ్డురాణి తనగర్భజ యా
పిల్లనలె మఱఁదికూతుం
బల్లవితప్రేమ యాచుఁ బరఁగం జూచున్. 254

ఆయెడిలెడ్డురాణి తనయాత్మజ లిద్దఱు శైశవంబునం
దాయువుఁ బాయుటన్ నగవు నాగుచుఁ జిత్తమునందుఁ జెల్లెలా
నాయము మీఱ నీసుత యె నాసుత సుమ్మని యాత యాపెరీ
లూయిసచెంత కంచె నవిలోలతఁ గమ్మను వ్రాసి ప్రేమతోన్. 255

ధవళసరోజనేత్ర దుగ దచ్చి యు నేడులప్రాయ మొందఁ గా
భువనము నేలుచున్న యలమూఁడవజార్జి పరిత్యజించె మా
నవపదవాస మాపిదప నాల్గనవిల్లియ మొందె రాజ్యమా
నవపదవాస మద్దిరకనం దగు లచ్చివిలాస మేరికిన్. 256

అంత కంతకుఁ దనకు రాజ్యపద మిల్లు
దరియఁ జొచ్చుట యబ్బాల తలఁప దయ్యె
జనని మొద లగుబాంధవజనము లైన
మడువ కుండిరి మది గర్వపడునటంచు. 257

వ. ఒక్కనాఁడు రాజప్రస్థాన మహోమహంబు జరుగు చుండం దాత్కా లికరాజ్ఞి యగుసెడిలెయిడుప్రభ్వి కృతకపుత్త్రిక యగునయ్యాలగ్జాం డ్రినావిక్టోరియాదారికం దన కురువునం జేర్చికొని వాతాయనమార్గం బున నుండి యుత్సవదిదృక్షాయాతాయాతజనంబు లబ్బాలం జూడ నిచ్చగించుటం దదింగితం బెఱింగి పూఁబంతిఁ బోలెఁ దనకరద్వయంబున నెత్తి వారికన్నులకుం బెనుపండువ యొనర్చి నిప్పగిది మఱియు న నేకభంగుల లాలించు చుండె. 258

క. ఘనరాజ్యపదము నొందఁగ
నను వగుపుత్త్రిక లణంగి రట్టిపదంబుం
గొన నున్న మఱఁదికూఁతుం
దనసుతక్రియ నరయు నాపె తగ దే పొగడన్. 259

మ. అనపత్యత్వము వార్ధకంబు దనకుం బ్రాప్తంబు లై యుంటచేఁ
దనయంతంబున రాజ్యభారమును జెందం బాల విక్టోరియా
కనువౌప్రాయము రానిచోఁ బ్రతినిధిన్ వ్యక్తంబుగా నిల్ప శా
సనముం జార్జిసుతుండు వ్రాసె యునిచెన్ సంఘాతధర్మస్థలిన్.

ఉ. భావిదశాగమంబు దెలుపం దగు నించుక యంచుఁ దల్లితో
భావనఁ జేసి గుర్వి పటపత్త్రమునం దొకవంశవృక్షముం
దా విలిఖించి పుస్తకమునం దగ నుంచినఁ బాలవేళయం
బావరగాత్రి చూచి తనయన్వయరీతి నెఱింగి యిట్లనున్. 261



రాజ్ఞికి గుర్వి వంశవృక్షపత్రమునిచ్చుట. 64.

ఉ. ఎన్నఁడు మున్నుఁ జూడ నిది యేమికతంబున నమ్మ యోగురూ
కన్నెరొ దీని జూడఁ దగుకాలము గాదు గదమ్మ మున్న నా
కెన్నఁగ రాజ్యపీఠము సమీపగతం బని తోఁచె దీనిచే
త న్నలినాక్షి యా నవు నుదారగుణంబుల నొందు మయ్యెడన్.

చ. శిరమునఁ దాల్తు నీ విపుడు చెప్పినయాజ్ఞ నటంచు హస్తముం
గరమున వైచి నిశ్చయము గా నిది నమ్ముము కొంద అర్భకుల్
గరము సహించు చుండెదరు గర్వము వైభవ మబ్బె నంచు భూ
భరము సహించుచోఁ గలుగుబాధ లెఱుంగ రటంచు పండితుల్.

ఉ. మంచిగుణంబు లెన్నఁడు ను మానను మానను మాన నమ్మ మా
యంచు వచింప గుర్వి యను నామెకు నాయెడిలెయ్యుసంతతిం
గాంచినరాజపుత్త్రికలు గానఁ గ్రమంబున భూపతిత్వ మొ
ప్పించును విల్లియంప్రభు నభీష్టతనూజులయందు నావుఁడున్. 264

మ. అహహా! తావకవాక్యరీతియగు నే నర్హం బగుం గా దె య
మ్మహిళారత్నము నన్ను వత్సలతచే మన్నించు చున్నందు కి
మ్మహి నాతమ్ముఁడె యేలె నేని నది యున్ మద్భాగ్యమం చెంతు దు
ర్వహభూభార గురుశ్రమంబునకు దూరం బౌట యుం గల్గెడున్.

గీ. అనుచు ద్వాదశవార్షికి యైనయపుడు
బలుకునంతటిగుణములు గలుగునింతి
తనకు నీమ గ మైత్రికి ననువుపడఁ గఁ
గలసిమెలఁగ దె లక్ష్మి యక్కాంతతోడ. 266

చ. అట నట వాణిజస్థలము లచ్చట నచ్చట శిల్పశాల ల
చ్చట చట సుప్రసిద్ధతర సంవసథంబులు నాత్మవృత్తి కా
దటఁ బరికింపఁ జేయుచు ముదంబున నమ్మొరిలూయిసాఖ్య ప
ర్యటన మొనర్చెఁ దజ్జనప దాంతికసంస్థితవేల్సుదేశముల్. 267

మ. యువరాజ్ఞీమణి వచ్చె నంచు నతిగాఢోత్కంఠులై మేలియు
త్సవముల్ జేసెడువారు జాటుపదపద్యంబు ల్సమర్పించువా
రవనీపాలన మీమె సేయుఁ జిరమం చాశీఃప్రయోగంబుతోఁ
బూవడం జొచ్చెడువారు నై రఁట నట ద్భూమీజను ల్వారెలల్.

ఆ. వైటుదీవి నుండి వారలు తూరుపు
తీర మరసి యరుగుదేరువేళ
నోడకంబ మొరఁగి యొక్కింత పెటపెట
యనఁగఁ గర్ణధారుఁ డరసి యంత. 269

ఉ. కూపకపాతశంకఁ గొని కూయిడుచుం దదధస్థలైన య
ప్పాపఁ గరంబులం బొదివి పాయఁగ దవ్వగఁ దీసె నంతలో
నే పడెఁ గంబ మప్డు జను లెల్లను గొల్లు మనం గనామె క
య్యాపదఁ బాప నావికునియాకృతి దైవము వచ్చె నే మొకో. 270

ఆ. ఎన్న నలవి గానియిడుమను సౌందర్య
మొప్పపాటులోనఁ దప్పఁ జేయ
నావు రనుచు గుండె లదర నేడ్చుచు బాల
యాతనికిఁ గృతజ్ఞ యౌచు మ్రొక్కె. 271

ఉ. కల్లనిజంబు లేర్పఱుపఁ గష్టసుఖంబుల నంజఁ జేయ ను
త్ఫుల్లవిశాలనేత్రములఁ బొల్పుగ దైవము జూడ యోగ్య నా
పల్లవ మేల యంటు నని ప్రస్తుతు లచ్చటివారు సేయఁ గాఁ
దల్లియుఁ గూఁతురుం దమదుతావునకుం జని రాత్తసౌఖ్యలై. 272

ఉ. హైమవతీదృగంచల సమంచితహావ బలాపకృష్ట చే
తోమృతకూపవిస్తృత కృపామృతసేక నిరస్యమాన భ
క్తామితసంసృతిప్రకు పితామయజాల మహోభిషగ్వరా
తామరసోద్భవాది వినతప్రథితోరు చరిత్ర సేవధీ. 273

క. అభ్రాపగానిరంతర
దభ్రేతర ఫేనధీ విధానపటీయ
శ్శుభ్రాంశుకోటికోటీ
రభ్రాజిత శీర్షభాగ రమణీయతరా. 274

## కవిరాజవిరాజితము.

శివ శివదాయకనిర్మలనామక సేవకబృందనివేశితవా
సవ సవసంహరణాతతవిక్రమ సత్వసమంచిత మానవబాం
ధవ ధవళాంశువిభూషితమస్తక దర్శనమాత్రనిరస్తమనో
భవ భవనాశకపాటవిపాటన పాటవయుక్తవిపాతకరా.

## గద్యము.

ఇది శ్రీమన్మంత్రిపెగడ వంశపయఃపారావార రాకాసుధాకరరాజ
బిరుదాంకిత భుజంగరాయామాత్యపౌత్త్రి హరితస గోత్ర పవిత్ర
దుర్గామల్లికార్జునప్రసాదరాయనరపుత్త్రిశ్రీమార్కండేయవర
ప్రసాదజనిత సరసాష్టావధానాది విచిత్ర కవితాధౌరేయ
బుధజనవిధేయ భుజంగరాయనామధేయ
ప్రణీతం బయినవసంతకుసుమ మను
మహా ప్రబంధంబునందుఁ
ప్రథమాశ్వాసము.
శ్రీ. శ్రీ. శ్రీ.



శ్రీరస్తు.

శ్రీమార్కండేయస్వామినేనమః.

# వసంతకుసుమము.

## ద్వితీయాశ్వాసము.



శ్రీమద్వార్షికజలద
శ్యామలగళరుచివిభాసు రామలదేహా
ద్దామరుచితులితరాకా
సోమవిపులధామ సోమ సుగుణస్తోమా.

గీ. అవధరింపుము విక్టోరియావధూటి
గఱచి యున్నట్టివిద్దెలు మెఱుఁగు వెట్టె
గుణములకు నట్లు మేనికిఁ గొమరు వెట్టె
సప్తదశవత్సరంబులజవ్వనంబు.

సీ. కమ్మచ్చుఁ బట్టినకనకంపుతీఁవల
వలెఁ బెన్నెరులు నిడుపంపు లయ్యెఁ
గార్కొని క్రొవ్వారుఘంజకీటంబుల
సొబగునఁ గన్నులు సోఁగ లయ్యె

నధిగతకోరకితావస్థయానల్లి
చాడ్పున దేహసౌష్ఠవము దనరె
దర్పణవిస్మృతచంద్రమరీచి కైవడి
మేనియం దొకవింత మెఱుంగు దోఁచె

గీ. నడలకునశిక్షితోదితనవవిలాస
గౌరవం బుప్పతిల్లె నక్కలికిమిన్న
క్రమయతోన్నపనత మైనయట్టితొడవు
చెప్పఁ జూపఁ గఁ జాలక చెల్వు నించె. 3

క. మంజులగాత్రికి జన్మ
వ్యంజిత మై వెలసి విగతహాసోపాదా
నాంజనము నేత్రయుగళిం
గంజమునం దేఁటికొదమ కైవడి నొప్పెన్. 4

ఆ. పసితనాన మించి వెసఁ గ్రిందు మీఁదును
గనక లేనిగొప్ప నెనసికొనుచు
వేఁగు మోయుకొలఁదిఁ గృశియించ రెవ్వార
లనఁ గృశించె నంత నంత నడుము. 5

ఉ. కుచ్చెలపావడం దొడిగి కుప్పసముల్ బిగియించి యంఘ్రులన్
మచ్చె లమర్చి ముద్దొలుకుమోమున జాలరు వైచి వేసలం
గచ్చులు గ్రమ్మి నిద్దపుసికం గుసుమంబులఁ గూర్చి యున్నచో
నచ్చెలువం గలీబమరునంగజుముల్కి గ నెంతు రెల్లరున్. 6

శా. ఆలీలం దనరారె మన్మథుని రాజ్యశ్రీ యొ యింగ్లాండుల
స్త్రీలావణ్యనవావతార మొకొ బ్రాహ్మీమానుషీభావ మో
బాలాకారసుశీలసంపద యొ చెప్పం జూపఁ గా నిమెయం
దేలోపంబు నొకండుఁ గానఁబడ దం చెంచం దగెన్ వేడ్కతోన్. 7

ఉ. అల్పవిభూషలా సుదతియంగమరీచిపరాహతంబులై
పొల్పు వహింప వయ్యె శశిపూర్ణమరీచినిరస్తతారకా
కల్పము లౌచు సత్యముగఁ గౌముది యా సతిమేనికాంతి త
త్కల్పితమోదమున్ జనులకన్గవవెన్నెలపుల్గు లొందుటన్. 8

సీ. కఱకుక్రొవ్విరిముల్కి గాఁ బోలుఁ గా కున్న
మృదుతీక్ష్ణరీతిచేఁ బొదలు నెట్లు
కాయమొందినమాయ గాఁ బోలుఁ గా కున్నఁ
జూచువారలమదుల్ దోఁచు నెట్లు
కఱుగువెన్నెలముద్ద గాఁ బోలుఁ గా కున్న
మిఱుమిట్లుగొలుపుచు మెఱయు నెట్లు
కమ్మబంగరుబొమ్మ గాఁ బోలుఁ గా కున్న
సమ్మోదమును వెద జల్లు నెట్లు

గీ. అనుచు నయ్యింతి వయ్యాళి కరుగువేళ
గుసగుసలఁ బోదు రచ్చటికొమరుపాయ
మమరులోకులు తత్సతి కమరలోక
తరుణి తర మని వివరింపఁ దర మె యహహ. 9

ఉ. అయ్యెడ బాలికామణివయస్యలు తజ్జనయిత్రిచెంతకున్
నెయ్య మెలర్ప నచ్చి యతినిర్మలవాక్పటిమంబు మీఱఁ గా
నొయ్యన నామె నేకతము నుండఁ గ వేఁడి ముఖాంబుజంబులం
దియ్యనిమందహాసరుచి తేటలు గుల్క వచించి రీగతిన్. 10

ఉ. నీవు నెఱుంగ రానికరణీయము గల్గు నె ఱైన మైత్రి యీ
త్రోవకుఁ ద్రోసె మమ్ము నెఱితోవిను మింతవెడంగుపల్కు నీ
తో వివరింతు మిప్డు మనతొయ్యలిమేన జనించెఁ గ్రొవ్విరిం
దావియుఁ బోలె జవ్వనము దగ్గఱవారు ప్రమోద మందఁగన్. 11

క. ఇలలో వసంతకుసుమము
దలఁపఁ గ నల పొందుఁ గా దె తారుణ్యమునన్
వలరాజు గుఱికిఁ దార్చిన
బలితం బగుములికి యనఁ గ నల దే దానిన్. 12

చ. కలకల లాడుచుం జెలిమికత్తెలచెంగట స్వైరవృత్తితోఁ
బలుకుచు నుండు ము న్నిపుడు వాతెరచెంగటివాక్య మంతలో
నిలపుచు సంశయాకులితనేత్రము లించుక నంచి యే మొకో
తలఁపఁ దొడంగు నవ్వయసుతప్పు గదా యది బాల నేమ నన్. 13

మ. తనలోఁ దా నె యొకింత నవ్వుకొని యంతం బర్వుప్రీడాభరం
బున లోలోపల సందియంబును గొనున్ మున్ బెడ్డికిం దార్చి యుం
చినయాబొమ్మలపెండ్లి సేయుతలఁపుల్ జిత్తంబునం గల్గి యుం
గొనుఁ దా నొల్లమి సోపతయామవిధికోర్కుల్ దెల్ల మాశంకచేన్.

చ. తనసరిచేడియల్ ప్రియులఁ బడ్డయుఁ గూడి చరించు చుండఁ గాఁ
గనుకని కుప్ప వేయక యొగాదిగఁ జూచి యొకింత సేపు నె
మ్మనమున నెద్ది యో తలఁచు మాడ్కిఁగనంబడు బాల నూత్నయౌ
వనమున నుండుమానినులవాంఛలు లక్షణమాత్రగమ్యముల్. 15

శా. కానన్ మానవినప్రపంచము నుపేక్షం గీటునం బుచ్చ కే
కానం గాఁ దగు బుద్ధియౌవనకులాకారాదులం దుల్యుఁ డౌ
వానిన్ సద్వరు నొక్కనిన్ మనసులో వాంఛన్ వడిం దెల్పఁ గాఁ
బూనం జాలరు సాహసంబునఁగులప్రోద్భూతలౌ బాలికల్. 16

క. అన మీరు ప్రాణసఖు లౌ
టను దెల్పితి రింత యున్ వెడంగునుడు వనం
జను నే నాసుతభార
మ్మనయము మీయది య కా దె యా ప్తతకలిమిన్. 17

చ. తలఁప వరు న్వరప్రతిభుఁ డా వరియింపఁ గఁ జాలి యుండె మీ
చెలి మతిశీలవిద్యలఁ బ్రసిద్ధతఁ గాంచిన దొట నాపయిం
గలఁడు మదగ్రజుం డఖిలకార్యధురంధరుఁ డౌచు వానికిం
దెలిపెద యుష్మదుక్తిసరణిం దగువారలఁ బుచ్చి యం చొగిన్. 18

క. మేరీలూయిస యప్పుడు
వారలఁ దగురీతి ననిచి పరమాప్తుండున్
ధీరుఁడు ధీమంతుఁడు నౌ
బారన్స్టాక్మారుఁ బిలచి పలికె ని ట్లల్లన్. 19

మహాస్రగ్ధర.

అనుజన్మం బోలె నన్నీ రరయుదురు గదా ప్రాప్తకారుణ్యు లౌచున్
ఘనకార్యారంభచింతా కలనచతురిమం గాన యుష్మత్ప్రమానుల్
మనవిట్కోర్వ్యానఘాటీ మణికనుగుణసంబంధ మొప్పన్ లియోఘా
ల్డు నమీ రేకీభవల్లో లుపవిశదమతు ల్బాని చింతింపుఁ డన్నన్.

ఆ. అట్లు కాక యనుచు నాతఁడు స్నేర్మంటు
పురవరంబునకును దరలి యపుడె
యనుజపల్కు లెల్ల నాలియోఘాల్డున
కెఱుఁగఁ జెప్ప నాతఁ డిట్టు లనియె. 21

ఉ. మిత్రమ యింత యేల నిను మీఱినవాఁడ నె మంగళార్థసం
ధాత్రధికారమందు సతతంబును మత్స్వసకుందలంపఁ ద
త్పుత్రికి నైన నీయెడలఁ బూనెద నించుక నే సహాయతా
మాత్రము గాన నెంచకుము మామకవాక్యము నే ధ్రువంబుగన్.

సీ. ప్రద్యోతమానవై శద్యధీసంపన్ని
షద్యాయమానస ద్విద్యవాఁడు
ధైర్యసత్యౌదార్య శౌర్యాదిసద్గుణ
ధుర్యతాబంధుర చర్యవాఁడు
చక్కలదొర నెక్కసక్కె మాడెడుమోము
టెక్కు మిక్కిలి యొఁ బెం పెక్కువాఁడు
కి మ్మనఁ గూడక సమ్మద మిడు గార
వ మ్మొప్పునాభిజా త్యమ్మువాఁడు

ఆ. లాఁతి గానివాఁ డలజ్జాఁడ్రినాబాల
కీడు గానివాఁడు మూఁడు నెలల
దక్షగుణములందుఁ దత్తుల్యుఁ డగువాఁడు
పూని చెప్పఁ జెట్ట లేనివాఁడు. 23

ఆ. అస్మదగ్రజన్ముఁ డైనట్టికోబర్గ
సుతులలో ద్వితీయుఁ డతివినమ్రుఁ
డధికగుణులచెంత నాల్బర్టు నా నొప్పు
నతఁడు బాలఁ గూర్ప నర్హుఁ డగును. 24

చ. అతఁ డుదయించునాఁ డుదయ మందినయీతల పంత్రి కంత్రకున్
సతతము వానితోఁ బెఱుఁగ సాఁగుచు నుండుట వానివిద్యకై
జతనము లెన్ని యేని యును సల్పుచుఁ బాయక సర్వభంగులం
చతివకుఁ దుల్యరూపుఁ డగునట్టులఁ జేయుచు నుంటి నాదటన్. 25

క. ఇప్పని బాలపితృవ్యుల
కొప్పిదముం గాద కాక యుండిన నాకుం
దప్పు దని తోఁచు దైవము
త్రిప్పుల నెఱుఁగుదు మె యెట్టిరీతి వొ తలఁపన్ 26

ఉ. కావున నింతవట్టు మదిఁ గల్గినయట్టితలంపుఁ జెప్పితిన్
భావుకకార్యసంఘటనపాటవధుర్యతచే గరిష్ఠ మా
తావకచిత్తవృత్తి కెటు దాఁకుచు నుండె వినంగఁ గోరెదన్
నావుఁడు సంస్మితంబు వదనంబునఁ దోఁపఁ గ నాతఁ డి ట్లనున్. 27

ఉ. నాయెడ మైత్రి గల్గుకతనన్ వినఁ గోరెదు గాక నీయభి
ప్రాయము నన్యథాకృతికిఁ బాల్పడు నే యది యట్లొ యౌఁ గదా
తోయజసూతి యిర్వురినిఁ దుల్యవయఃకులరూపశీలురం
జేయుట యారయం గ నిది సిద్ధమ కాఁ బొడకట్టు చుండెడున్.

చ. కలదు గదా పరస్పరము కాంక్ష జనించి వధూవరుల్ మదుల్
గలయ ననూనరాగమునఁ గ్రాలుట యున్ మనవారిలో నిరా
కులపథమట్లు దీని నొనఁగూర్చెడుయుక్తి లభించె నేని మం
గళ మగు సర్వ మిప్పునికిఁ గల్గ దొకించుక యంతరాయమున్. 29

ఉ. ఒండొరుచూపు లొండొరుల నొందినఁ జాలుఁ దదుత్తరార్ధము
ల్బండుఁ దమంత నే విమలభానువరీచులు సాఁగి సాఁగ కా
ఖండలదిఙ్ముఖంబునను గానఁబడం గుముదాకరంబులన్
మెండుకొన న్వికాసము జనించుట సిద్ధము కా దె మిత్రమా. 30

వ. అనినం దదనంతరంబ యాలియోఘాల్డుం దనయగ్రజుం డైన కోబ
ర్గున కీవృత్తాంతంబు సవిస్తరంబు గా వినం జేసి రహస్యం బన్యగ
తంబు గా కుండ నియమించుకొని యాతనిం బ్రథమాపత్యం బైనయో
ర్నెష్టుతోడను ద్వితీయతనూజుం డగు సాల్బర్టుతోడను బంధు దిదృ
క్షామిషంబునం గెన్సింగ్టను నగరంబున కరుగం బనిచె నంత. 31

మ. కుతుకం బొప్పఁ గ నర్హ్మావాహనములం గోబర్గుశేఁ డాసుత
ద్వితయం బప్పుడు వెంట రా నెడ నెడ న్విశ్రాంతికై నిల్చుచు
న్వితతగ్రామసరస్సరిద్గిరివనీవేశాంతసంవీక్షణో
దితవిస్తారమనస్కు లై మతుల మోదింపం జనెం గ్రక్కునన్. 32

మ. వని యామువ్వురఁ గాంచి రగ్రమున నుత్సాహంబు సంధిల్ల భూ
వనితారత్నవిభూషణాయితలస ద్వస్త్రావళీశ్రీకమున్
వనవాటీచరవాతపోతవిచల ద్వ్యాసంతికానీకము
న్నినదాస్తోకముఁ బూఃప్రవేకమును గన్పింప్ట న్సమాఖ్యాకమున్.

ఉ. ముచ్చటఁ దెల్పుచుం జనులు మూఁగి బడిం బడిఁ దమ్ముఁ జూడఁగా
నచ్చట వాహనంబు డిగి యంతిపురమ్మున కేగి వేడ్కతోఁ
దెచ్చినయట్టిమేలియుప దీభవదర్థము లాదరంబుతో
నిచ్చెను మేనగోడ లతిహృద్యగతిం జనుదెంచి యందుకోన్. 34

క. క్షేమానుయోగకలనలు
ప్రేమావిర్భావ విస్తరితవాక్యములు ను
ద్దామసుఖదుఃఖగోష్ఠులు
నామెరిలాయిసకు జరిగె నగ్రజతోడన్. 35

మ. అలయెడ్వర్డుమహీశునాత్మజకు నయ్యాల్బర్టుకుం గ్రొత్తచూ
పుల నభ్యస్తవిలాసనవ్యకుతు కాభోగప్రచారంబులై
తొలుదొల్తం జెలఁగెం బరస్పరము నందు న్మాధవారంభవే
ళ లతాభూజములం బరస్పరము రోలంబార్భకంబుల్వలెన్. 36

సీ. తమవారుగాంతు రన్ దలఁపునఁ గడకడల్
వింత గా నరయుచుఁ గొంతసేపు
ఇరువురిచూపులు నెదు రౌ నొకో యని
కొంకుచుఁ గొంకుచుఁ గొంత సేపు

ఇదె మంచిసమయమం చెదిరిచూపొదనమి
గొబ్బున దాఁటుచుఁ గొంతసేపు
ఆదిక్కు నస్తువు లరసెడునెపమునఁ
గొదుకక నిలుచుచుఁ గొంతసేపు

గీ. కోర్కెతో వక్రదృష్టులఁ గొంతసేపు
కుడ్యగతదర్పణంబులఁ గొంతసేపు
తరుణులయ్యిర్వురు ను బరస్పరము నెలమి
నాపఁజాలని తమిచేత నరసి రపుడు. 37

క. ఈక్షణము వారి యిర్వురి
యీక్షణములు జూచువారి యీక్షణము లెతా
మీక్షణము లంచు ముదమున
నీక్షణములు సన్నఁ జేసి రెన్నిరి సకియల్. 38

క. అరయుచు నన్యోన్యంబుం
దరుణద్వయనయనములు ను దద్దర్శనవి
స్ఫురితము లగుచుం దత్పరి
సరజనదృష్టులు ను మోదసాంద్రము లయ్యెన్. 39

క. ఆజవ్వనులకుఁ జూపుల
రోజం బ్రసభప్రవృత్తి నొందెఁ గొరులందుం
బీజావాపముఁ జేసె మ
నోజుం డనురాగవృద్ధ్యనోకహమునకున్. 40

శా. ఆరామామణి మాతులాత్మజునితో నాష్టాపసంధాయివా
గారంభంబునఁ బ్రొద్దు పుచ్చుచును బాహ్యాళీవినోదార్థ మై
యారామంబున కేగి యాతతమదవ్యాకీర్ణసీధుంబులన్
నారీయుక్తము లౌచుఁ దేంట్లు మధుపానం జూచి యగ్గించుచున్.

ఉ. అంకిలిమాట లాడును నిరంకుశత న్నచియింప దాతనిన్
సంకరచూపుఁ జూచు ననివారితదృష్టులఁ జూడ దిచ్చమైఁ
గొంకుచుఁ దోఁడ నేగు నవికుంఠగతిం జన నోప దీగతిన్
శంకలు గల్గఁగా దె మదిచందము వేఱుగ నున్న వారికిన్. 42

మ. ఇటు లామేనమఱంది యింతియు ను దా మెన్నంగ రానట్టియ
ప్పటియామారిమిసాక్షి మన్మథుఁ డె తప్పన్ వేఱు లే కుండఁ గాఁ
బుటముబ్బించక చక్కఁగా నిజమనోంభోజంబులం డాచి రం
తటిలో ముప్పదివాసరంబు లరిగెన్ హ్రాస్వంబు లై తోఁచుచున్.

క. తత్రత్యు లలరఁ గఁ బితా
పుత్రత్రితయంబు రాజపూజావిధికిం
బాత్ర మ్మై ప్రవాసరదశ
క త్రయ మప్పురమునందుఁ గడపె న్వేడ్కన్. 44

శా. తోయంపుంజను లాత్మ బెంగఁ గొన నైదోఁడుం దదీయాత్మజం
బాయం జాలక యెట్టకేలకును సంప్రాప్తప్రయాణోద్యముం
డై యింగ్లాండుసమాఖ్యరాష్ట్రమున మే లై దర్శనీయంబు లౌ
నాయాదేశము లెల్లఁ జూచుచు నపత్యద్వంద్వసంయుక్తుఁడై. 45

క. అటు నటఁ గోబ్గ్గవిభుం
డటనశ్రమ మారఁ దత్తదాలోకసము
త్కటమోద మందుచు న్నిజ
పుటభేదనమునకు సౌఖ్యమునఁ జనుదెంచెన్. 46

చ. ప్రియుఁ డటు లేగు టాది గ విభీతమృగీదృశ యంత కంతకా
శయ మొకవింతగాఁ బొగుల సాఁగుచు లొంగక యెన్న రానివి
స్మయ మొదవించుచుండుట విమర్శ మొనర్చి యుఁ దన్నిమిత్తని
శ్చయ మొనరింపఁ గొంతనడిఁ జాలక యుండెను బాల గావునన్.

ఉ. ముక్కు మొగం బెఱుంగని యపూర్వపుమానిసి బంధు వంచుఁ దా
నొక్కఁడు గొన్నినాళ్ళిచటనుండి తనంతట నేగెఁ దాను నా
చక్కటివార్త యుం దలఁపఁ జాలు నొ లే దొకొ యట్టివానికై
యిక్కరణిం దపించెద వ లేనిను నే మన మూఢచిత్తమా. 48

ఉ. పుట్టిననాఁటఁ గోలె క్షణము న్నను వీడక సర్వభంగి నేఁ
బెట్టినత్రోవల న్నడతు వే యటు లుండి యు నిప్పు డొక్క రా
పట్టినిఁ గూడి నాకు వశవర్తివి గాక చరించు చుండ నీ
కెట్టివివేక మింత నెగు లేటికిఁ జెందెదు మూఢచిత్తమా. 49

చ. అని యిటు లెన్నుచుం దమక మాపఁ గఁ జాలక లోనిచింత లో
నన యడఁగించుచున్ హితజనంబున కైనను దెల్పలేక నె
ట్టనఁ బరకార్యచింతలయెడన్ నడపించుచు ధైర్యమూఁది య
వ్వనరుహనేత్ర యుం గలఁతఁబొఱుమనంబును నిల్పె నేర్పునన్. 50

ఉ. వత్సర మిట్టు లేఁగ మునిపావకవారణచంద్రసంఖ్యసం
వత్సరమందుఁ బంచమపుమాసమునం దిరుబారనాఁడు త
ద్వత్సకు నాలుమూఁడులగు వర్షము లేఁగఁగ భూరిభూతి జ
న్మోత్సవ మయ్యె నాదిమదినోత్సవముం దల మీఱుకీర్తిచేన్. 51

సీ. సంగీతభంగీతరంగీభవన్నృత్త
రంగీకృతోరుగేహాంగణంబు
ధాటీకనచ్చిత్రశాటీకరంభిత
ఘోటీకలాపశృంగాటకంబు
కాంతాననీరుడ్లతాంతావళీసమా
క్రాంతానరోధనిశాంతకంబు
పారావతచ్ఛదాకారావహధ్ధూప
ధారావళీధ్వాంతసౌరపథము

గీ. భూరిపటహాదినాదవిస్తారదూర
నిరసితోపాంతవారాశినిస్వనంబు
నఖిలజనకర్ణయుగమోదావహంబు
నయ్యెఁ దజ్జననాహమహామహంబు. 52

క. వెల్లి యగుమోదరసమునఁ
దల్లి యలర నపుడు ముద్దుతనయకు నొసఁగెన్
విల్లియ మిరువదినూఱుల
ముల్లియ వెల పెట్టిగానములవర పేటిన్. 53

ఉ. లండనువీఁట నప్డు సకలస్వసహారని వేశము ల్సభా
మండలశిల్పిపాఠకసమాజము లెల్లను మూయఁ బంచి మే
ల్పండున యాట విందు రసబంధుర మై తగ రా జొనర్చె ను
చ్చండత రాజబాలిక కసంఖ్యము గా నరుదెంచెఁగానుకల్. 54

వ. ఇట్లు మ్మహోత్సవంబు నిఖిలజనమనోహ్లాదసంధాయకం బయి చెలం
గ నాపయిమాసంబగు జూనున వింశతిదిననిశాసమయంబున హ్యూణమ
తాచార్యప్రధానుం డగుకాంటరుబెరీ సమాఖ్యుండు ను కానింఘాము
నాఁ బరఁగు నొక్క ప్రభుముఖ్యుండు ను బ్రసుప్తజనం బయి తా
త్కాలికసరోజాకరంబు ననుకరించు చున్న కెన్సింగ్టను నగరంబుఁ
బ్రవేశించి రాజభవనద్వారంబు కడ ఘంటానినాదంబుఁ జేసి యుఁ గ
వాటంబుం దట్టి యుఁ దపాసపాన స్తనయిత్ను స్తనితాను కారిగంభీర
భాషణంబుల హెచ్చరించి యెట్టకేలకుం జేటీవిస్మృత ప్రధాన ద్వారం
బైనహర్మ్యాంగణంబునకుం జని రాజకార్యావశ్యకత్వంబున రాక
యెఱింగించి బాలామణిం దత్పరిచారికచే విగతనిద్రం గావించిన. 55

చ. అరవిరిగొప్పు పృష్ఠమున నాడఁ గ రేయి ధరించినట్టియం
బరము లోకింత క్రొంబిఱుసు వాయ పదాబ్జప్రతిబుద్ధ యాట సుం
దరతరశాక్షియుగ్మ్మ మెఱ తామర రేకులఁ గేరడింప న
ద్దొరకొలఁదుంగుమారిక యుఁ దోందఱపాటున నేగుదెంచినన్. 56

గీ. చూచి లక్ష్మీవిలాససం సూచిలక్ష
ణముల నొప్పారుఱత ద్వదనంబు సపది
వికసితాంభోరుహమునకు విందుసేయ
నలరి పల్కిరి ప్రస్తుత వ్యంజకముగ. 57

ఉ. రాజపరావనీధ్ర శిఖరంబునఁ గాలనిబద్ధుఁ డౌచు స
త్తేజము వాసి వ్రాలెఁ బరి దీపితసర్వదిగంతరాళ మై
రాజిలుభానుమూర్తి తిమి రంబుల నెల్ల నడంగఁ ద్రొక్కి యా
ర్త్యజనమానసంబు లల రించుచుఁ బూర్వనగంబు నెక్కెడున్. 58

క. కుముదాకర మిప్వేళం
బ్రమోదమును బాసి నిష్ఠుర న్మార్కిల్లెన్
సముదితవికాసవిలస
త్కమల యనుచు నెల్లయెడలఁ గమలిని యొప్పన్. 59

క. పరిణామజీర్ణ మగుచుం
జరమదశం జెందె రాత్రి సమయం బి దె వా
సరలక్ష్మి యలరు నిఁక ని
ద్దురఁ జెందఁగఁ దగు నె నీకుఁ దోయజనదనా. 60

వ. ఇక్కరణి వక్కాణించు నెడ నక్కాంతామణి నిజమానసంబు నిరు
పాయలు గాఁ జేసి యొక్కటం తద్వచనంబు లాలింపుచు నొక్క
ట నిట్లని వితర్కించె. 61

ఉ. ఈనిశవేళ వీర లిటకేగుట యేమి ప్రసుప్త నైననన్
బూనిక రాజకార్యభరమున్ వినుపింపఁ గ లేపు టేమి యా
పై నిటు ప్రస్తుతార్థమును బల్కక యీపెరత్రోవ యేమి యె
ట్లాని వినం గ నుంటి నొకదా మది తల్లడ మందె నీయెడన్. 62

శా. ఐనన్ దుస్స్పృహవాక్యసూచనములన్ హర్షోక్తిసంసూచనల్
దీనం దోఁచుచు నుండె రెండు తెఱఁగుల్ దీనత్వ మిం దేటికిం
గానై యున్నది మానదేటికిఁ గుతర్కం బంచుఁ దత్తద్వచో
ధీనస్వాంతత నుండె నయ్యతివ యాధీమంతులున్ వెండియున్. 63

శా. ఓరాజన్యకులావతంస సుగుణౌఘోదారసంస్తుత్య నిన్
జేరన్ రాజ్యరమావధూటి యుచిత స్నిగ్ధానురాగంబునన్
శ్రీరాజ్ఞీసమభిఖ్య యున్ సఖిక్రియం జేరన్ నినున్ లక్ష్మితో
నీరేజప్రియమూర్తి నాత్మరుచి నిర్నిద్రోరుశోభల్ వలెన్. 64

వ. అనవిని గుండె జల్లు మన నక్కట యీగతి దుశ్శ్రవోక్తులన్
వినఁ గల నే సమస్తపృథివీ పరిపాలనధూర్వహుండు మ
జ్జనకునియగ్రజుం డనలసస్థితి నుండఁ గ రాణి యంచు న
న్ననఁ దగు నే భవాదృశులు వ్యత్యయవాక్కుల కోడరే యనన్.

ఉ. లండనుపట్టణంబున కలంకృతి విండ్సరురాజగేహమం
దుండి యె రాక మాకు నిపు డుర్వికి ఏఁడగు విల్లియంసమా
ఖ్యుండు మహీనివాసమున నొల్లమిఁ జూపెను నేఁటిరాతిరిన్
రెండవగంటవేళ ధరణీభర మెల్లను మోపె నీపయిన్. 66

క. ఈ డెన్వ రితని కనఁగా
నే డేఁడులు భూతలంబు నేలి హితమతిన్
న్నేఁడు దివి కేగె నాతం
డేడుగడవ నీవు దక్క నితరులు గల రే. 67

ఉ. నావుఁడు బాలికామణి యనంతవిషాదనిమగ్నచిత్తయై
దైవము నీకు నింతదయ దప్పె నె నాపయిఁ బౌరుషోర్జితుల్
భూవహనక్షముల్ జనక ముఖ్యులు నన్నొడఁ బాసి రీభరం
బేవిధి నోర్చుదాన నను నెవ్వరు జూతురు గారవంబునన్. 68

ఉ. సర్వధురీణు లౌ జనకు జ్యాయసులుం జనకుండు నల్వురుం
బూర్వుల సన్నిధానమును బొందుచు బాలిక నైననాపయిన్
దుర్వహభూమిభారమును ద్రోసిరి దీనిభరింప నెట్లు గా
నోర్వఁ గఁ జాలుదాన సిరి కుబ్బుట కేవలమూఢ్య మే కదా. 69

శా. వేలున్ లక్షలు కోటులుండు జనులున్నన్ వారివాచాశతం
బాలింపన్ సదసద్వివేకములు సేయన్ ధర్మమార్గమ్మునం
బాలింపం దగును త్తరంబులను దీర్పం గాసహసాస్యుఁ డై
మేలౌను త్తరవాదిగా నలయు భూమీపాలనం బల్పమే. 70

ఆ. ఆఁడుదానఁ బ్రియవయస్యలతోఁ గూడి
యాడుదానఁ గాని ప్రౌఢఁ గాను
నేల నేల నన్ను నేల తా నియమించె
దైవ మొక్కయింత దలఁప దొక్కొ. 71

చ. అనునుడివెంబడిన్ సముది తాశ్రుభరంబు గళాంతరంబునం
ద నిలిపి గద్గదస్వర సమాకులితాక్షర యాచు ధైర్యముం
గొని గురువర్య దైన మను కూలతఁ బూని సహాయుఁ డౌచు నీ
ఘనభరమున్ వహించునది గా ననుఁ గూర్చి నుతించు నావుఁడున్.

ఉ. జానువు లుర్విఁ మోపి కర సారసయుగ్మము దోయిలించుచున్
ధ్యానపరాయణుం డగుచు నాతఁడు సర్వజగన్నిదానమా
మానసమండలంబు నన మానవివర్జితమార్గవృత్తి యై
మానవరాజ్ఞి యేలుట కమందకృపామతిఁ దోఁడు సేయుమా. 73

గీ. అను నెడఁ దదీయబింబంబులనఁగి నతని
వెంబడి నె దేవునికి నందనంబుఁ జేసి
లేచి తత్రత్యులు ను దోయి లించి యున్న
హస్తములు వేఱు సేయక యామె కనిరి. 74

శా. నీకై దేవుని మేము వేఁడికొనుట ల్నీ శ్రేయముం గోరుటల్
మాకున్ మే లొనఁగూర్చి నీవు మముఁ బెంపం గోర్కెచేఁ గాకనీ
లోకల్యాణి మహోపకారకృతి గా దుర్వ్యజము ల్నిల్పి త
త్ప్రాకట్యంబున కుద్యమించుట ఫలేప్సాహేతుకం బే కదా. 75

మ. అనినన్ ధీరమనస్క యై కలదు దయ్యం బంచు సర్వంసహా
వనరీతి న్విడి యర్హగౌరవముతో వారిం దగం బుచ్చి యిం
దనురూపం బగుకార్య మియ్యది యటం చాత్మ న్నిరూపించి లే
ఖను వ్రాసె న్స్వపితృన్యభామినికి శోకవ్యాకులత్వం బలన్. 76

వ. అదియెట్లంటేని. 77

శా. ఓతల్లీ యెడిలెయ్యురాణి నిను నే నోదార్చఁ గా నెంచుచుం
బైతృవ్యాదరదూర నౌట విగళద్బాష్పాక్షి నై వ్రాయుచో
నేతాదృగ్దశ నీవు వీడుమనఁ గా నెట్లొను సర్వజ్ఞ వౌ
నీతో గట్టిగ నైనఁ జెప్పుటకుఁగా నే నెంతదానం జుమీ. 78



రాణీగారి మొదటిసభ, కెన్సింగ్టను సౌధము. 11 ఉదయము. 21 జూను 1837. 87.

శా. నీకు న్నాపయిఁ గల్గువత్సలతచే నేఁ బూనితిం జెప్పఁ గ
నేకాలంబున నెట్టిదుఃఖము సుఖం బేమానవుం డొందుఁ గా
నేకర్మంబునఁ జెందఁ గా నగు నొ యట్లే సాఁగెడుం దీనికై
శోకం బందఁ గ నేల మాన్పుటకు నీశుం డైనఁ దా నీశుఁడే. 79

గీ. కాన నామాట యొకపెద్ద గాఁ గ నెంచి
వందురుట వీడు మని చేతు వందనంబు
లనుచు లిఖియించి యాలేఖ ముసకుఁ బయిని
నెడిలెయిడురాణిగారి కం చింతి వ్రాసె. 80

ఉ. వ్రాసినఁ బూర్వరాజ్ఞి కని వ్రాయఁ దగుం బయినామ మంచు విం
దొసఖి యొత్తు పల్కు విని యామెకుఁ గల్గినమార్పు మున్ను గాఁ
జేసెదుదాన నే యనుచుఁ జేసితిఁ గాక యెఱుంగ కుంటఁ గా
దాసతి తా నెఱుంగ దొకొ యంతటిలోపల బేల నాదు నే. 81

క. అని పల్కి పుచ్చె నట్లే
వనితారత్నము పితృవ్యవనితకుఁ గమ్మన్
ఘనము లగుతద్గుణంబులు
కొనియాడం దగ వె కోటికోటివిధములన్. 82

వ. తదనంతరం బానారీలలామంబు నిజజననీసన్నిధిం దత్కాలోచితంబు
లగునూహాపోహసమర్థకవాచోయుక్తులం బ్రొద్దుఁ గడపు చుండునంత.

మ. ముద మొప్పార నమాత్యముఖ్యుఁ డగు మెల్బోర్నసమాఖ్యుండు తో
మ్మిదియౌగంటలవేళ వచ్చుటికి నెమ్మి న్వచ్చి నేఁ డిప్పురిం
బదునొక్కండవగంట నాంతరసభాప్రారంభ మౌఁ గాన సం
పదలంకారమ వౌచు సభ్యజనవిజ్ఞప్తిం జెవిం గూర్ప నౌ. 84

క. మఱి యుం దానకహృద్గత
మెఱిఁగింపుచుఁ బ్రకృతిజనులహృదయమ్ములకుం
గఱవుం దీర్పఁ చు నీదగు
నెఱతనముం దెలుప వలయు నేఁ డని పలుకన్. 85

శా. చింతావ్యాకులచిత్తసూచకము లౌచేలంబులం దాల్చి యా
కాంతారత్నము ముఖ్యమంత్ర్యుదిత మాకాలంబునన్ వచ్చె వ
ర్షాంతాంభోజినిఁ బోలె నిండుకొలు వాస్యాంభోరుహస్నిగ్ధమై
యెంతే రాజిలె నామెచే నవదినాధీశోరుదీప్తిం బలెన్. 86

సీ. అపుడుదాలిచినచింతాకల్పకల్పన
నిం తింత యనరానిచింతఁ జిల్క
సుప్రసన్నముఖాంబుజప్రణయంబున
హేతుశూన్యం బగుప్రీతిఁ జిల్క
సర్వోర్వరాచక్రధూర్వహప్రభుతచే
వెడవెడపాటుతో వెరగుఁ జిల్క
చిఱుతనాఁ డెనలేనిసిరిఁ బూను చుంటచే
గురుతరం బైన యబ్బురముఁ జిల్క

గీ. వనితరూపము నిన్నటిదనుక నొక్క
కరణిఁ గనుఁగొన్నవారి కక్కజము గాఁగ
బహుళతరభావసంకీర్ణభావ మిట్లు
చేసెఁ గద నేఁడు దైవంబుచేత యదిది. 87

ఉ. అప్పుడు వింజ మాకిడినయట్లు గ సభ్యులయందు నొక్కఁడుఁ
గుప్పిన నూర్పు నైన నిడఁ గూడక యుండెఁ దదీయ నేత్రముల్
ఱెప్పలు మోడ్ప కే యతిమితి న్నరరాజతనూసమావృతిం
దప్పఁ గ నన్యకార్యవిరతస్థితి నుండె మహోత్పలాకృతిన్. 88

మ. వనరాశిప్రథమానధీరు లగు కంబర్లండుసస్సెక్సు నాఁ
జనువారల్ పినతండ్రు లిర్వు రెదు రై సంభావ్యతం జూపఁ గా
వినయానమ్రముఖాబ్జ యాచు సభకు న్విచ్చేసి రాజార్హపీ
ఠినిఁ గూర్చుండి వచించెఁ జైత్రికలకంఠీచైత్రవాక్యంబులన్. 89

శా. ఓసాధూత్తములార మామకపితృవ్యుం డేమవర్షంబులన్
వాసిన్ రాష్ట్రము నేలి భూమితలముం బాయం దదుచ్చార్తితో
నీసర్వావనిభార మొక్కమొగిఁ గా నీచిన్నపాయంబునన్
మోసెన్ నాపయి దీని నేతెఱఁగునం బూనన్ సమర్థాత్మనో. 90

ఉ. ఇంతకుఁ దెచ్చినట్టివిధి యేమటి యుండు నె దీనిఁ బూనఁ గా
నింతబలంబు నా కొసఁగెఁ డే సకలానుభవంబు గల్గుధీ
మంతులు శాస్త్రసిద్ధులు ను మాన్యవయస్కులు నైనవార లే
పొంతఁ జరింతు రట్టిగుణపూర్ణపథంబును నాకుఁ జూపఁడే. 91

ఉ. నామది ధర్మమార్గపరిణాహవిశేషవిచారముం బ్రజా
క్షేమవిధానయోగపరిచింత యుఁ దోడ్పడి చుల్కఁ జేయ వే
యీమహనీయభార మని యెంచుచు నాస వహింతుఁ గాక యు
ద్దామభరంబు నేఁ దలఁచి తద్ద యుఁ గ్రుంగక యుండ నేర్తు నే.92

ఉ. వావిరిఁ బార్లమెంటుసభవారివినిశ్చలబుద్ధిసంపదన్
భావుకయుక్త మాప్రకృతిభక్తి యు రక్తి భవత్కృతంబు లా
దీవన లెన్నఁ డేని యు మది న్మఱ పొందక విశ్వసించెదం
గావుత నెల్లవారల సుఖంబును శక్తికొలందిఁ బెంచెదన్. 93

శా. యోగక్షేమములం గనుంగొనఁ గఁ గ న్నుంతుం బ్రజాసంఘమం
దాగస్కారుల సత్యనర్తనుల నర్హప్రక్రియం ద్రిప్పెదుం
బ్రాగల్భ్యంబును జూపుదాన నిది ముమ్మారు న్వచింతుం జుఁడీ
వాగాటోపము గాదు సత్య మనుచు న్వాక్రుచ్చిన న్సభ్యులున్. 94

ఉ. ఆనరపాలికామణికి హస్తయుగంబులు మాళి నంటఁ గా
జానువు లుర్వి ముద్దుఁ గొన సాఁగిలి మొక్కి రనుక్రమంబు గా
నానత వైరివీరమకుటాంచితపాదసరోజయుగ్మ వై
యీనిఖిలక్ష్మాతలము నేలెద వీ వని తెల్పుచాద్పునన్. 95

క. ఆసంఘమువా రీగతి
బాసల నొనరించి రాజభక్తిఁ దెలుపుచుం
బో సాఁగి రొక్క రొక్క రె
మోసం బొసఁగకు మటంచు మ్రొక్కుచు దేవున్. 96

చ. తనపినతండ్రు లప్పుడినధర్మముచే శపథోక్తిపూర్వవం
దనము లొనర్ప రాజ్ఞి యుఁ బదంపడి ప్రత్యభివందనక్రియా
వినమితశీర్ష యాచు మది బెగ్గిలి మైఁ బులక ల్వహించె వం
దనములు వందనీయు లిడినం జలియింపక యుండ శక్య మే. 97



శ్రీ విక్టోరియారాజి. రాజ్యప్రాప్త్యుత్సవము నాటి యుదయము. 91.

ఉ. ఆజననంబు గా ననుపమాత్తసద్గుణరాజిసంపదన్
రాజముఖీలలామ మయి రాజిలు మన్నవరాజ్యసంపదన్
రాజలలామ మై యిపుడు రాజిలి సర్వకళావిభూతిచేఁ
దేజము మించు తేవెలుఁగుతీరు నహించెను నిండుతేజుతోన్. 98

క. శ్రీపీఠ ముజ్జగించుచు
నాపినతండ్రులను గౌరవాదరభరముల్
దీపింప మున్గుఁ గొని జన
నీపరిసరమునకు నేగె నిశ్చలమతి యై. 99

వ. ఇట్లాదినంబు నవీనరాజ్ఞీలాభ సంతుష్టజనం బై యపూర్వప్రక్రియం జరిగిన మఱునాఁడు సకలమాననమానస సంస్తూయమానం బైన రాజ్యప్రాప్త్యుత్సవంబు నరీనృత్యమానకిన్నరీ పరిపాటీ దూరీకరణపటునారీజనసమాకాంత చత్వరంబు ను చటులతరనటనపటుఘోటక ఖురపుటపటలీఘట్టిత కుట్టిమ పటపటాత్కారసముజ్జృంభిత ఘంటాపథంబు ను నుత్సవదిదృక్షాసమాయాత మనుజ హస్తతాళస్వానప్రతిస్వన దుత్తాలచంద్రశాలాశతంబు ను మహోర్మి సమాగమ సమయాసమగౌరవ ప్రద్యోతక శతఘ్నికా శత ఠాంకారనిర్ఘోషబధిరీకృత దిగంతానంతజంతుసంతానంబు ను నతికౌతుకితవితత జనవిస్తార్యమాణ జయజయారావ సమాకాంతనినదాంతరంబు ను సంజ్ఞామాత్రప్రకటీకృత పరస్పరాభిప్రాయవిశేషంబు న నిఖిలగేహోపాంత నిర్మితసాంద్రతర పతాకాసహస్ర విధూననసంభూతప్రభూత చటచటారావ సంపూరిత వ్యోమాంగణంబు ను నై ప్రవర్తిల్లు చుండె. 100

క. అయ్యెడ భూతలరజముల్
వెయ్యాఱులు నడచునట్టివీథి నయారే
చయ్యనఁ బై కెగయఁగ లే
వయ్యె న్నృపహితసాంద్రమానవారోధమునన్. 101

శా. ఉర్వీమండనలండనాఖ్యపురమం దుత్తుంగసౌధస్థలా
ఖర్వాగారవితర్ది కాదు లరయం గా నిష్టకామ్యచ్ఛిలా
దార్వాదిప్రతిపత్తి లేక యతిచిత్రం బైనశిల్పక్రియా
నిర్వాహంబున మానవవ్రజముచే నిర్మించి రో నాఁ దగన్. 102

మ. విలియంభూపతి యుర్విఁ బాయుట యు నవ్విక్టోరియాబాలకు
న్విలసద్రాజ్యరమాపదం బిడుట యు న్విఖ్యాత మౌనట్టు గాఁ
దెలియం జాటఁ గఁ జేసి యెల్ల యెడఁ దద్దేశోచితప్రక్రియం
గలయాచారము లాచరించిరి మహీకాంతప్రధానాదికుల్. 103

వ. తదనంతరంబున. 104

క. అట్టియెడన్ ధైర్యంబున
దొట్టినకన్నీరుఁ దొలఁగఁ ద్రోయుచు నెడఁదం
బట్టికొని తల్లి యుండెడు
పట్టునకున్ రాణి యేగెఁ బటువేగమునన్. 105

ఉ. ఏగి సరోజదీర్ఘ మగునీక్షణయుగ్మమునందు నశ్రువుల్
దోఁగుచుఁ జెక్కుటద్దములఁ దొట్టుచుఁ గ్రొందళు కిమ్మడింపఁ గా
వేగతి నాగుదాన జననీ మహిభార మచింతితంబు గాఁ
దీగపయిన్ మహాఫలముతీరున మోపెను జిన్నవాఁడనన్. 106

ఉ. అమ్మగువం గనుంగొని తదంబ నచించు దురాపరాజ్యభో
గమ్ము లభింప మోదమును గాంచెడుపట్లు దురంతతాపముల్
గ్రమ్మినపోల్కి నిప్పగిదిఁ గన్నుల నశ్రుజలంబు నించె దే
మమ్మ యధైర్య మిట్లు తగు నమ్మ శుభంబగునమ్మ నావుఁడున్.

సీ. ఘోరరాజ్యపీఠమం దుపవిశింపఁ గ నేమి
భుజపీఠి మేదినిఁ బూన వలయు
నిష్టభోజనములఁ దుష్టిఁ బొందఁ గ నేమి
జనులయాఁకలి వెట్టుకోనఁ గ వలయు
భృత్యోపచారాదికృత్య మొందఁ గ నేమి
పెఱవారికృత్యము ల్నెఱప వలయు
భూరిభోగంబులఁ బొల్పొందఁ గా నేమి
పరులయిక్కట్లకు వగవ వలయు

గీ. నితరమానవు లెంచ నాత్మైకదేహు
లఖిలలోకైకవిగ్రహు లవనిపతులు
కానభూపాలనం బతికష్టరక్ష్య
మిదిసుఖం బని యెంచుట యెఱుక లేమి. 108

గీ. రెండుకన్నులు మోడ్చుచు నిండునిద్రఁ
జెంద వలనదు బహుకార్యచింతనమునఁ
గడుపు నిండారునంతటికుడుపు సొరదు
రాజ్యసంపద యన సుఖభోజ్య మగునె. 109

ఉ. కల్ల నిజంబు సేర్పరచుకార్యమునం బ్రతివాదిచిత్తమం
దల్లనఁ జొచ్చి వానిహృదయం బతినైపుణి మీఱఁ గాంచుచుం
దెల్లము సేసి న్యాయమునఁ దీర్చెడుఁ డఖిలేష్టుఁ డౌనె యో
చెల్ల తదన్యమానవుఁడు స్నిగ్ధత నెల్లెడఁ జూప నచ్చఁగా. 110

ఉ. నా మెఱిలాయిసాఖ్య హసనంబున నొప్పెడుకన్నుదోయిచే
నా మెను జూచి యింతదిగు లందఁ గ నేటికి నిట్టిచింత యే
నీమహనీయగౌరవము నిల్పెదు నీశ్వరుఁ డుం గృపాప్తిచే
నోమెడు నంచు ముద్దుఁ గొనె నొప్పగుచెక్కిలి వేళ్ళ నంటుచున్.

మ. నరపాలత్వము నీగతిం గొనినయానారీశిరోరత్నముల్
నరపాలుం డన వచ్చు నో మఱి యు నెన్నన్సర్వభూపాలశే
ఖరరత్నం బన వచ్చు నో యటుపయిం గాన్పించ దర్హాఖ్య గో
చర మైన న్నతి యెంతనామమునకుం జాలు న్వితర్కింపఁగన్. 112

ఆ. పారిజ్యరాజ్య మిట్లు పట్టబంధమహంబు
కొఱఁత గాఁ గఁ జెంది కొమరురాణి
క్రొత్తమనసుఁ బెట్టికొని రాచకర్జంపు
చింతనంబు నాఁ డె చేయఁ గడఁగె. 113

శా. ఏకాంతంబున కేగి యాపిదప సర్వేశుం దయాసంతుఁ దా
నేకాంతస్థితచిత్త యై పొగడె ని న్నే నమ్మితి న్నిత్య మం
చాకాంతామణి సర్వభారము ను నీ కర్పించితిం బ్రోవు మం
చేకాంతల్పరిఁబోల్పఁ గాఁ దగుదురయ్యేణీలసన్నేత్రకన్. 114



విల్లింగ్టనుమంత్రి. మరణదండనను రాజ్ఞికినివేదించుట. 95.

శా. విశ్లింగ్టన్సమభిఖ్యమంత్రివరుఁ డవ్విక్టోరియారాజ్యసం
పల్లాభం బొనఁ గూడునంతకు సమీపం బైనకాలంబునం
దెల్లం బౌనపరాధ మొక్కభటుఁ డర్థిం జేయఁ దచ్ఛీర్షమున్
డొల్లం జేయ లిఖించి శాసనము విక్టోర్యాగ్రమం దుంచినన్. 115

క. తనకరసరసిజమున శా
సనము మహారాజ్ఞి బూని చదువుచుఁ గరుణం
గనుఁగొనల జలము చిప్పిలఁ
గనుఁగొని ప్రెగ్గడను గళితగళకలరవ యై. 116

సీ. ఈకార్య ముడుపుట కెద్ది యేని యు నొక్క
తంత్రంబుఁ గాన వే మంత్రివర్య
కాన రా దీతఁడు సేనను విడి మూఁడు
దడవలు వోయెను ధర్మరాజ్ఞి
మరలం గఁ దలపోసి మంచిచర్య యొకండు
చక్కఁగాఁ జెప్ప వే సచివముఖ్య
సైనికత్వం బెల్లుజరపిన నోదేవి
సద్వ్రతజ్ఞుం డని సాత్త్వు లంద్రు
గీ. అనిన వందన మనుచు శాసనమునందు
సైచితి మటంచు లిఖియించి సంతకంబుఁ
జేసి సచివుని కిచ్చె నాచిన్నరాణి
వయసునకు మీఱెఁ దద్గుణవైభవంబు. 117

మ. అలనాఁడోడ నుదారదారుపతనవ్యాపత్తి సాండర్సు ని
శ్చలుఁడై మాన్పుట నెంచి వానిఁ దనయాస్థానంబునం దెచ్చి సం
కలితోద్యోగునిఁ జేసి పిల్లతరముం గాపాడుచుండె న్మహిం
గల రే యింతకృతజ్ఞు లంచు నటఁ బెక్కండ్రాత్మలన్ మెచ్చఁగన్.

ఆ. ఎల్లవారు నామెయేల్బడిలోపలఁ
దల్లిచెంత నున్న పిల్లలక్రియఁ
బవలు రేయి మోదభరితు లై రల్లాటఁ
బ్రజలనంగ వారు బరఁగి రేమొ. 119

క. నెమ్మి చివు రెత్తుచుండఁగ
నమ్మగువలమిన్న కప్పుడాల్బర్టు తగం
గమ్మవిలుకానియానతిఁ
గమ్మ యిటుల వ్రాసి పంపె గౌరవరీతిన్. 120

ఉ. ఓహృదయప్రియా! సముచితోచ్చ్రయముం గరుణించెనీకునీ
సాహసధైర్యముఖ్యగుణ సంపదకై ముద మంది యీశ్వరుం
డీప్సితసిద్ధి కెంతయును హెచ్చినవేడ్క నొకింత వ్రాయఁ గా
నీహ జనించె దీనికయి యించుక కాలము వెచ్చపెట్టుమా. 121

ఉ. యూరపుఖండమండలిస ముచ్ఛ్రితదేశపురాణి వొట ని
ర్ధారుణిలక్షకోటిజనతాసుఖ మెల్లభవత్కరంబునం
జేరెను గాన దానిఁ బరిశీలనఁ జేసెడునట్టిశక్తి యున్.
ధీరత యు న్నిరంతరము దేవుఁడు నీకు నొసంగుఁ గావుతన్. 122

చ. అస మసమంబు గాఁ బ్రజల నాదృతి మీఱఁగ దీర్ఘకాలముం
బస దనరార సౌఖ్యపరిపాలన మీ వొనరింప వారు వి
శ్వసనము రాజభక్తి యును బ్రత్యుపకారముఁ గాఁగఁ జూప నిం
పెసఁగఁగ నుండు నంచు మది నిచ్చ వహించుచు నుంటి నెంతయున్.

ఆ. బానునగరి నుంద్రడు మేనమామతనూజు
లని తలంచు చుండు మప్పు డప్పు
డుల్లమందు నిడుము తొల్లింటిప్రణయంబు
ననుచుఁ గోరి యుంటి నర్వ మగుట. 124

ఉ. నీపయి నిల్చె మామదులు నిశ్చయ మింకను బెక్కు వ్రాయుచు
న్నీపని కంతరాయ మిడ నేరను గానఁ గలంబు నింతతో
నాపెద నిల్పు సేవకుఁడు నా ప్తవిధేయుఁడు నాలుబ ర్టటం
చాపినరాణికిం బనిచె నంపినయాప్రియలేఖఁ జూచుచున్. 125

చ. పలుమఱుఁ గంట నద్దు నగు బాష్పము లుప్పతిలం గ నొత్తుఁబెన్
పులకలు గ్రమ్మ మేనిపయిఁబుట్టముఁ జేర్చును జెంత నెవ్వ రేఁ
గల రని దిక్కు లారయును గద్గదవాక్కుల దేవు వేఁడు ని
శ్చలమతి నయ్యెడం గుసుమసాయకుఁడు న్విడివేసె మీసముల్.

ఆ. అప్పు డపుడు పరిణయంబునకై మేన
మామ కమ్మ వ్రాయ నామె రెంచి
పంచవింశవర్ష పర్యంతమును వల
దనుచు మారుకమ్మ ననుచు చుండె. 127

క. పదిలముగ రాజ్య మేలెడు
సదనున సాంఘికసదస్యు లారాణికి ము
ప్పదియెనిమిదిలక్షలయేఁ
బదివేల స్రొక్క మిడిరి ప్రతివర్షంబుల్. 128

ఉ. ఎట్టిది నైన మంత్రి యొకయించుక చీటినిఁ దెచ్చి ముందటం
బెట్టినఁ జక్కఁగాఁ జదివి మేలు గ నాయ మటంచుఁ జిత్తముం
బట్టిన వ్రాలు నించు నొకపాటిది గా మదిఁ దోఁచె నేనియుం
బుట్టను బెట్టుఁ గాని మఱి ముట్టదు హేతుసహస్రకల్పనల్. 129

వ. ఇట్లు జరుగు చుండ నొక్కనాఁడు. 130

చ. సచివుఁడు రాజకార్యహితశాసన మొక్కటి వ్రాసి తెచ్చి యం
దుచితమహోరరీకృతికి యుక్తులు సెప్పఁ గ రాణి యి ట్లనుం
బ్రచురపరీక్ష సేయుచు విపక్షసపక్షము లెన్ని చూచున
ట్టిచదురు లభ్యసించితిని డెంద మభీష్టపరంబు గాదు గా. 131

ఉ. అంతటఁ బోక యాతఁ డను బ్రౌఢిమ మీఱఁ గ నొక్కి చెప్పుచున్
సంతక మిం దవశ్యమును సల్పనిచోఁ జెడు నన్న రాజ్ఞి యుం
బంతము పట్టి చూచి యవిమర్శసహంబు నిరాకరించుట
త్యంత మవశ్యకృత్య మని యయ్యది త్రోసెను వ్రాలు నించకే. 132

క. ఈరాణి సచివతకు దళ
భూరమణామాత్యత యను బోలదు కష్టం
బౌరా యనుకొను నఁట మె
ల్బోర్న్ సమభిఖ్యమంత్రి పుంగవుఁ డంతన్. 133

సీ. ఆదేవి మేల్కాంచి యర్ధరాత్రంబున
రాచకర్జములసారంబు నెంచు
నెంచి ప్రెగ్గడలచే నిదమిత్థ మనిపించి
యది యాచరించుట కాజ్ఞ సేయుఁ
జేసిన యాత్మీయశాసనం బన్యథా
భావ మందక యుండఁ బారఁ జూచుఁ
జూచి యించుక భేదసూచనఁ గల్గినఁ
గ్రమ్మర నొడ్డోలగమునఁ దెచ్చుఁ

గీ. దెచ్చి గుణదోషముల నెల్లఁ దీర్పు సేసి
కడఁగి యవ్యాహతక్రియ నడపుచుండు
నార యింతటిచాతుర్యమభ్యసింప
నెవ్వరికిఁ గల్గు నని జను లెంచు చుండ. 134

ఉ. పుట్టి యె యభ్యసించె నొకొ పుట్టక నేర్చె నొ రాజ్యతంత్రముల్
దిట్టరి యైనిరాకులతఁ దీర్చుచు నుండె నయారె యంచుఁబల్
మట్టుగ నేలుచుం జిరము మాన్యతఁ గాంచినచక్రవర్తులుం
గుట్టు చెడంగ డీల్పడఁగఁ గోమలి యేలుచునుండె నేర్పునన్. 135

చ. తమతొలిభూమినాయకులు దాల్చినయట్టికిరీట మాత్తభా
ర మగుటఁ జక్కఁగా నది యె క్రమ్మర దిద్దుచు నుంటచేత నా
యమకుఁ బ్రభుత్వ మబ్బినను నాతతపట్టనిబంధ మొక్కవ
గ్గ మ కడమట్టునంతకును సాఁగక యుండెను దైవచోదనన్. 136

క. పదియొనిమిదిశతములము
ప్పదియొనిమిది యైనయేట వరలెడుజూని
ర్వదియొనిమిదవదినంబున
సదమలరాజ్యాభిషేకసంస్కృతి యయ్యెన్. 137

క. ఆనాఁట నేమి చెప్పుదు
నానాటం గల్గుమానవౌఘంబు నిజ
స్థానముల కెల్ల బీగము
లానె మహోత్సవదిదృక్ష నరిగెడువేడ్కన్. 138

సీ. ప్రాసాదవలభికాప్రాంతసంస్థాపిత
కలశంబులను లతల్ కెలయు చుంట
నత్తరుపన్నీరు లగరుగంధంబులు
రొంపి యై తావులు నింపు చుంట
నాకాలమునఁ గల్గునలరుల జివురులఁ
బౌరదేహము లెల్లఁ బ్రబ్బి యుంట
ననుభూతచరంబు లగుభూరిఫలములు
విపణివీథులయందు వెలయు చుంట

గీ. దారుశేషంబు జేసి యుద్యాన మెల్ల
వలస వచ్చిన దొకొ యుత్సవంబుఁ జూడ
నపుడు వనలక్ష్మి వీటికి ననఁగ నొప్పెఁ
దక్కువారలు వచ్చుట లెక్క యేల. 139



రాణిగారి సింహాసనపుకుర్చీ. 101.



కిరీటాభరణములు. 101.

ఉ. పువ్వులబంతు లాడుచునుఁ బొల్పుగఁ బాడెడువార లొక్కెడం
గ్రొవ్వెద లాడ నాట్యములు గుల్కుచుఁ జేసెడువార లొక్కచో
నవ్వు మొగంబులం బ్రియజనంబులఁ బల్కెడువార లొక్కట
న్నివ్వటిలంగ నప్పుర మనీదృశవాచ్యతఁ బొల్చె నత్తఱిన్. 140

మ. ప్రజ లెల్లం బటపత్త్రిచక్రములు మార్గాజ్ఞీశిరోరత్నముల్
విజయాఖ్యాతు లొసంగి యేలుత సదావిశ్వేశుఁ డంచుం జల
ధ్వజచేలాంచలధూతరేణుచయవిస్పష్టాక్షరంబుల్ దగ
న్నిజగేహాంతికమందు రథ్యకడలన్ నిల్పించి రుత్కంఠచేన్ 141

చ. కిరణము లేటవాలు పడి గేహములం గిటికీలత్రోవలన్
ధరణికి సోఁకి ముగ్గుల విధంబును జూప దినాధినాథుఁ డం
బరశిఖరంబుపైకి నెగఁబ్రాఁకుటకుద్యతుఁ డైనవేళ నా
గరపరిచారకుండు పదిగంటలు వేసెను ఖంగుఖంగునన్. 142

క. వృక్షముల స్వీయమానస
దృక్షము లగునీడలందు దెలుపరు లెలమిన్
విక్షోభ ముడుపఁ గోరి క్ష
ణక్షణమున్ నిలచి యల్లనం జనువేళన్. 143

గీ. అమ్మహోత్సవ మితరలోకమ్ములకును
దెలియఁ జేయుద మనునట్టితలఁపున నన
వింశతిశతఘ్నికలు దెసల్ ప్రేలు నాదు
లొప్పఁగ నగాదులను జేసి రొక్క మొగిని. 144

ఉ. రాజలలామ యై యెసఁగురాణి శిరంబునఁ దాల్ప నేగును
త్తేజితరత్నపుంజపరిదీపిత మామకుటంబుఁ గావునం
దేజము దప్పె సూర్యుఁ డని దిద్ది రొకో ప్రతిసీర మింట నా
రాజగృహాంగణంబుకడ రాజపతాక నమర్చి రయ్యెడన్. 145

వ. ఇట్లు. 146

మ. ముహురుద్ఘాతము లైనలక్షణములం బోలం గవీక్షించుచుం
గృహరాజంబయి రాజగేహమగుబక్కింఘాముఁ దా వెల్వడె
న్మహిపాలాగ్రణి రాణి యంచుఁదమలోనన్ మానవుల్ బల్కుచున్
బహుళీభూతము గాఁగ మూఁగి రఁట సామంతాదిదీనాంతమున్.

ఉ. పొచ్చెము లేనిమేనఁ దగుభూషణవస్త్రము లొప్ప రాణిరా
లచ్చి నవావతార మొ యిలాసతి యో యన రాచత్రోవకుం
దచ్చిగురాలు గల్గి మహినాథునకుం దగినట్టితేరిపై
వచ్చె ననేకరాజపరివారితపార్శ్వ యుగాగ్రపృష్ఠయై 148

సీ. దర్శనీయుల నింపుదైవార నీక్షించె
దీర్ఘదీర్ఘంబగు దృష్టిచేత
మానార్హు లగువారి మన్నించి పల్కెను
దీర్ఘదీర్ఘంబగు దృష్టిచేత
నభివాదములకుఁ బ్రత్యభివాద మొనరించె
దీర్ఘదీర్ఘంబగు దృష్టిచేతఁ
బుడమిఱేఁడు లొసంగు నుడుగరల్ జేకొనె
దీర్ఘదీర్ఘంబగు దృష్టిచేత



విక్టోరియారాజ్ఞి. పట్టాభిషేకసమయము. 102.



రాణి ప్రొటస్టెంటుమతమునిలుపుటకై ప్రమాణము చేయుట. 103.

గీ. నందఱికి నన్నిరూపుల నమరు చుండఁ
జూచునైపుణ్య మద్దేవిసొమ్ము గాఁగ
ధాత్రిఁ గలమానవుల నొకత్రాఁటిమీఁద
నడపు నే యని సంశయపడఁగ నేల. 149

మ. ఉరుహేషాపరిజృంభమాణ మగుచున్ యుగ్మాష్టకంబుద్ధతిం
బరవం జూడఁగ నంతవాగెల బిగం బట్టం దగన్ వెస్టుమిన్
స్టరు నా నొప్పెడుదేశశంబు విజయస్యానంబు లొప్పార భా
సురతం జెందెను తేరు పౌఁజులు విమల్ చోద్యంబు గాఁ జల్లఁగాన్.

క. జయ జయ యనుపటునిస్వన
మయ మైశబ్దాంతరంబు మార్పడె రాజా
లయము న్మొదలు గ దేవా
లయము దనుక భూరిమనుజలక్షలు గ్రమ్మన్. 151

శా. సౌధాగ్రంబుల నున్నవారలకు పీక్షామోద మొప్పార రా
డ్వీధిన్ రక్తసితాసితాదిపటసంవీతాత్ము లెంతేని సం
బాధంబొప్పఁగ నేగుచోఁ గనఁదగెం బట్టాభిషేకోత్సవ
ప్రాధాన్యంబు గఁ జిత్రకంబళములం గ్రమ్మించి నట్లప్పురిన్. 152

క. ఆగుడికిఁ గౌతుకమ్మున
నేగి మహోత్సవముఁ జూడ నిచ్చ గలజనుం
డాగమనపత్త్రమునకై
యీఁగ వలసె రౌప్యముద్రలిన్నూ టలమిన్. 153

గీ. అందు డిగి దేవి దేవతావందనంబు
లాచరించుచు నతనిభృతాత్మ యాచు
ము న్న భృత్యులు రచియించి యున్న మేలి
విష్టరవరంబునం దుపవిష్ట యయ్యె. 154

ఉ. కార్యవిధానవేది యతిగౌరవభాజన మైనతత్కులా
చార్యవరుండు సేయఁ దగుసన్విధు లెల్లనుఁ జేసి యయ్యెడన్
సూర్యమరీచులం దెగడుచొక్కపురత్నశతంబులం బ్రభా
ధుర్యతగల్గుమాళిఁ బలుతోరము గా నిడె రాణియాదలన్. 155

క. పదునొకలక్షలపై ము
ప్పదివే లౌప్యములవెలను బడసె రతనముల్
పదునాలుగువందలు న
ర్వదిమూఁడుం గల్గు నందు వజ్రము లెన్నన్. 156

ఉ. ఆమకుటప్రభల్ గలిసి యక్షులకు న్మిరుమిట్లు గ్రమ్మఁ గా
నా మెను జూడఁ గా వెరచి యందలిమానవు లెల్ల నంతలో
నే మొ సుధాప్త మాగుడికి నెన్నఁ గ రానియనేకవర్ణముల్
బాౘిమినరీతి దోఁచె నని భ్రాంతమనస్కతఁ గాంచి రయ్యెడన్.

సీ. ఈమెకుఁ దగుమాళి యీ మె మాళికిఁ దగు
నసుచు నానందంబు నందువారు
అలయలఙ్గాండ్రినా యగు నొ వే లొకతె యొ
యనుచు సందియమున నరయువారు



రాజ్ఞి శిరముపై ప్రధానమతాచార్యుడు కిరీటము నుంచుట. 104.

దేహకాంతి కిరీటదీప్తియు నేకమై
వెలుఁగుచుండె నటంచుఁ దలఁచువారు
మెరిలూయిసౌఖ్యకు మేలికాన్పు లభించె
ననుచు వేమరుఁ గొనియాడువారు

గీ. నింతసిరి యబ్బుటకుఁ గాదె యింతిచిన్ని
ప్రాయమప్పుడె సద్గుణభాసమాన
యయ్యె నని యెంచువారలు నైరి రాజ్ఞి
యాదలను మాళి ధరియించ నచటివారు. 158

ఉ. భూరికిరీటరత్నరుచిఁ బొల్పు వహించినయాస్య మొప్పఁగా
నారమణీలలామఁ గన నయ్యె మనోహరలీలఁ జెంగటం
దారక లుల్లసిల్లుహిమధాముని తోఁ బరిదీప్యమాన మౌ
శారదరాత్రిపొల్పుఁ గొనఁ జాలి జనాక్షిచకోరపర్వమై. 159

శా. రాణిం బ్రోవుత దేవదేవుఁ డితసాంద్రప్రేమ నంచుంజనుల్
శ్రేణుల్ దీరిచి నిల్చి పల్కువిజయాశీర్వాదనాదంబు లుం
బాణుల్ దట్టురవంబు లొక్కమొగి నభ్రంబంటఁగా లేచి యా
యేణీలోచన వచ్చి రాజశకటం బెక్కెన్ శుభశ్రీకయై 160

ఉ. బీదల కందుఁ గోరినయభీష్టములన్ సమకూర్చి యామె స
మ్మోద మెలర్పఁ బౌరజనముల్ గొనియాడుచు మాటిమాటికిన్
సాదరదృష్టిఁ గ్రొత్తలయి యారయుచుండఁగ రాజలక్ష్మసం
భేదవిశేషవేద్యనిజవేశ్మముఁ జెందెను మందయానయై. 161

క. అనుగతసజ్జనముఖ్యుల
నసుపమసంప్రీతి ననిచి యంతిపురమునఁ
జని యాభూపతిరత్నము
జననిం గూడికొని మిగుల సంతస మందెన్. 162

ఉ. తండ్రులనాఁడు మున్ను తనతాతతరంబున నెల్లవారు నె
ట్లుం డిపు డంతకన్న సుఖయుక్తులఁ గా నొనరించె రాణి యొ
వ్వండు ను జౌర్యవృత్తిపయి వాంఛ వహింపరు దుష్ప్రవర్తనల్
గాంచదతనంబుఁ జేకొనరు కల్ల లనం గల లయ్యె నయ్యెడన్. 163

చ. మతినుతు లైనయప్డగలమంత్రులు శాసన మొండు దెచ్చి స
మ్మతి యొనరింపఁ గోరుచు సమాజమునం దిడ నయ్యెడం జన
ప్రతినిధిసంఘువాదులు నిరాకరణం బొనరింప వారలున్
వెతపడి యొక్క రొక్కరు గ వీడఁ దొలంగిరి మంత్రిభావముల్.

ఆ. మేటిమంత్రి యైనమేల్బోరను ప్రధాన
పదము విడువ నెదుటిపక్షమందు
ముఖ్యనాథుఁ డౌ చు మొనయుసర్ రాబర్టు
పీలుదొరకు నిడిరి ప్రెగడతనము. 165

ఉ. పారలమెంటులోన స్థితిపాలనకర్తలు వృద్ధికారు లం
చారయ రెండుపక్షముల నై తొలిరీతులు ద్రిప్పఁ గూడ దన్
కారణవాదులుం దగినకాలమునం దగుమార్పు లొప్పు న
న్వారలు నొంశొరుల్ బెరసి వాదము సేతురు రాచకర్జముల్.

క. అందు జనప్రతినిధిసభ
యం దధికము గాఁగ సంఖ్య నందనివారల్
పొందుదు రమాత్యపదమును
గ్రందుగ నుభయులకు వాదు గల్గుచు నుండున్. 167

క. అట్టయ్యు దేశసౌఖ్యము
గట్టిగఁ జేయఁ గఁ దలంపు గలవా రగుచున్
నెట్టుకొని వాద మాడెదు
పట్టున నేకీభవింత్రు పలుమరు వారల్. 168

క. ఈరీతి గ నధికారము
జేరినపక్షంబువారిచెలునలు తఱచై
గౌరవమునకై రాట్పరి
వారంబునఁ జేరు చుంద్రు వాడుకకలిమిన్. 169

సీ. తద్గతినుండ బ్రధానప్రధానత్వ
శాలిసర్ రాబర్టుపీలభిఖ్యుఁ
డప్పరివారంబు దప్పించి నూతన
పరివార మేర్పరుపం గ వలయు
నని యట్టికాంతల నవల ద్రోయుతలంపుఁ
గల్గి శ్రీరాజ్ఞికిఁ గమ్మ వ్రాసె
నందుల కద్దేవి యంగీకరింపమి
వా దామెతో మంత్రివరులు జేసి

ఆ. వితథయత్నులైరి వీరి త్రిప్పులఁ బడ
నంతవేల యశానె యధికధిషణ
ధిషణతుల్యయైన దేవి యనన్యసా
మాన్యగుణసమృద్ధిమాన్య గాదె. 170

వ. ఇత్తెఱంగునం బ్రవర్తించిన వృత్తాంతంబుం దనపురాతనసచివముఖ్యుండగు మెల్బోర్న్ ప్రభువున కామహారాజ్ఞీమణి యిట్లని లేఖపత్త్రంబు లిఖించి పుచ్చె. 171

చ. మతి చెడి వేగపాటున శమంబును దూరముఁ జేసి యిట్లు వ్రా
సితి నని యెంచఁ గా వలదు చెన్నుగ మామకమంత్రులెల్ల నా
హితపరివారముం దొలఁగ నెంచి రొకప్పుడు నాదు సేవక
ప్రతతినిఁ ద్రోయ నెంతు రని భావమునం బొడకట్టు చుండెడిన్.

క. సైరంధ్రు లాదిగాఁ గల
వారిం దొలఁగింప నెంత్రు బాలిక వలెన
న్నీరీతిగ నాడింపం
గోరిక యుదయించె నేమొకో వీరలకున్. 173

ఆ. వీరిమదికి నింతవీఁడి ననుచును
దోఁచు చుండె నేమొ తోఁచుఁ గాక
యేను వీరి కిప్పు డింగ్లండురాణి నన్
మాట నెఱుకపరతు నాటి యుండ. 174



ఆల్బర్ట్ ప్రభువును వరించిన విక్టోరియారాజ్ఞి. 109.

మ. అనుచుం జీటి లిఖించి పుచ్చి మదిలో నదేవి చింతించు ని
ట్లని దుర్వ్యాఖ్యము లైనయట్టిగురుకార్యంబుల్ తటస్థించుచో
ననురూపంబుగఁ జింత సేయుచు నుపాయం బిచ్చు సామర్థ్యముం
జనువుం గల్గినయొక్కమానిసి యవశ్యం బుండ నౌఁజెంగటన్. 175

ఉ. బుద్ధిబలంబు గల్గి యధిపుం గుఱి సేయక స్వామికార్యసం
సిద్ధి దలంపఁ బోక చెడఁ జేతురు కొందఱు కొంద ఱీశసం
పద్ధితకారు లయ్యు మతిమంతులు గామిఁ గ్రియావిధానపుం
బద్ధతిఁ దప్పఁ ద్రొక్కుచు విపద్దశ ముంతురు భూమిపాలకున్. 176

చ. ఉభయవిధంబు లేక తన కొవ్వనివాఁడు ను గాక పాణ్డిస
న్నిభుఁడయి రాచకార్యములు నిశ్చలయోగమునన్ రచించుచున్
విభునిసమృద్ధి యే తనదువృద్ధి యటంచుఁ దలంచునట్టివాఁ
డభిమతకార్యసిద్ధులకు నాకర మౌఁ గద తేని కెన్నఁగన్. 177

ఉ. ఇన్నిగుణంబుల న్మిగుల నెన్నికఁ గాంచి యు తేనిచెంగటం
బన్నిన భీతిఁ గార్యములపట్టున నొక్కి వచింపఁ జాలమిం
బన్నము గల్గఁ జింతిలకుఁ బొల్పడు చుందురు కొంద ఱక్కటా
తిన్ననికార్య మింతటికిఁ దెచ్చితి మంచును ఖిన్నచిత్తులై. 178

ఉ. కావునఁ బ్రాణబంధుఁడును గామితసిద్ధుల నెల్లఁ గూర్పఁ గా
దైవము మంత్రవేళలఁ బ్రధానుఁడు నాధి నడంచువెజ్జు మేల్
త్రోవల నెంచి చూపఁ గ గురుండు ను నిష్టసఖుండు నౌఁగదా
భావుకశీలయుక్తుఁ డగుభర్త యె కాంతల కెల్లభంగులన్. 179

గీ. అట్టిపతి యెల్లవిధముల కాథ్యుఁ డౌటఁ
గోరఁదగియుండె నాకు నిక్కన మటన్న
తలఁపు జనియించి రాజ్ఞికిఁ దద్వివాహ
యత్నమాంద్యము నొక్కింత యవల ద్రోసె. 180

మ. తలపుం దెల్పి యుఁ దెల్పనట్టిగతి న త్తన్వంగి తాఁజిన్నమా
తులుపేరన్ లిఖియించుపత్త్రికలయందున్ వేడ్క నాల్గర్థకా
శలవిద్యాద్యభివృద్ధి సేమమును బ్రస్తావించుచున్ మంత్రివ
ర్యులతోఁ గల్గినతొట్టుపాటున సహాయోత్కంఠ యున్ వ్రాసినన్.

క. తగుసమయం బిది యనుచున్
మగుడం దనయగ్రజునికుమారుల లండన్
నగరీమణికిం బుచ్చెన్
మగువలతలమిన్న మేనమామయునంతన్. 182

గీ. అదియుఁ దొమ్మిది మూఁడు నెన్మిది యు నొకటి
యేటఁ బదియవనెల నంత నాఁట జరిగెఁ
దొలుత వచ్చినకంటె నేఁ డలకుమారు
యౌవనము వత్సరత్రయ మధిక మయ్యె. 183

సీ. మరునితూణంబుల మాడ్కి నంగము లెల్ల
మిక్కిలి మెఱుఁగుతోఁ బిక్కటిల్లెఁ
గఱకుటమ్ము లతండు మెఱుఁగువెట్టెడుసాన
గతి భుజాంతర మతివితత మయ్యెఁ



22 ఏండ్ల యీడుగల విక్టోరియారాణి.    111.

జెక్కులచెంగటం జిక్కనిమెఱుం గెక్కి
గఱగఱమీసంబు కఱకు మీఱె
మోముదమ్మికి వింతగోము రెట్టించుచు
ఫాలతలంబు విశాల మయ్యెం
ఆ. గౌను సన్న మయ్యెం గన్గవ విరివి యయ్యె
నోష్ఠ మెఱ్ఱ నయ్యె నొడలు తెలుపు
మనసు మెత్త నయ్యె ఘన మయ్యె శక్తి యుం
దొంటియటం డటంచుం దోంచ దయ్యె. 184

ఆ. జన్మసిద్ధ మైనసౌందర్యమునకును
గనకగోళమునకు గంధము క్రియ
జవ్వనంబు మేలిసౌరు గల్గం గం జేసి
కలికిమిన్న కయ్యె నలవుమందు. 185

శా. ఆలావణ్యము వేఱ చెప్ప నిఁక నేలా ధీర యారాణికిన్
వాలాయంబు గం బంచవింశ మగునబ్దం బే వివాహక్రియా
కాలం బంచు నొనర్చినట్టియలదీక్షం బారం గాం ద్రోలెం ద
ద్వేలాతీతవిలాసవీక్షణసముద్వేల్లత్తానురాగోద్ధతుల్. 186

ఉ. ప్రాకటరూపయౌవనవి భాసురుం డైె గుణశూన్యుం డైనం గిం
పాకఫలంబుం బోలె మదిం బట్టు నెయవ్వరుం డక్కుమారికిన్
లోకవిలోకనీయ మగురూపును జవ్వనమున్ లసద్గుణా
స్తోకత గల్గి యుంట మదిం జొచ్చె రసాలఫలంబుకైవడిన్. 187

క. సహావర్తనసహభాషణ
సహావాససహాశనాది చర్యలఁ జెలికి
న్మహురుజ్జృంభితరాగము
పిహితముగా కాత్మ బులుపు బెట్టె న్మిగులన్. 188

చ. పదియవ తేదిదాఁక బలుపట్టును వీడక యుండె నామె యి
ర్వదియయి దేట నయ్యెద వివాహ మటన్న వ్రతంబు కాంతుఁడుం
బద మట నుంచు టాది గొని పల్చన యాచుఁ గ్రమక్రమంబునన్
మొదటికి వీడె నాల్గుదినముల్ గడపం బటుశక్తి నాపినన్. 189

ఉ. నిం డగుయవ్వనంబు గలనేర్పరు లొక్కడ నుందు రంటయా
ఖండలసంపదున్న తులఁగ్రాలుదు రంట స్వతంత్రు లంట కన్
పందువ యైనరూపు గలవా రఁట ధైర్యము కొల్ల సేతసుం
బండితుఁడైనమారుఁ డసమర్థుఁ డె దీక్షలు సాఁగ నిచ్చునే. 190

ఉ. ఉల్లము వెల్లడింతు నొకొ యూరక యుందు నొ యూర కుంటినా
యల్లరఁజేయు చుండెఁ గుసుమాస్త్రుఁడు తెల్లముఁ జేతు నేనియుం
బెల్లుగ నెల్లవారు నను బేల యనం గమకింతు రంచుఁ బె
న్మల్లడిఁ గొన్న చిత్తమున మానిని కొండొక సంశయించుచున్.

చ. అయిదవనాఁట నాత్మహృదయంబును దెల్లముఁ జేసి యామనో
దయితునియంతరంగ మమిత ప్రమదాంబుధి నోలలాడఁ బై
పయిఁ బుటముబ్బఁ జేసెఁ గలభాషిణి యాశుభవార్త యప్పురిన్
రయమున వ్యాప్త మయ్యె సలిలంబునఁ దైలకణంబుచాడ్పునన్.

గీ. అచటియాచార మఖిలజనాదృతంబు
వరుఁడు కన్నెను వరియించువరుసఁ గలుగ
దాని నయ్యెడ వ్యత్యయ మూనఁ జేసె
రాణి కాతనిపైఁ గలరాగపటిమ. 193

గీ. బంధువుల కెల్ల నట్టిసంబంధ మధిక
హర్షదంబు ను వరునికిఁ దర్షదంబు
నగుటఁ దత్త్రపాసూచకవ్యాపృతులను
బలికి రాతఁడు వారు ను బహువినయముగ. 194

క. శ్రీరాణియు బారన్స్టా
క్మారునకుం దనదుపిన్నమాతులునకు గం
భీరమృదుమధురభాషల
గారవమున సంతసంపుకమ్మలు వ్రాసెన్. 195

వ. అది యెట్లన్న నస్మత్ప్రియమిత్రుఁ డైనస్టాక్మారుగారికి నింగ్లండు రాణి యగు నలగ్జాండ్రినా విక్టోరియా వందన పూర్వకంబు గాఁ జేయు విజ్ఞాపన మే మన మన్మాతులసూనుం డగు నాల్బర్టునామకసుందరుండు నైజగుణంబుల మదీయమానసంబుం గట్టి స్వాయత్తంబు జేసికొనియె. నీశుభదినారంభంబున మాయిర్వురికి నన్యోన్య రాగద్యోతకంబుల గు దృఢనిశ్చయంబు లయ్యె. నాతండు న న్నమందానందవార్ధి నోల లాడించు నని గాఢం బగు నమ్మకం బొదవె నప్పగిది నాతనిం బ్రమదామృతప్రవాహంబున నీదించుట కింమక యుశక్తిపంచనఁ జేయుదానం గాను దీనికై మీచిత్తంబున సందేహంబు నొందవలదు. 196

ఉ. విన్నప మాచరించెదను వేడుకతోఁ బినమామ కిట్లు మీ
చిన్నికొమారుపై మనసుఁ జేర్చితి నేఁ డుదయంపువేళ నా
కున్నయభీష్ట మాతనికి నూకొనఁ జేసితి నాతఁడు న్ననుꣳ
మన్ననఁ జేసి మోదభరమగ్నమనస్కు నొనర్చె నియ్యెడꣳ. 197

చ. గుణపరిపూర్ణుఁ డౌట మదిఁ గోరిక యాతనిపైనిఁ గల్గె గా
గణుతి యొనర్పఁ గానలవి గానిసుఖంబుల నందఁ గల్గు నే
నణుతర మైన సందియము నందను నాదగుభాగ్య మెంత గాఁ
బ్రణుతి యొనర్చుదాన మదిఁ బట్టక యుండెఁ బ్రమోద మెంత యుꣳ

ఉ. ఆగుణధుర్యుపైని దృఢ మాచు మదాత్మను విస్తరిల్లునా
రాగము మాటలం దెలుప రా దిఁక లోకమునందుఁ గల్గుస
ద్భోగము లెల్ల నావశముఁ బొందె నటంచుఁ దలంతు వాని కిం
పౌగతి సంచరింతు నని హర్షముతోడఁ బ్రతిజ్ఞఁ జేసెదꣳ. 199

శా. నాకుం దోల్లిఁటికొంతకాల మది స్వప్నప్రియ మైతోఁచె సు
శ్లోకుం డాతఁడు నాకు నబ్బె నని యిచ్చో మానసం బెంత యుం
గా కుండెꣳ స్వవశంబు మోదమున నిక్కం బెద్ది యుꣳ వ్రాయఁగా
లే కుంటిꣳ వెడఁగింతి యంచు నను గేలిం బెట్టఁ గాఁ బోకుఁడీ. 200

గీ. ఇట్టిశుభలేఖ వాక్యము లెంచి చూడ
రాణి కాల్బర్టుపైఁ గలరాగపటిమ
యడుగక యు నుడుగక యు వ్యాఖ్యాత మయ్యె
నడఁగి యుండు నె పుడమి రాగాంకురంబు. 201

క. హృదయాలవాలమందు
న్మోదలం గప్పఁబడి యుబ్బి మొలకయి బయలై
పొదలుచు సాఁగం దొడఁగె
న్మదవతియనురాగవల్లి నాఁట న్నాఁటన్. 202

క. తనకు హితుం డగుస్టాక్మా
రునకున్ లిఖియించె నవ్వరుండు ను నా కీ
దినముఖమున విక్టోర్యా
వనితారత్నంబు తనదువలపుం దెలిపెన్. 203

ఉ. చూపె ననుగ్రహంబు వరసుందరి నాపయి నేఁటి కిందదు
ద్దీపితభూరిరాగమునఁ దేరితి నంచును సంభ్రమంబుచే
నీపని యిట్టు లయ్యె నని యించుక యైనను నమ్మ యుండఁ గా
నోపక యుంటిభీతి యొకో యుత్సుకభావ మొకట్టె నామదిన్ 204

క. చిత్తము సంభ్రమమున స్వా
యత్తము గా కుండె సమ్మదావేశం బే
నిత్తటి వ్రాయఁగ లే నని
తత్తరపడి సంగ్రహముగఁ దా లిఖియించెన్ 205

శా. అన్యోన్యోపనిబద్ధరక్తమతు లై యక్కాంత యక్కాంతుఁడున్
ధన్యాకారుల మైత్రి మంచుఁ దలఁపం దత్పాణియోగంబు రా
జన్యప్రక్రియఁ బార్లమెంటున సభాస్తారోరరీకారస
మ్మాన్యత్వంబును బొందఁ గొండొకవిలంబం బొందె న ట్లుండఁ గన్

మ. దరియం జేరఁగ రానివా రగుచు నుత్కంఠల్ జెలంగం బర
స్పరసంవీక్షణభాషణమ్ము లొదవన్ సంకల్పముల్ స్వాత్మలం
జొర లోలోన నడంచు చాయువవరుల్ జో కైరి వేఱ్వేఱఁ బం
జరబద్ధం బగుకీరయుగ్మమునకున్ సంభూతకామంబులన్. 207

చ. ఒకపనిఁ జేయ సాఁగి మఱి యొం డొనరించెద రొండుపల్కు నా
లుకను వచింపఁ గాఁ దలఁచి లోలత నొండు వచింతు రట్టులై
యొక రొకరిన్ హసించుటకు నొల్లక యుండిరి స్వానుభూతిచేఁ
బ్రకటము గాఁగ వారలు పరస్పరచేష్ట లెఱింగి యుంటచేన్.

క. జనవరి నెలలోన సభా
జనభాజనతావిశిష్ట సద్గుణులు సభా
జనవరులు కూడునంతకు
దినములువారలకు దీర్ఘదీర్ఘము లయ్యెన్. 209

సీ. ఆరామమును జొచ్చియారామ నెద మెచ్చి
నిశ్చేష్టితాంగుఁ డై నిలచి యుండు
నయ్యాళికేతెంచి యొయ్యారియూ పెంచి
పాదంబు ముందటఁ బడక నిలచు
గోష్ఠి సల్పుచు మధురోష్ఠి లో నిల్పుచు
సుక్తులు దోఁచమి నూర కుండు
బంతి మీటఁ గడంగి యింతిపై మది బొంగి
యంత చే సాఁగమి నాగు నతఁడు

గీ. చెంగటిఫలంబుమీఁదికిఁ జెంగలించు
గృహ్యాకము దృఢరజ్జుసంకృష్టిచేత
వాసయష్టినిఁ జెందెడువరుస నతని
మానసము ధైర్యమునఁ జెందు మఱలఁ బ్రకృతి. 210

సీ. కలము చేఁ బూని దస్కతుఁ జేయ కంతలోఁ
గార్య మాలోచించు కరణి నుండు
మంత్రులమనవికి మారుత్తరం బీక
యంగీకరించినయట్లు లుండు
పుస్తకంబును జేతఁ బూని పఠించుచు
నర్థ మారయురీతి నాగి యుండు
సఖులతోఁ బల్కుచుఁ జయ్యన సద్యుక్తు
లూహించుపోలిక నూర కుండు

గీ. నిటుల వేఱుగ నున్నట్టిహృదయ మన్యు
లెఱుఁగ కుండఁగ మాటుచు నిందువదన
చతురవృత్తినిఁ గాలంబుఁ జరుపు చుండె
మరుఁగు వెట్టఁగ లే దయ్యె మనసిజునకు. 211

క. ఇరువదియూఁ డైననవం
బరుదినమున స్వాభిమతము మంత్రులసభలోఁ
సరసగతిఁ దెలుపుతలఁపునఁ
దరుణీమణి యంతనాసదస్థలి కేగెన్. 212

ఉ. నాయెద పైని యాదృశసునాయకరంజిత మాచు నుండె నో
నాయెద లోనఁ దాదృశసునాయకరంజిత మాచు నుండె నం
చాయెలనాగ సిగ్గున నిరారపతత్ రచియించు చుండె నా
నాయువవర్యరూపున సమంచిత మాపతకంబుఁ దాలిచెత్. 213

క. నాహృదయేశ్వరుఁ డితఁ డను
నూహను మనుజులకుఁ దెలుపు చుండె ననంగాఁ
దాహృదయంబునఁ దాలిచె
నాహితుచిత్రమున నొప్పునందపుతాళిత్. 214

గీ. ప్రథమయౌవనమునను న్న భామ రాష్ట్రి
ముఖ్యులౌ మంత్రివర్యులమోసలకును
వచ్చి నిజపాణిపీడనవార్తఁ దెలుప
నెంతలజ్జవహించు నో యేల చెప్ప. 215

ఉ. తప్ప దవశ్యకార్య మని తద్దయుఁ గొంకుచు వచ్చె నేగతిం
జెప్పు నో యంచు వేడుక నశీతిజనోత్తము లందు నుండి యా
యొప్పులకుప్పపై నయన ముంచి కనుంగొని రట్టియుత్సవం
బెప్పుడు నెట్టివారలకు నెచ్చట నైనను జూడఁ గల్గునే. 216

క. అతివకు వినిశ్చయము గాఁ
బతిభూషణ మనెడుమాట ప్రకటము గఁ బతి
ప్రతిబింబాంకిత నాసతి
నతికుతుకము మీఱఁ గాంచి రచ్చటివారల్. 217

మ. పుడమిన్ మెల్లనఁ బాదవారిరుహముల్ మోపంగ నద్దేవి య
య్యెడకున్ వచ్చి మనోజలక్ష్మి యని వారీక్షించఁగా హస్తముల్
వడకం గాగిత మొందు విచ్చి సరగన్ వాక్రుచ్చె గంఠంబు మా
ర్పడఁ గాఁ గోకిలకాకలీకలకలాభంగారవప్రక్రియన్. 218

చ. ప్రకటనపత్త్రముం జదువఁ బాల్పడెఁ గాని సదస్యు లెవ్వరో
ప్రకటముగా నెఱుంగ రిట పల్కెడుపల్కులు దా నెఱుంగఁ జా
లక యె వచించె నైన వికలత్వ మొకింతయు లేక చక్కఁగా
సకలసభాసదుల్ వెఱఁగు సంతసముం గనఁ బల్కె నిట్లు గన్.

క. నామేనమామతనయుం
డైమహితగుణాఢ్యుఁ డైనయాల్బర్టునకున్
నామది ధ్రువముగ నొసఁగితి
ధీమహితుం డతఁడు తనమదిన్ నాకొసఁగెన్. 220

ఉ. ఈగతి సిగ్గునన్ శిరము నించుక వంచుచుఁ దన్మిషంబునన్
రాగ మెలర్ప హారగతనాయకరూపము జక్కఁ జూచుచున్
వేగ మె యాసభాజనులు విస్మయ మంద వచించి మెల్లఁగా
నేగుచు నుండ మంత్రి యొకఁ డిట్లనెఁ జెంగట నిల్చి నమ్రతన్.

శా. రాజ్ఞీరత్నము యీసుపత్త్రిక మనోరమ్యస్థితిన్ సర్వలో
కజ్ఞాతం బగునట్లు గాఁ బ్రకటనం గావింప నౌఁ గాన న
ట్లాజ్ఞం గోరుచు నుంటి నన్న వినయవ్యానమ్ర యై యప్పుడా
ప్రజ్ఞాశాలిని తత్కరంబున నిడెం బత్త్రింబు నిర్వాక్య యై. 222

క. ఆకరణిని సచివునకుఁ గ్రి
యాకేవలముత్తర మ్మటం చొసఁగి గురు
శ్రీక మగుగృహమునకుఁ జని
యాకె దలంచెం గృతార్థ నైతి నటంచున్. 223

చ. అనిభృతసద్గుణప్రచుర యారమణీమణి యీసమస్తముం
దనదినచర్యపుస్తకమునన్ లిఖియించె నయారె యాద్య యా
వనమున బాలికల్ సభకు వచ్చి స్వకీయవివాహవార్త వా
కొనుట విచిత్రము న్ముదముఁ గూర్చ దె చూచెదువారి కయ్యెడన్.

క. నాపతకమునం గలప్రియ
రూప మె నా కిట్టిశక్తి రూఢిగ నిడెఁగా
కీపగిది నే వచింపఁగ
నోపుదు నే యనుచు నామె యూహించె మదిన్. 225

ఉ. ఈక్రియ నెల్లవారలకు నీప్సితముం బ్రకటించి యంత నా
వక్రకచావతంసము వివాహమహోహముమధ్యగామ్యహ
శ్చక్రము నెల్ల నొక్కమొగిఁ జయ్యనఁ ద్రిప్పి సమీపగామి యా
ప్రక్రియ నాకుఁ జేకురునుపాయము గల్గు నె యంచుఁ జింతిలన్.

చ. వరునకుఁ గల్గె నప్పురికి వచ్చెడుతొందర దాని మించుతొం
దర సతితోడఁ బల్కుతటి దానిని మీఱినవేగపాటు నిన్
బరిణయ మాదు నంచుఁ జెలి వల్కఁగ దానిని మించి యుండె నె
ల్లరకును నేడు స్పష్టపడ లక్షగుణంబగువేగపా టొగిన్. 227

చ. గడియలు లెక్కఁ జూచుచుఁ జిటుకాంతయుఁ గాంతుఁడు జెంతనుండి యుం
బడయగ రానికాము వెతపా లయి యుండిరి యుక్త మిట్లు పేర్మి
ముడి గద యుత్తరోత్తరసముత్సుకతం గనరానికోర్కులన్
వెడఁగులఁ జేయు నెంతటి గభీరమనస్కుల నైన లోలతన్. 228

## ఆశ్వాసాంతము.

క. భద్రాధిరాజవాహన
భద్రాయితసుగుణజాలపాలనపర శం
భద్రావణపాటపశం
భద్రామాప్రీతికరణ పటుతరలీలా. 229

మాలిని. ప్రకృతిపురుషయోగాపాదికాంతార్థరూపా
ప్రకృతినిరమణాంచత్పౌరుషైక్యస్వరూపా
ప్రకటవిమలభక్తప్రాప్యమాణాష్టరూపా
సకలమునిజనాత్మాసాద్యచిన్మాత్రరూపా. 230

## గద్యము.

ఇది శ్రీమన్మంత్రిప్రెగడ వంశపయఃపారావార రాకాసుధాకరరాజ
బిరుదాంకిత భుజంగరా యామాత్యపౌత్త్రి హారితస గోత్ర పవిత్ర
దుర్గామల్లికార్జునప్రసాదరాయనరపుత్త్రిశ్రీమార్కండేయవర
ప్రసాదజనిత సరసాష్టావధానాది విచిత్ర కవితాధౌరేయ
బుధజనవిధేయ భుజంగరాయనామధేయ
ప్రణీతం బయినవసంతకుసుమ మను
మహా ప్రబంధంబునందు
ద్వితీయాశ్వాసము.
శ్రీ. శ్రీ. శ్రీ.

శ్రీరస్తు.

శ్రీమార్కండేయస్వామినేనమః.

# వసంతకుసుమము.

## తృతీయాశ్వాసము.



కర కరభూషణద
ర్వీకరనిధ్యానసంవివిగ్న గిరిసుతా
చైకురబంధవిభీతపృ
థాకువరాలోకజాతదరహాసముఖా. 1

గీ. అవధరింపుము వారలన్యోన్యరాగ
బద్ధచేతస్కులై యుండఁ బార్లమెంటు
సభికు లూరీకరించిరి జనవరియును
జరిగె నవ్వలికిం బిబ్రవరి యు వచ్చె. 2

క. నవహాయవర్షంబునఁ బి
బ్రవరిక్ బదియవదినంబు భాగ్యంబే మో
నవనవరీతిం బురమా
నవు లాదృతి నెదిరి కన్గొనక్ సాఁగి రహా. 3

ఉ. ఎక్కడఁ జూచినం బుడమి యీనినకైవడి నప్పురంబునం
గ్రిక్కిరియన్ ధనాధిపు లకించనులుం బ్రతిపత్తితుల్యతన్
లెక్క యొనర్పఁ గావశము లేక చరింపఁ గఁ జిత్రచిత్రముల్
జెక్కినయంద మాపటము చెన్ను వహించెను భూమి యయ్యెడన్.

మ. పౌరు గి ల్లేగుతలంపునం దనదుగేముల్ వెల్వడం గార్యపుం
ద్వరచేఁ జయ్యన నేసుచో నిజగృహద్వారాంగణం బాదిగా
ధరణిం బాదము వెట్టఁగాఁ దెరపిఁ జెందన్ లేక యన్నాగరుల్
పరగం బోయెద రెట్టకేని జనసంబాధంబునం దూలుచున్. 5

మ. జిలు గౌత్రాఁతపనిం బసం దనరు మేల్ జీబు ల్విచిత్రంపువ
న్నెల నిం పౌరచనావిశేషముల నాణెం బొప్పఁ గాఁ దాల్చి మైఁ
బలుచందమ్ములసొమ్ములం దొడగి చెప్పం జాల కున్నట్టి యు
త్కలికం గాంచిరి పౌరు లెల్ల రమణీకల్యాణకాలంబునన్. 6

చ. పుడమిపయిన్ గృహంబులను బువ్వుల చేరులఁ బూలబంతులం
గడు నలరించి యవ్వరుసగా గగనాంగణసీమ నెంతయున్
సిడములబారు లెత్తి కయిసేసిరి పౌరజనంబు లప్పు డ
ప్పుడఁతుకపెండ్లి భూచరనభశ్చరతుష్టిద మంచుఁ దెల్పుచున్. 7

క. అతరివీటికిఁ గలకై
సేత నవర్ణింప నేల చిహ్నం బగు రా
శ్కేతనము సెప్పె నన్యని
కేతనములఁ గలియురాజ గృహవర్యంబున్. 8

మ. అప్పు డాపెండిలికూతుగాదిలినయస్యల్ సంతసం బొప్పఁగాఁ
దపనీయాంచితపీఠమం దునిచి పద్మాభామినిన్ దేవతా
చపలాక్షీమణు లబ్జపీఠి నుపవిష్టం జేసి కై సేయున
ట్టిపసం జేరి యలంకరించి శెలమిన్ డెందంబు లుప్పొంగఁ గన్. 9

ఉ. చిక్కనితావినూనియలఁ జేర్చుటఁ దళ్కులు గ్రుమ్మరించఁ గాఁ
జక్కనిసోగపెన్నెరులసోరు బయల్పడ దంతకంకతిం
జెక్కి యనేకమాల్యములఁ జిత్రితశిల్పవిశేషచాతురిన్
వెక్కస మాసిరుల్ నెరపువేణి యొనర్చె నొకర్తు బాలకున్. 10

చ. అతులితరీతిఁ గాంతిచయ మంగము సర్వము నావరించి య
ద్భుతరుచి నింపఁ గాఁ గడలఁ దూలుచుఁ మంజుమరీచిపుంజముల్
వితతలతాంత గుచ్ఛములు వేడుకఁ జిమ్మెడుపోల్కెఁ దోఁపఁగా
రతనపుహార మొక్కచెలి రాజ్ఞిగళంబునఁ గూర్చెఁ బొంగుచున్. 11

క. స్వర్ణమయంబు ను మణిగణ
పూర్ణంబు ను నైనవరవిభూషణయుగముం
గర్ణంబులఁ దాలిచి సము
దీర్ణప్రభతోడ నపుడు దేవి యొసంగెన్. 12

క. సరిగాఁ బదివే ల్వెల గల
సరిగం దనరారునట్టి చక్కనిమొకమాల్
సిరిమించువల్వఁ గై సే
సిరి చెల్వలు చెల్వచెల్వ జృంభించంగన్.

ఉ. మేలిపసిండిదువ్వలువ మేను సమస్తముఁ గ్రమ్మనయ్యెడన్
మేలిముసుం గిడన్ నడుమ మించెడుభామినివక్త్రి మంబురు
హాళిపరీత మాసరసిఁ దోఁచెడుతమ్మి యుఁ బోలె నొప్పెఁ ద
చ్చేలము పేర మంగళవిశేషిత మాసిరి యానరించె నాన్. 14

గీ. ఇట్లు మంగళనైపథ్య మింతి దాల్చి
యల్లయాల్బర్టుపూర్వ సమార్జితోరు
పుణ్యదేవత యో లేకపువ్వువిల్తు
మోహలక్ష్మి యొ యనఁ జాల మురువుఁ జూపె. 15

ఉ. పెండిలి గాక మున్న తనపృథ్వి వసించెడువారిలోన నొ
క్కండయి యుండి రాణియధికారములోఁ బడఁ నట్టివాఁడు గా
నుండుట కాలుబర్టువిభుఁ డొప్పి ప్రతిజ్ఞ యొనర్చి సర్వభూ
మండలభర్త్రిభతన్ యనుమాన్యతకన్నను భాగ్య ముండునే. 16

సీ. బాలసూర్యుఁడు సర్వభువనంబులకు లేఁత
చేతులఁ జేవురుపూత వెట్టెఁ
బద్మిని యచ్చటిప్రజలమోములతోడఁ
జక్కఁగాఁ బటువికాసంబుఁ గాంచె
నెల్లచోఁ జీఁకటినల్లవల్వలుఁ ద్రోచి
తెలివల్వలనుఁ బూనెఁ దెసలు మఱియు
నిదురమబ్బుదొలంగి నిఖిలజంతువులును
జకచకఁ గార్యదక్షత వహించె

గీ. నట్లు కళ్యాణగరిమచే నలరుకల్య
సమయమున నెల్లవారలుఁ దమకుఁ దగిన
తోడవుల ను వేడ్క మీఱంగఁ దొడఁగి చనిరి
మున్నుమున్నుగ దేవళమునకు నంత. 17

గీ. అవ్వధూవరులను దేవతాలయమున
కపుడు గురువులు బంధువు లహితజనులు
నాదరంబునఁ గొని చని యనువు మీఱు
పీఠములఁ గూరుచుండంగఁ బెట్టి రెలమి. 18

గీ. ఏమిచిత్రమొ కోవెల కెల్లవారు
జరుగునంతట దానివైశాల్య మపుడు
వారిసమ్మర్ద మోర్వఁ గ వశముగాక
తాను నెచ్చటి కేనియుఁ దరలఁ బోలు. 19

చ. వరునకు సర్వభంగులను వారక లోఁబడి యుందు నంచు న
ప్పరిణయవేళలన్ వధువుఁ బల్కుట యుక్తవిధాన మయ్యున
క్కరణి వచింపఁ జేయుటకుఁ గా నతిసంశయలోలవృత్తు లై
గురువరు లొండొరుల్ గొణుగుకొంచు వితర్క మొనర్చి రల్లనన్.

ఉ. అక్కట యెల్లవారిఁ దనయాజ్ఞకు లోఁబడఁ జేయురాణి తా
మక్కసితోఁ నిజప్రకృతిమండలమానవసంనివిష్టుఁ డౌ
నొక్కనియాజ్ఞలో మెలఁగు చుందునటంచు వచించు మన్నచో
నెక్కరణి న్వచించు నిది యెట్లు పొసంగు నటంచు నేర్పునన్. 21

ఉ. ఆమెసమీపదేశమున కల్లన నేఁగి గురుండు వల్కె నో
స్వామిని యిందు భర్తకు వశంవద నన్పలుకుం ద్యజింపఁగా
నీమది కిష్ట మే యనిన నిశ్చలవృత్తి వచించె నెల్లచో
భామల కెట్టు లట్లుగ వివాహవిధుల్ నడుపం దగుం జూఁడీ. 22

గీ. తంతులో నించుక యు వీడఁ దగదు రాజ
ధర్మమం దట్లు లుండఁగ దారధర్మ
మందుఁ దక్కటిచానలయట్లు నేను
భర్తృవశగామినిని నౌట పాడి గా దె. 23

మ. అనినన్ సర్వజనంబు లప్పలుకులన్ హర్షావృతస్వాంతు లై
విని తన్మార్దవశాంతిధర్మరతుల న్వేమారు గొండాడఁ ద
జ్జనకభ్రాత గుణౌఘసంవిదితుఁ డౌసస్సెక్సునామాంకితుం
డనివార్యప్రమదంబునం బొదలి కన్యాదానముం జేసె న
వ్వనితారత్నము నాలుబ ర్టమితలాభం బంచు లో నెంచఁగన్. 24

ఉ. వీరలకుం బరస్పరము వేడుక నీశ్వరుఁ డిచ్చు నన్నయా
శీరవముల్ జయధ్వనులు చె న్నగుమంగళతూర్యరావముల్
సారగుణాఢ్యు లిద్దఱికి జక్కనియోగము గల్గె నంచుఁ గై
వారము సేయుమానవులవాఙ్నినదంబులు గ్రమ్మె నెల్లెడన్. 25

మ. గురువర్యుం డొకఁ డప్డు లేచి యనె విక్టోర్యాసతీ కోర్కెచేఁ
బరిణీతుం డయినట్టిభర్త గద యాల్బ ర్టీతనిం గూడి యీ
శ్వరసందిష్టవివాహయోగమునకున్ సంమోదముం జెందుచుం
దిర మౌచిత్తముతోడ నుండెదవు గా దే రాగ మొప్పారఁ గన్. 26

గీ. ఎల్లభంగుల లోఁ బడి యిష్టవృత్తి
గౌరవంబును బ్రేమ యుఁ గల్గి సేవఁ
జేయు చారోగ్యమున నున్న జీర్ణుఁ డైన
వ్యాధి గల్గిన నొకరీతి నరయ వలయు. 27

క. మేలుగ మీ రిర్వురుఁ గల
కాలమునం దన్య మెల్లఁ గడ కొత్తి రహిం
దాలిమి నాత్మార్పణసం
శీలత నుండెద వె యనినఁ జెచ్చెర సతి యుఁన్.  28

శా. ఆవైవాహికగేహమందుఁ గలవా రాసక్తిసంయుక్తులై
భావంబుల్ గఱఁగింపఁ జాలునిజసద్వాక్యంబులన్ పీనులం
ద్రావం బల్కె ధ్రువంబు గా నివు డె యాత్మన్ భర్త కర్పించితిన్
దైవం బీతఁ డె నాక టంచు మృదుకంఠస్వాన మొప్పారఁ గన్.

చ. తనమది దీర్ఘలోచనపథంబున నెల్లరుఁ జూచుచుండ నా
తనికి నొసంగె నో యనఁ గ బామరసాయతనేత్ర ప్రేయసుం
గనుఁగొనె శీర్ష మెత్తి యతికౌతుకు లై జను లెల్ల నీసతీ
జనతిలకంబువాక్యములు సత్యము లంచును విశ్వసింపఁ గన్. 30

క. విధివిహితంబు గఁ బరిణయ
విధినడుపఁ గ నవ్వివాహవేది విడచి య
వ్వధువు వరుఁ డిష్టబంధుల
బుధులం బ్రణమిల్లి గురువిబోధితు లగుచున్. 31



శ్రీ విక్టోరియా రాణి, ఆల్బర్టు ప్రభువు. 129.

ఉ. స్యందనవర్యముల్ నృపతిసంఘము లప్పురివారుఁ గూడి యా
నందమునం గనుంగొన ననంతవిలాసముతోడ వారిద
స్పందతురంగముల్ శచియుఁ బాకవిరోధియుఁ బోలె నెక్కి రా
ణ్మందిర మేగు దెంచుతటి మార్గము గ్రిక్కిరిసెం బురంబునన్. 32

వ. అయ్యెడ నప్పౌరు లెల్ల నొక్కుమ్మడిం దమనయనోత్పలంబుల వ
ధూవరులపయిం జల్లుచుం దదేకాయత్తంబు లైనచిత్తంబులు మరలిం
చం జాలక యల్లనల్లనం జరుగునాశకటంబు దూరం బగుచుండం జిం
తాకులితు లగుచు నొండొరులుం దమలో ని ట్లనిరి. 33

సీ. పూవుతోఁ గూడినతావి చందంబున
దీపంబుతోఁ గూడుదీప్తి పోల్కె
ఫలమునుఁ జెందినపటురుచి కైవడి
మేఘుంబు నంటినమెఱుపుఁ బోలె
బంగరులో నున్నపసిమి చాడ్పున మేలి
దర్పణంబున నొప్పుతళ్కు రీతి
మలయమారుతమునఁ గలచల్వ తెఱఁగున
నవనీజమున నొప్పుచివురు వలెను

గీ. ఈసరోజాక్షి యీతని నెనసి యుండె
రాజ్యలక్ష్మివిభూషిత రాణి తనకుఁ
దా వరించినవలపులదేవి యయ్యె
నితనిసుకృతవిశేషంబు నేమి చెప్ప. 34

క. తా నెల్లభూతలంబును
బూనినభూనాథ యయ్యెఁ బోలఁతి యు నితనిక్
వైనయికవృత్తి నాథునిఁ
గా నొంది నిజార్పణంబుఁ గావించె నహో. 35

ఉ. చక్కనిచాన గోరుదురు చాన లటంచు వచింతు రట్టు గా
నిక్కడఁ గల్గె రాజ్యరమ యీలలనామణిఁ జెందె నీమె యుక్
మక్కువ నాలుబర్ట్ట నతిమాన్యతఁ దా వరియించెఁ గావునం
జక్కనివారిలో నితఁడు చక్కనివాఁ డని చెప్పఁ గాఁ దగుక్. 36

గీ. ఇట్లు మూఁగినజనులచే నిరకటంబు
గాఁగ శకటంబు మెల్లనఁ గదలఁ గ్రోశ
దశకమాత్రప్రమాణ మాదారిఁ గడచి
రాణివాసంబుఁజెంది రారాచవారు. 37

వ. తదనంతరం బామాసంబున నష్టావింశ దినంబున రాజ్ఞీశ్వశురుం డైన కోబర్గ్ప్రభుండు తనపుత్త్రిద్వయంబు లండనుపురంబున నునిచి తత్రత్యబంధు మిత్రాదులం దగురీతి నామంత్రించి నిజప్రదేశంబునకుం జనినం బిత్రుదూరంబునకుం గన్నీ రొలుకం జింతించునాల్బర్ట్ట నమ్మహారాజ్ఞీమణి యోదార్ప నామె కాతం డి ట్లనియె. 38

చ. జనకుని నీ వెఱుంగమిని సాంద్రతర మ్మగుతద్వియోగసం
జనితమహాభరం బెఱుఁగఁ జాలవు నా కటు లౌ నె దేవి యీ
జననము గాఁ గ బంధుజనసంఘము వీడక యుండి యుండి గొ
బ్బున విడి యుండ నామదికిఁ బుట్టక యుండు నె తాప మెన్నెయిక్.

శా. సంతోషంబునఁ బుచ్చితిం దొలిదశన్ స్వైరస్థితిన్ నాకు నే
డెంతే ప్రేమము గల్గుమానవులయం దెవ్వేష్టు దక్కెంగ న
త్యంతం బెల్లరు దూర మైరి గద నాయం దుండునీప్రీతి నో
కాంతా యీగతి నుంతు వేని మరతుం గా దే మదీయాప్తులన్. 40

మ. అనినం దేవి యుఁ జింత సేసె మది నాకై మత్ప్రియుం డక్కటా
జననిం దండ్రిని సోదరాదుల స్వదేశంబున్ విడెం గాన నీ
తనికై జాలి జనించె నాకు నిపు డాత్మన్ దేవుఁ డెల్లప్పుడున్
నను నేతత్ప్రియసమ్యగాచరణచింతన్ ధన్య గాఁ జేయుతన్. 41

ఉ. శక్తికొలంది నాప్రియుని సౌఖ్యము లోపము జెంద కుండ నా
సక్తి వహింతు నంచు దినచర్య లిఖించి సతీలలామ మ
య్యుక్తికి న్యత్యయం బొదవ కుండఁగ నాత్మసుఖంబు నెంచ కే
భక్తిని యత్నమున్ సలిపె భర్తృసుఖంబునకై త్రిశుద్ధి గన్. 42

ఉ. ఏలిక నైనయట్టితన కెట్టటు గౌరవ మాత్మభర్తకున్
మేలు గఁ గల్గ నేర్పరచె మించినరాగము తోడ వార లీ
లీల మనోవిభేదములు లేక మిథఃప్రణయప్రచారముల్
దూలక నాఁడునాఁటగురితోఁ గన గూడిరి సమ్మదస్థితిన్. 43

సీ. ఆరాణి రథమున నరుగు చుండె ననంగ
భర్తతో ననుమాటఁ బలుక నేల
యామె యింపుగ నాట లాడు చుండె ననంగ
నాల్బట్టతోఁ గూడ ననఁగ నేల

శ్రీరాజ్ఞి గానంబు సేయు చుండె ననంగ
ధవునితో నంచు నుడుసం గ నేల
రమణి చిత్రపటంబు వ్రాయు చుండె ననంగ
దయితుతో ననుమాటం దడవ నేల

గీ. యామె చదువం గ నాతండు నతండు జదువ
నామె విను చుండు నిట్టు లన్యోన్యబద్ధ
రాగు లై యుండి యును నామె రాజ్యవిధుల
మేలుకాంచుచు మిక్కిలి మేలుం గాంచె. 44

క. రాజ్యక్రియాకలాపముం
బ్రాజ్యంబు గ నెల్లయెడల రాణికిం దోండై
పూజ్యుం డాతం డొనర్చె స
మజ్యాజన మెల్లం బొగడ మంత్రి యుం బోలెన్. 45

మ. ప్రకృతిక్షేమవిధానకృత్యము లెదం బాటించుచున్ స్వీయకా
ర్యకలాపాదృతి లేనివాం డగుటచే నాల్బర్టుపై నెల్లవా
రికిం బాణిగ్రహావేళకం టె నటుపైం బ్రేమాతి భారంబు న
మ్మిక యుం బెంపును గల్గె నట్లగుం గదా మేలౌగుణం బున్నచోన్.

గీ. స్వాధికారానుగుణము గా నాత్మధవుని
కఖిలరాష్ట్రస్థమనుజులకన్న మిగుల
గౌరవం బాదరంబు ను గలుగు చుండ
రాణి నియమించెం జేసిరి ప్రజలు నట్లు. 47



సెయింటుజేమ్సు ఆలయములో రాణిగారు, ఆల్బర్టుప్రభువు వివాహ మహోత్సవము. 10 ఫిబ్రవరి 1840. 132.

క. ఆయేటికిఁ దొమ్మిదవనెల
నాయాల్బర్టువిభుఁ డంతరంగసభికుఁడుం
జేయఁ బడి రాచకార్యము
లాయాతఁడి నడపు చుండు నతిదక్షుం డై. 48

క. రాణి యుఁ బ్రియుఁడును నీగతిఁ
బ్రాణం బొక్కటి గ నధికరక్తత నుండన్
బ్రాణపతి యయ్యె నంతట
నేణాయతనేత్ర యాతఁ డెద సంతసిలన్. 49

ఉ. ఆలును భర్తయున్ వనవిహారకుతూహల ముప్పతిల్లఁ గా
నాలుగురథ్యముల్ గలఘనంబగుస్యందన మెక్కి సద్భటుల్
నాలుగుదిక్కులం గొలువ నాల్గవమాసపుగర్భవేళ భూ
పాలకగేహమున్ వెడలి పశ్చిమదిక్కునఁ బ్రొద్దు వ్రాలఁ గన్. 50

చ. ఒకగిరిచెంత నేగుతఱి నొక్కరుఁ డచ్ఛపలాక్షిపైనిఁ ద
ప్పక గుఱి నేసి బిట్టుగు తుపాకినిఁ గాల్పఁ గ నాలకించి య
మ్మకురనిభాస్య లేచి తనమోము మఱుఁ ద్రిప్పి కనుంగొనం గ నా
యకుఁడును గొబ్బునం దిగిచి యారమణిం దనచెంతఁ జేర్చెన్. 51

గీ. అంత మానక మరలఁ గ నాదురాత్ముఁ
డాకెఁ గుఱిఁ జేసి వేఱుతుపాకిఁ గాల్చె
నది యు దైవానుకూలత ననలఁ దప్పెఁ
బట్టి రంతట నారాజభటులు వాని 52

శా. పొక్కం దల్లి కఠోరవార్తవిని మమ్ముం గూర్చి నిక్కం బటం
చక్కాంతామణి భర్తతోడ న తదీయాగారముం జెంది త
న్నక్కుంజేరిచి యామె సంతసిల నుద్యానంపుత్రోవన్ రహిన్
బక్కింఘా మనురాజగేహవరముం బ్రాపించె నత్తైరునన్. 53

క. కల రే యంతటిధీరలు
వెలవెలఁబారుట యె తక్క వెరువదు సతియా
కులత న్మరునాఁ డైనం
జలఁకుచు రథయాత్ర విడువఁ దలఁ పూన దహో. 54

శా. ఆవార్తల్ బురి నెల్లచో నొకమొగిన్ వ్యాపింపఁ బౌరుల్ జయా
రావం బొప్పఁగ రాజదంపతులదుర్వారంబు గాఁ గ్రమ్మి తం
త్రీవార్తల్ ముఖవార్తఁ బత్త్రికలుఁ బృథ్వీపాలవిశ్వాసు లై
వేవే లంపిరి మిత్రబాంధవులకున్ వేగంబు గా హృష్టు లై 55

వ. అంత నెడ్వర్డాక్సుఫోర్డనం బరగు నానృశంసుం డపరాధవిమర్శం
బున నిర్భీకుఁ డై రాజ్ఞిపై నగ్నియంత్రప్రయోగంబు మత్కృతంబ
ని యు నిట్టి క్రూరకృత్యంబునలనం బ్రసిద్ధిఁ గాంచం గోరి యుద్య
మించితి నని యు వేఱుకారణంబు లే దని యు. వక్కాణించి కా
రాగారనిబద్ధుం డై ముప్పదివర్షంబు లుండి తద్దేశ నిస్సారితుం డై
యాస్ట్రేలియా ద్వీపంబునం జిత్రకారవృత్తిచే బహుకాలంబుం బు
చ్చె నిక్కడ. 56

చ. అలయికి దోఁచె మేన రుచిరార్ధము లిష్టము లౌట దప్పె వె
న్నెలదొరఁ బోలు మోమునకు నిండగు వెన్నెలతేట మించ మైఁ
బలుచదనంబు గల్గె జనపాలన భారము గాఁగఁ దోఁచె ని
చ్చలు శయనించి యుండఁ టరెయె సౌఖ్యముగా మదిఁదోఁచెనింతికిన్.

సీ. అతితుంగరాజ్యపీఠాధిరోహిణి యయ్యు
సతి యింతయరు గెక్కఁ జాల దయ్యె
నఖిలభూభారంబు నవలీలఁ దాల్చియుఁ
దొడవులు దాల్పఁగ బడలు చుండె
రాజకార్యము లెల్ల నోజ సల్పెడు రాణి
పరికర్మరచనకుఁ బ్రాలుమాలె
నరిరాష్ట్రములు గొనఁ బరువెత్తు నద్దేవి
యవనిపై నడు గిడ నలయు చుండె

గీ. నెంతఘనకార్యమును నిర్వహించి పలుకు
రమణి చెలులకుఁ దగు నుత్తరం బొసంగ
నోప దయ్యెను గురుగర్భయోగమునను
బాటవము లేక యున్న య ప్పడఁతిమిన్న. 58

చ. అతివలమిన్న రాజ్యభరణాక్షమతం గొనఁ దత్పితృవ్యుల
ప్రతిహతశక్తు లుండినను బాటి యొనర్పక యామె ప్రేయసుం
బ్రతినిధి గా నొనర్చి రఁట రాజ్యముసేయఁ గఁ బార్లమెంటువా
రతనిగుణంబు లింకఁ గొనియాడఁగ నేటికి వేయిభంగులన్. 59

క. పదిరెనిమిదిశతములనలు
నదియనవర్షమ్మునన్ ననంబరునెల ని
ర్వదియొకటనదినమున న
మ్మదితకు జనియించెఁ బ్రథమపుత్త్రిక యంతన్. 60

క. ఆ నందన జనియించుట
నానందం బంత యింత యనరాక మదిన్
మేనుల నుప్పొంగించుచు
లోనణఁగక వారి నతివిలోలులఁ జేసెన్. 61

వ. తదనంతరం బా యేకచత్వారింశవర్షంబున ఫిబ్రవరిం బదియవనాఁడు తమ పాణిగ్రహణోత్సవదినం బానర్తించుటం జేసి యా దంపతు లా ప్రథమాపత్యంబునకు విక్టోరియా యెడిలెయిడు మేరీలూయిసా యను నామంబు తత్తన్నామ సంస్కారంబున నొనరించి రిట్లానందంబున నాదినంబు గడచిన మరునాఁడు. 62

క. ప్రమదారామంబునకుం
బ్రమదయు భృత్యులును వెంట రాఁ జని విభుఁడుం
గమలాకరంబు పై నొక
హిమఘనమున లీల యొప్ప నేగుచు నుండన్. 63

ఉ. అంతటిలోఁ దటాలున హిమానరణంబు విభగ్నమై తటా
కాంతరగాధతోయమున నాతఁడు గూలఁగ సేవకుల్ నిజ
స్వాంతములందుఁ దొట్రిల నుపాయము దత్సమయోచితంబు గాఁ
జింత యొనర్చి రాణి దరిఁజేరిచె నవ్విభు వేగపాటునన్. 64



బక్కింగుహాముసౌధమున విక్టోరియారాణిగారి ప్రథమపుత్త్రికానామకరణ మహోత్సవము. ఫిబ్ర. 10-1841. 136.

ఆ. ఆమె యించుకంత యాలసింపక వచ్చి
విభుని మిత్తినోట వెలువరించె
నాయు వెన్ని యెన్ని యాపదలను గాని
యవలఁ ద్రోయుఁ గాదె యబ్బురముగ. 65

ఉ. దాదులు తల్లి యు న్నిగులఁ దత్పరతం దను వీడకుండి స
మ్మోదము మీఱఁ దెల్ల నగుపొత్తులపై శయనింపఁ జేసి దు
గ్ధాదు లొసంగుపట్ల సమయంబును దప్పక జాగరూక లై
యేదఁగ నాఁడునాఁట మది కింపు లొసంగెను బాల చూడ్కికిన్.

క. అల్లారుముద్దు సేయుచుఁ
దల్లియుఁ దండ్రియును సముచితప్రియకృతులన్
వల్లిని వనపాలుర వలె
నుల్లాసము మీఱఁ బెనుచు చుండిరి బాలన్. 67

ఆ. రాణి పిన్ననాఁడు రమ్యవస్తువు లెవ్వి
యాట లాడుకొనఁ గ ననువుపడియె
వానితోడ నిపుడు బాలికామణి యును
నాడుచుండి తల్లి ననుకరించె. 68

ఉ. భూపరిపాలనోద్యమముఁ బూని యు రాణి దినంబు దప్ప కా
పాపకు బుద్ధులం గరపి పాఠములం దగ బోధ సేయుచు
ద్దీపితసద్గుణంబులను దేజరిలం గ నొనర్చెఁ దల్లి వి
ద్యాపరిపూర్ణన్ నిర్మల పథంబున బిడ్డలఁ బుచ్చు టబ్రమే. 69



బక్కింగుహాముసౌధమున విక్టోరియారాణిగారి ప్రథమపుత్త్రికానామకరణ మహోత్సవము. ఫిబ్ర. 10-1841. 136.

ఆ. ఆమె యించుకంత యాలసింపక వచ్చి
విభుని మిత్తినోట వెలువరించె
నాయు వెన్ని యెన్ని యాపదలను గాని
యవలఁ ద్రోయుఁ గాదె యబ్బురముగ. 65

ఉ. దాదులు తల్లి యు న్మిగులఁ దత్పరతం దను వీడకుండి స
మ్మోదము మీఱఁ దెల్ల నగుపొత్తులపై శయనింపఁ జేసి దు
గ్ధాదు లొసంగుపట్ల సమయంబును దప్పక జాగరూక లై
యేదఁగ నాఁడునాఁట మది కింపు లొసంగెను బాల చూడ్కికిన్.

క. అల్లారిముద్దు సేయుచుఁ
దల్లియుఁ దండ్రియును సముచితప్రియకృతులన్
వల్లిని వనపాలుర వలె
నుల్లాసము మీఱఁ బెనుచు చుండిరి బాలన్. 67

ఆ. రాణి పిన్ననాఁడు రమ్యవస్తువు లెవ్వి
యాట లాడుకొనఁ గ ననువుపడియె
వానితోడ నిపుడు బాలికామణి యును
నాడుచుండి తల్లి ననుకరించె. 68

ఉ. భూపరిపాలనోద్యమముఁ బూని యు రాణి దినంబు దప్ప కా
పాపకు బుద్ధులం గరపి పాఠములం దగ బోధ సేయుచు
ద్దీపితసద్గుణంబులను దేజరిలం గ నొనర్చెఁ దల్లి వి
ద్యాపరిపూర్ణన్ నిర్మల పథంబున బిడ్డలఁ బుచ్చు టబ్రమే. 69

మ. పదియేనేఁడులప్రాయ మింతి బడయం బ్రష్యాఖ్యదేశాధిపుం
డదనం బుత్త్రుని విల్లియం ప్రిడరికున్ హర్షంబునం గొంచు సం
పదమేయం బగులండనాఖ్యపురముం బ్రాపించి యం దుండఁ గా
నొదవెం దత్తరుణీద్వయంబు మది నన్యోన్యంబు పై రాగముల్. 70

సీ. జనకాదులు ను వారిజాంపత్యమునకును
 హర్షసంపన్నమనోజ్ఞు లైరి
కలికియాశయము ను దెలుపునంతకు రాణి
 యుపయామనిశ్చయోద్యోగ ముడిగి
పదఁపడి షోడశాబ్దమునఁ బ్రథానంబు
 బాల కష్టాదశవర్షమందుఁ
బరిణయంబు నొనర్చెఁ బౌరలమెంటులో
 నాల్గులక్షలు హరణంబు మఱియు

గీ. హాయనంబునకు ను నయుతాష్టకంబు
రూప్యకంబుల నొసఁగంగ రూఢ మైన
శాసనముఁ గల్గె నీరీతి సకలమనుజ
సన్నుతం బౌచుఁ గళ్యాణసరణి జరిగె. 71

ఉ. యూరపుఖండమందు మఱియొక్కతె యింతసమర్థురాలు లే
దారయ నంచు నెంచుసతి నాతఁడు నాదగుభాగ్యదైవమీ
తీరున భూమికై యరుగుదెంచె నటంచు విభుండలంచు నా
సారసనేత్ర వారిమదిచందము రాగము. నెంచ శక్య మే. 72

గీ. ఆమె కేకోనవింశతిహాయనముల
ప్రాయమున సంభవించెను ప్రథమపుత్త్రిఁ
దతఁడు రెండవవిల్లియం బనఁ గఁ బరఁగి
జర్మనీచక్రవర్తిత జరుపు చుండె. 73

క. ఆరాణిపుత్త్రికయుఁ దన
దారకులకు నేమరిలక తల్లియుఁ బోలెన్
సారతరవిద్య బుద్ధియు
నేరుపునం గరపుచుండు నిచ్చలు సద్దన్. 74

క. ధాత్రీనేత్రికిబుత్రీ
పుత్రులుఁ దత్సుతులు వృద్ధి బొందుచు నిటు దౌ
హిత్రాదులు పెక్కండ్రై
గోత్రం బతివిదిత మయ్యె గోత్రాస్థలిపై. 75

శా. ఆరాట్పుత్రిక తల్లిఁ బోలి నిఖిలవ్యాపారనైపుణ్య మే
పారన్ శ్రీ గలదాన నంచు నవలేపావేశముం జెంద కా
కారవ్యాపృతిచిత్తముల్ సమము లై కాలం బ్రవర్తించుచుం
గారాబంబున బిడ్డల న్నిపుణులం గావించుఁ గర్జంబులన్. 76

క. దాసిం బిలునక యొకనాఁ
డాసనముం దా నె తెచ్చునంతం ద్వరతో
డాసిన చేటిం గనుఁగొని
యాసారసనేత్ర. యిట్టు లనియెన్ నగుచున్. 77

గీ. రాజ్యపీఠస్థ యైనట్టిరాజ్ఞి యయ్యు
రెండుచేతులఁ బీఠముల్ రెండుఁ దెచ్చె
నొక్కనాఁ డిట్టికర్జముల్ పెక్కు జేయు
నప్పుడప్పుడు మాతల్లి యది కొఱంతయె. 78

వ. ఇట్లారాచకూఁతురు కాలక్రమంబున శాఖోపశాఖల వెలసి వృద్ధిం గాంచుచుండె నంత మఱి యు. 79

క. నలువదియొకటవయేఁటం
గలిగెనవంబరున సుగుణగణ్యుఁడు పుత్త్రుం
డలరాజ్ఞికి నదితికి మును
బలభేదనుఁ డుదయ మొందు పరిపాటిఁ దగన్. 80

ఆ. కలిగె నుత్తరాధికారి రాజ్యమునకు
ననుచుఁ బ్రకృతిజనులు నంద రాని
సంతసంబుఁ జెంద జనని యు జనకుండుఁ
జెందునట్టిముదముఁ జెప్ప నళ మె. 81

క. పరిచారకాదిజనులకుఁ
బరితోషద్రవ్యవర్షపటిమంబున నా
దొరబిడ్డఁడు బుట్టినదిన
మురు వార్షికదివస మనఁగ నొప్పెం దలఁపన్. 82



ప్రిన్సు అఫ్ వేల్సు ప్రభువు నామకరణ మహోత్సవము. సెయింటుజార్జి ఆలయము. 141.

చ. ననననకౌతుకంబున ఘనస్థితి నాఁ డొనరించినట్టియు
త్సన మది యిట్టి దట్టి దని తద్దయు నగ్గనఁ జేసి చెప్పినం
దవులుచు శ్రోతృమానసమునంబున నింతయొ యంచు సర్వముక్
విస్మృతి యొనర్పఁ జాల మిని వీడుట యుక్తము నగ్గనాంశముల్. 83

ఆ. తండ్రిపేరుఁ దల్లితండ్రిపేరు ను గూర్చి
యకుమారకునకు ననువు మీఱ
నాఖ్య యొసఁగి రప్పు డాలుబట్టడ్వడ్డ
నాగ హాసన్ మెడఁద నాఁగ లేక. 84

మ. పని మీఱం దనమేనమామను లియోఫోల్డ్ప్రభుం గూర్చి తే
ఖను శ్రీరాజ్ఞి లిఖించె నాతనయునాకారంబుఁ జూడం గనె
న్వనిఁ బోలం గలఁ డంచు వింత యగు సర్వప్రక్రియం దండ్రితో
నెన యౌఁ గాక యటంచు నిశ్చయము గా నీశుం బ్రశంసించెదన్.

ఉ. కొందఱు రాచబిడ్డలను గొల్చుచు భూరిముఖస్తనంబు లన్
మందులు వెట్టి వారి నతిమందులఁ జేయుచు నుంద్రు వార లుం
గ్రిందు ను మీఁ దెఱుంగక చరించుచు గర్వధురంధరత్వముం
జెందుచు దుష్కృతిప్రసనశీలురు జాల్ములు గాక యుందు రే.

శా. ప్రాలేయోరుఘనాంతరాళగత మాపాషాణముం బోలుచుం
బాలత్వంబున హృద్గతం బగుదురభ్యాసంబు నానాఁటఁ బై
కాలంబందు ను వెల్వరించుట కశక్యంబౌను గానన్ జనుల్
మే లౌ కార్యములందు బాలురకుఁ గూర్మిం జూప నర్హం బగున్.

గీ. కాన నారాజమిథున మీ్రకమ మెఱింగి
తమయపత్యములకు ను సద్ధర్మనిరతు
లైన పరిచారకుల నుపాధ్యాయవరుల
నేర్పరచి సద్గుణంబులు నేర్పె చంద్రుడు. 88

శా. ఆయాల్పర్టువిభుండు రాణియు నపత్యప్రీతిచేఁ దా నుపా
ధ్యాయు ల్వారికిఁ జేయుబోధములు విద్య ల్వృద్ధి యా రీతి వా
లాయం బొప్పఁ బరీక్షఁజేయు నొకవేళం గొన్ని యంశంబు లిం
పాయుక్తి ల్బచరింపఁ దెల్పెదురు సమ్యగ్జ్ఞానసంసిద్ధికై. 89

ఉ. చెప్పఁ గ నేమి రాజ్ఞి మృదుశీలము బిడ్డలయొజ్జసానిదొ
క్కప్పుడు రుగ్ణ యౌజనని కై యుపచార మొనర్పఁ గోఁ తా
నిప్పని వీడుకొందు నన నే మెనచింతుమట వీరిపాఠముల్
తప్పక సౌఖ్య మబ్బినపదంపడి ర మ్మని పుచ్చె నెమ్మదిన్. 90

క. పలుమరు నారాజ్ఞీమణి
కలనడి విధివశముచేత నాపద లె న్నే
తొలఁగి చనె నామెస్థైర్యము
నిలుకడ ధర్మానుగతి యు నేర్పఁ దెలుపుచున్. 91

ఉ. కోవెల కేగి దంపతులు గొబ్బున వచ్చుచు నుండ ము న్వలెం
ద్రోవను ధృష్టుఁ డొక్కరుఁడు తొందరపాటున వారిపై వుసం
జేసడి గాఁ దుపాకి గురిసేయఁ గ దైవము కాచి యుండుటం
బావక మంట దయ్యె నట బండి యు రివ్వున నేగె నంతలోన్.

ఉ. తాలిమి ధైర్యముం గలుగుదంపతు లామరునాఁడు వెంటి న
య్యాలికి నేగుచుండఁ గ గురాత్మకుఁ డంతటిలోఁ దుపా కినిం
దూలఁ గ మీటె నద్ది యును దోఁచెను దైవము రాడ్భటాళి యా
కూళను బట్టి వానికడ గుండుతుపాకి యు లాచె నద్ధతిన్. 93

వ. జాన్ఫ్రాన్సి స్సనునీఘాతకుం డె యతీతదినసంబున జిఘాంసుం డ
య్యె నని యాల్బర్టు తదూపలక్షణంబులచే నిరూపించె నంత ధర్మా
ధినాథుఁ డా రాజద్రోహికి నామమాత్రావ శేషుం డై యుండునట్టి
దండంబు నియమించిన నావృత్తాంతంబు నిజకర్ణగోచరంబు గాఁ గ
నాభూపాలికామణి కటకటం బడి యాదండనంబు మాన్పి ద్వీపాంత
రవాస శిక్షాపాత్రుఁ జేసి టాస్మానియాకుం బుత్తెంచె నట మున్న.

క. తమతో రథయాత్ర న్ని
త్యము విడ కేతెంచుయోగ్యదాసిం గని యా
ప్రమదారత్నము వాజ్మం
జిమ యొప్పారం గఁ జేరఁ జీరి వచించెన్. 95

క. వయ్యాళి కేగుతఱి ని
న్నయ్యరదం బెక్క వలవ దంటిని మదిలో
నెయ్యది దోఁచె నో నీకుం
జయ్యనఁ బుల్లటిలె మోముచందం బవు డే. 96

చ. నిను వల దన్న కారణము నిశ్చయ మొప్ప వచింతు నొక్క దు
ర్జనుఁడు తుపాకికిన్ మము శరవ్యము గా నొనరించి సంభ్రమ
మ్మున బెగ డొందు చుండ వెసఁ బోయెను గావున నా కపాయముం
బొనరచ కుండ మానఁ డనుబుద్ధి జనించె నసంశయంబు గాన్. 97

గీ. నేఁ దలంచినరీతి గా నేఁడు వాఁడు
మమ్ము సమయింపఁ గాఁ గోరి మరల నొక్క
యగ్నియంత్రంబు రగిలింప నచ్చెరువు గ
దైవవశమున నది యును దప్పి చనియె. 99

ఉ. దైవము నన్ను నేగతికిఁ దార్పఁ దలంచె నొ యట్టు లౌను గా
కీవెత నన్యులుం బడయ నేటికి నాకయి యంచు నెంచితిం
గావున నిన్ను మానిచితిఁ గాని యనాదరవృత్తిఁ గల్గి ని
న్నాఖనము వేఱు గాఁ గ నెడఁబాతు నె యంచు వచించె నెమ్మితోన్.

క. ఆనాఁటి రేయిఁ గుతుకము
తో నాటక మొకటి దంపతుల్ గనువేడ్కం
బో నచటివారు వారి య
నూనం బగుధైర్యగరిమ నుతియించి రొగిన్. 100

సీ. మఱునాఁడు తన మేనమామతో రథమున
దేవళంబున కరుదేరుచుండ
మొనసి మధ్యేమార్గమునఁ దుపాకినిఁ గాల్చె
జాన్విల్కిబీను నృశంసుఁ డది యుఁ
దప్పె నద్దేవికి దైవమడ్డు గ నిల్వ
నెన్నిశస్త్రంబులు నేమి సేయు
నిల ధర్మమున నేలు నేలిక కాపద
లంటమి ప్రజలభాగ్యంబు గాదె



వేల్సుప్రభ్వి, రాణీగారి పెద్దకోడలు.    145.

గీ. రాజఘాతం బొనర్చుదుర్న్యయుల మరణ
దండమును ద్రిప్పి వాని నుద్దండకశల
మోది కారాగృహంబున మూడునర్ష
ములు నునిచి ర్లాను శాసనం బెలమి నయ్యె. 101

ఆ. కశల మోదు టరయఁ గడు దుస్సహం బగు
మరణశిక్షకన్న మరణమునను
గొబ్బునను దొరంగుఁ గ్రుక్కుడు ప్రాణము
విడచి విడున కుసుగు వెతలఁ గొను నె. 102

వ. అంత నాయాల్బర్టెడ్వర్డు యువరాజు పలుతెరంగు లైన విద్యావిశే
షంబు ల నేక దేశికులవలన నభ్యసించి సుమేధోగ్రగణ్యుం డై మఱి
యు నిడింబరు పురమునఁ గల పాఠశాలం గొంతకాలంబును నా
క్స్ఫర్డును కేంబ్రిడ్జి యు నాఁ బరఁగు శాస్త్రపాఠశాలాద్వయం బునం
గొంతసమయంబును దత్తచ్ఛాస్త్రంబులం గఱచుచు సహపాఠుల సర
కు సేయక ప్రవర్తిల్లు చుండె. 103

క. పదియనమార్చి నతం డరు
వదిమూఁడనవర్షమున వివాహంబయ్యెన్
ముదితనలగ్జాంద్రణ్ స
మ్మదమున డెన్మార్కు దేశమహీపతితనయన్. 104

ఉ. ఎక్కటిచక్రవర్తినికి నిష్టతనూజుఁడు రాజ్యపీఠిపై
నెక్కఁగ నున్న భూవిభుఁడు జ్యేష్ఠుఁడు వేల్ యువరాజు నౌచుఁ బెం
పెక్కినయట్టిబల్దొర కహీనముదంబునఁ జేసినట్టియా
చక్కనిపెండ్లియుత్సవపు సంపద నే మని సన్నుతింప నౌ 105

ఆ. అతని కింపుమీఱ నాల్వుర్త్రు వెక్కరన్
జాజ్రిస్రీదిరి కన సెసంగుసుతులు
కన్యకలు ను మువ్వురు గల్గి రీగతి గాజ్ఞి
పాత్రసతి యు నగుచుఁ బ్రబలె మిగుల. 106

క. ఆయువరాజుగుణంబులు
నాయు వరాతిజయ మీాడితై శ్వర్యంబుం
బాయక జననికిఁ బోలెన్
వేయితెలుంగుల నుతింప విస్తృతిఁ జెందున్. 107

చ. యువజననాథుఁ డాతఁడు సముత్సుకుఁడై జను లబ్బ మొందఁ గా
వివిధపదార్థదర్శన సువేశ్మము నొండు రచింపఁ జేసి యం
దవిరళశిల్పవస్తువులు నచ్చట నచ్చటఁ గ్గొధాన్యముల్
నవనవరూపభేదము లనంతము గా నిడె మాద్రికై తగన్. 108

మ. తలిదండ్రు ల్వలె నీతఁడుం దనయపత్యంబుల్ లసద్విద్యలన్
వెలయం జేయుచు నొక్క దేశికునితోఁ బృథ్వీతలం బంతటం
గలయం జూడఁ గ నోడపైఁ బనిచె నాకాలంబునన్ నావికుల్
గలముం బుచ్చెదునట్టినేర్పుల నెఱుంగం జేసె నానాఁటికిన్. 109

క. సిరిగలవార మటంచున్
దొరబిడ్డల మనుచు వీఁగుదురు పెరవా రా
దొరబిడ్డ లిర్వురున్ హాయ
నరసేనానాయకతలు దాల్చిరి వేడ్కన్. 110



ఆల్బర్టు, విక్టరుప్రిన్సు అఫ్ వేల్సు ప్రథమపుత్రుడు. 11 సంవత్సరము. 146

వ. ఇత్తెఱంగున మహారాజ్ఞీప్రథమపుత్త్రిం డగు నాల్బర్టెడ్వర్డు సంతతి ల
తికాప్రకాండంబు చివురించుచుండె నంత. 111

క. సదగులుఁ డతఁ డుదయించిన
పదియేడవ నెలను భూమి పాలామణికిం
బదపడి పుత్త్రీరత్నం
బుదయించెన్ బంధుజనుల యుల్లము లలరన్. 112

ఉ. ఆలి సనంగఁ బేరుఁ గని యాశిశు వాటల హాసనృత్తులన్
బాలిక యైనకాల మొకపాటిగఁ బుచ్చి క్రమక్రమంబునన్
మేలి వివేక మన్యులకు మే లొనరించెడిబుద్ధి గల్గి మే
ల్మేలనఁ దండ్రికి న్విశదలీల నొనర్చు మహోపచారముల్. 113

శా. నిస్సాపత్న్యత భూమి నేలునలరాజ్ఞీరత్న మక్కన్నియన్
హెస్సీదేశము నేలు ఔనిసుతుఁడై హృద్యాత్మకుం డైనలూ
యిస్సంజ్ఞాకునిహస్తమందు నిడె భర్తృస్నేహ మొప్పార వ
ర్చస్సౌశీల్యము లొంది బాల యఖిలాశాస్యస్థితిం దాలిచెన్. 114

ఉ. బిడ్డల నాత్మమాత సలెఁ బెంచుచు దీనులయిండ్ల కేగుచున్
సడ్డ వహించి వారలకు సాయ మొనర్చుచు సత్కృపం దెవుల్
వడ్డజనాళి నేరఁ దగువారల నిల్పుచు వైద్యశాలలం
జెడ్డలు సోఁక కుండఁ బరిశీలన సేయఁగ వచ్చి పోయెడున్. 115

ఉ. భామల వైద్యశాలపరిపాలిక రోగిణు లైనవారితో
నీమెను మీ రెఱుంగుదు రటే యన నోర్వక యామె వీరికిన్
క్షేమమొకో యటంచుఁ బరికింపఁ గ సోదరి నైతి నింతె కా
కీమెయి సన్నుతింపఁ దలఁ పేటి కటంచు వచించె ధీరయై. 116

చ. పరహితకార్య మే తనకుఁ బాటిగ ముఖ్యమటంచు నెంచునా
పరగుణ యందు నెల్లరును వారక మిక్కిలి గారవంబు నా
దరమును జూపు చంద్రుఁడు విదితంబు గఁ బూజ్యత నింద్యభావము
న్నరునకు నెంచి చూడఁగ గుణంబులచేఁ గద సంభవించెడుఁ.

ఆ. పూర్వకాలకృతము భోక్తవ్య మే కద
యెట్టివారి కైన నట్టిసుగుణ
సుతుఁ డొకండు సౌధపతితుఁ డై యీల్గుటఁ
గనులఁ జూచి వగలఁ గలఁగి వలసె. 118

క. నాల్గవయగస్టు నలువది
నాల్గవవర్షమున భూమినాథామణికిన్
నాల్గవయపత్య మాత్రెడు
గల్గెం దత్ప్రకృతిజనులు కౌతుక మందన్. 119

ఉ. నావికసేనకుం బ్రథమనాయకుఁ డై మహిమన్యవార్ధి సే
నావళి నేలె నాతని నొకప్పుడు క్రూరుఁ డొకండు చంపఁగా
భావనఁ జేసి కొట్టెను దుఃపాకి న టయ్యెఁ జికిత్స సేయుటన్
దైవకృపన్ విపద్దశకుఁ దప్పి యథాపుర మొందె సౌఖ్యమున్. 120

క. నారీగుణసమలంకృత
యా రుష్యాచక్రవర్తి యాత్మోద్భూతన్
మేరీ యనఁ దగు నట్టిక
మారీమణిఁ బెండ్లి యాడి మహి నర్ధిల్లెన్. 121



ఆస్పోర్ఫరనులోని సంతోషదినములు. 148.



రాణీగారి ద్వితీయపుత్రుడు, ఎడింబర్గు ప్రభువు. 148.



ఆస్బోర్ణ సౌధము. 149.

చ. నలునదియాఱునత్సరమునం దగ నిర్వదియేనునాఁడు మెయ్
నెల నిలయేలునట్టిరమణీమణికిం జనియించెఁ గ్రమ్మరన్
నలినదళాయతాక్షి హెలినా యను పేరఁ బ్రసిద్ధిఁ గాంచి యా
కులము ననాకులం బగుచుఁ గోరికతోఁ గొనసాఁగు చుండఁ గన్.

శా. ఆర్ద్రారత్నము చిన్నవారికి జనవ్యాకీర్ణ మౌ వీఁటిలో
నారోగ్యం బొనగూడ దన్ దలఁపుతో నాస్పోరనన్ పేరిర
మ్యారామంబును నిల్పి యందు నతిరమ్యం బౌ విశాలస్ఫటా
గారంబున్ రచియింపఁ జేసి నిలిపెన్ గారామునం బిడ్డలన్. 123

సీ. మరుని పెన్మ్రులికి ౖయె మరునంపుమొలక వే
　　మఱుఁ గాముకులమది మరలుకొల్ప
దమనంబు విరహిబృందమనంబులకుఁ జాల
　　దమనం బొనర్చుచందమునఁ బొదలఁ
బొగడఁ గఁ దగినట్టి పొగడలు మే లైన
　　మొగడ లెత్తుచుఁ జాల నెగడుచుండ
మావులు సుమశరుమావులమొత్తము
　　తావు లగుచుఁ బలుతావు లీన

గీ. మఱియు మేలితరంబు లౌ మహిజలతలు
వెలయుచుండఁ గ నగ్గిము నలుదెసలును
నందనం బన మదికినానంద మెసఁగ
నలరఁ జేయించెఁ జూచువా రలరుచుండ. 124

సీ. తుమ్మెద ల్విరులపైఁ గ్రమ్మి మొత్తమ్ముల
ఝుమ్ము ఝుమ్మన రొదల్ జిమ్ముచోట్లు
పూఁజొంపములురాశిఁ బోసినకైవడి
గుజ్జుమ్రాఁకులవిరుల్ గొరలుచోట్లు
చల్లనిజలముల వెల్లువల్ జంత్రముల్
పెల్లుగాఁ బైపయిఁ జల్లుచోట్లు
పలువన్నెపూరేకు లిలఁ గ్రమ్మి చిత్రంపు
రంగవల్లికలై చెలంగుచోట్లు

గీ. వాలుగొమ్మలు పుడమిపై వ్రాలి గాలిఁ
దూలుచును బాలకులతోడఁ గేళి సల్పు
కరణిఁ దోఁచెడిచోటులుఁ గల్గి యొప్పు
నట్టియాక్రీడ మది క్రీడ కనువుపడదె. 125

ఉ. తల్లియుఁ దండ్రి యట్టిప్రమదావనముం బ్రమదమ్ము మీఱఁ గాఁ
జల్లనిగాలివీచు నెటిసంజలఁ జక్కఁగఁ జూపుచుండ న
ప్పిల్లలు నొండొరుల్గలసి ప్రీతి యొసంగఁ గఁ గ్రీడ సల్పుచుం
బల్లవపుష్పమంజరులు మంజుశిఖావళి దాల్తు రింపుగన్. 126

ఉ. అందొకమంటపంబుఁ బృథుకార్థము గా రచియించి వేఱుగా
నందపుచిన్నిపుష్పవన మందటికి న్విరచింప వారలా
నందము మీఱఁ గా దినదినంబు ను నించుకసేపు చెట్లకుం
బొందుగ నీరు వెట్టుచును బోదులు దిద్దుచు నుందు రేపునన్. 127

గీ. తత్తదాఖ్యాంకితంబులై తనరుచున్న
చిన్నదోహదకరణముల్ చేతఁ బూని
వారు పనిసేయు టొకయాట వలె నెసంగు
బాలకులచేష్ట సమ్మదావహము గాదె. 128

మ. జనకాజ్ఞన్ బహుశిల్పకర్మవితతిం జాతుర్యముం బూని య
మ్మనుజాధీశ్వరపుత్త్రి లన్యజనసంపర్కంబు లేకుండఁ గా
ననుఁ గా చక్కనిచిన్నకోట నదియున్ వ్యాయామమై తోఁచఁ గా
నొనరం జేసిరి వారియైక్యముఁ దదుద్యోగంబులుం జిత్రముల్. 129

చ. అచట రచించి రందపుమహానస మొక్కటి యందుబాలికల్
రుచు లెసఁగంగ నాత్మపరిరోపితవృక్షశలాటుముఖ్యముల్
పచనము చేసి స్వాదుతరభక్ష్యములన్ రచియించి సోదరా
ద్యుచితుల కెల్ల విందిడుదు రొక్కపు డింపుగఁ దింద్రు తాము గన్.

వ. ఇత్తెఱంగున నారాజార్భకులు చేఁత వాఁతనభ్యసింపం దగినవిద్యలం బ్రవీ
ణులగుచుండి రా హేలినా కన్యారత్నంబు చే నాగస్టెంబర్గు మహారాజ
సూనుం డగుక్రిష్టియన్ కుమారవరు నలంకరించి రా దంపతులుం బ్రా
ప్తాపత్యులై వర్ధిల్లి రంత. 131

క. జననాయకునకు నలువది
యెనిమిదవది యైనమార్చి నిరువదియొక టౌ
దినమున లూయిస యనఁగ
నైను లోరన్భర్తబాలకేల గ్రహించెన్. 132

శా. ఇట్లాకన్నియ గల్గినట్టిశుభ మాసేఁటన్ మహారాజ్ఞి యున్
స్కాట్లాండన్ విషయంబునందు విలిచెన్ ధారాళవాతంబు లా
పట్లన్ స్రొం పగుశైలదుర్గ మొకటిన్ బాల్మోర లన్ దాని నా
చెట్లాప్రాంతనదీతరంగములవాసి న్వ్రాకొనన్ శక్య మే. 133

## మహాస్రగ్ధర.

సెలయేళ్ళుర్వీధ్రసంధిన్ జిలజిలవోరుగం జేరి యం పాడుచుం గొం
డలసానుల్ బ్రాఁకుచున్ వేడ్కలు జిపు రిడ దట్టంపుపూజొంపము ల్వా
న్నెల గాయం జిన్నిగోరుల్ నిలపి తునుముచు న్నిచ్చలుం బాలురాచెం
తలఁ గేళిం దేలుదు ర్మోదమున జననియుం దండ్రియుం జూచుచుండన్

సీ. అం దుండు సమయమం దాల్బర్టు రాణియుఁ
బేదవారలయిండ్ల కాదరమున
నరిగి తత్క్షేమంబు లారసి విందుల
కరణి నించుక యరమరిక లేక
తగునృత్తు లొసఁగి యింపు గ మేలుఁ బల్కుచు
నాతురవృద్ధుల కౌషధాదు
లిడి పాఠశాలల కేగి విద్దెలు విమ
ర్శించుచుఁ బారితోషికము లొసఁగి

గీ. రమణుఁ డాఖేట మొనరింప రమణి శైల
తటవిహార మొనర్చునంతటను దేవి
యప్పిలుండి యు రాజ్యకార్యక్షణమున
జాగరూకత మరుపదు సమయగతిని. 135



బాల్మోరల్ దుర్గము. 152.

ఉ. వేకువ లేచుచుం బ్రహరవేళ భుజించి విహార మాత్మకా
ర్యాకలనం బొనర్చి యపరాహ్ణము మంత్రులఁ గూడి రాజ్యతం
త్రైకమతి న్వసించి యటు స్యందనయాన మొనర్చి సంధ్యనం
గీకృతవిద్యుడై నిశ నొగిన్ భుజియించి పరుండు రాజ్ఞి తాన్. 136

శా. భూమీపాలిక యొక్కనాఁడు శకటంబుం జెంది పో విల్లియమ్
హామిల్ట న్సమభిఖ్యుఁ డేసె హుతభుగ్యంత్రంబు నద్దేవి పై
నేమంచుం దొలఁగించె దైవ మది యున్ ద్వీపాంతరావాసశి
క్షామేయాపద నొందె వాఁడు సతయేం డ్లంహఃకృతు ల్సహ్య తే.

గీ. రాణి కార్థరుఁ గెన్నాటుప్రభువు ననఁగ
రెండుపేరుల నొప్పుసుతుండు గలిగె
నేను నెలమొదటిదినమం దేఁబదియవ
వర్షమునఁ దత్పురీజనుల్ హర్ష మొంద 138

వ. అనంతరంబున మాసం బతిక్రమింప నొక్కనాఁడు. 139

క. పినతండ్రి నామయూవిం
గనుఁగొని యేతెంచురాణి కడకు న్వడిగాఁ
జని లెప్టెనెంటువే టనఁ
దనరెడువాఁ డొక్కకఱ్ఱఁ దలపై మొత్తెన్. 140

గీ. రాణితలపైకుళాయి శిరస్త్రి మనుట
సార్థకంబుగ శిరముఁ గాపాడెఁ గాని
యిచట విధివ్రాఁత మంచిదం చెన్నుకరణి
గాయ మొక్కటి నొసటిపైఁ గాన వచ్చె. 141

గీ. ఆన్నృశంసకుఁ డున్మత్తుఁ డనుచుఁ గొంద
అనిరి తత్పక్షపాతకు లైనజనము
ల్ట్రిలు లయ్యును హోమిల్ట నసుభవించి
నట్టిదండంబునకుఁ బాత్రుఁ డయ్యెఁ దుదకు. 142

శా. ఆయాల్బర్టు జగంబునం గల విశిష్టార్థంబులం బ్రోవుఁగాఁ
జేయ న్మానవు లెల్ల వానినిఁ బరీక్షింప న్మహోపర్వనో
చ్చ్రాయం బైదుదినంబు లైదుసెలలు న్సాఁగించె లండన్ పురిన్
డాయం బోయి రనేకు లేఁబదొకయేటం దజ్జనోద్యానమున్. 143

క. ఆకేన్సా టువిభుండుం
బ్రొకటగుణ లూయిస యనుప్రష్యాధిపజుం
జేకొని సుతుఁ డొక్కరుఁడు గఁ
దోకత్రితయంబు గాంచెఁ దొయ్యలియందున్. 144

క. మరలఁ ద్రిపంచాశద్వ
త్సర మేప్రెలుమాసమందు సప్తమదిన మా
ధరణీపతి కుదయించెఁ గొ
మరుఁడు లియోపాల్డనంగ మహితాఖ్యుం డై. 145

క. ఆల్బనివిభుఁ డై యొప్పుచు
బల్బలమొందక యు విద్యఁ బటుగుణగరిమన్
మేల్బంతి యగుచు నాతం
డాల్బర్టుం బోలి యుండె నాబాల్యము గన్. 146



వస్తుప్రదర్శనమునాటి అల్బర్టుప్రభువు. 154.



1851 శ్రీరాణిగారు ఆల్బర్టుప్రభువుగారిచే తెరువఁబడిన లండను వస్తు ప్రదర్శనము. 155.

వ. అలియోఘాల్డకుమారుండు హెలినా రాజకుమారికయందు స్త్రీపుం సాపత్య యుగలంబుం బడసె మఱియు ను. 147

ఉ. ఏఁడులు నాల్గు నాఁడులవియేడు ను నాతనికన్నఁ జిన్న యై వేడుక మీఱ సర్వపృథివీపరిరక్షణదక్ష యైనయా చేడియ కుద్భవించె నొకచిన్నికుమారి బియాట్రి సంచుఁ బ ల్కోడిమి గల్గునామమునఁ బొల్పువహించుచుఁ దాఁ గనిష్ఠయై. 148

క. జననికిఁ బ్రాపై యుండుట కెనిమిదియుర్వదియు నేఁడు లీచెలికరపీ డన మొల్ల కుండి హెన్రీ టనుబాటెన్బర్గు రాజు నాత్మజు నటుపై 149

గీ. పతిఁ గఁ జేకొని తనతల్లిభవనమందు వాస మొనరించె నీమె వివాహకాల మున కె రాజ్ఞికి మనుమలు మనుమరాండ్రుఁ గలరు ముప్పదినలుగురు లలితరీతి. 150

ఉ. తామరతంప రై యిటుల దద్వరవంశము నాఁడునాఁటికిం గోము వహించె దైవ మనుకూలము గావున నెన్నిసారు లో యామహినేత్రికిం గలిగినట్టివిపత్తు తొలంగి పోయెఁ గా కే మనవచ్చుఁ గాలగతి యెంతటివారికి దాట శక్యమే. 151

క. అష్టాదశశతకంబులు
షష్టియు నొక్కటి యు నైనసంవత్సరమం
దిష్టముల మార్చి మార్చియు
కష్టంబులఁ జూపమొదటికాలం బయ్యెన్. 152

ఉ. హా యిఁక నేమిచెప్పఁ దగు నంతటిదాఁక సుఖంబు లొందుచున్
హాయిగ నుండురాజ్ఞికిని బ్రాణపదం బగుతండ్రి బాల్యమం
దాయువు వీడ నక్కటఁత నందఁ గనీక ముదంబు నొంద గాఁ
జేయుచునున్నతల్లియును జెందె నచింపనశక్య మౌ దశన్. 153

ఉ. చిన్నతనంబునన్ జనకుచేటు నెఱుంగక తల్లిపోవునన్
మన్ననఁ గాంచుచున్నసతి మాతృవిపద్దశఁ గాంచి యాత్మలో
నెన్నిదలంచి కుందె నొకొ యేమినచింపను తల్లిదండ్రు లా
పన్నత నొంద ధైర్య మెడఁబాయక యుందు రె యెట్టిధీరులున్.

ఉ. అంతకు మించి భర్తృవిరహార్తి వధూజనదుస్సహంబు గా
వంతలఁ బెట్టు చుండుఁ గద వహన్ మతీతము గాక మున్న యా
క్కాంతకు నట్టిదుర్దశ యుఁ గల్గి వ్రణంబున నుప్పు జల్లిన
ట్లంతము లేనిశోకమున కగ్గము గాఁ గ నొనర్చె నక్కటా. 155

శా. ము న్నాల్బర్ట్ దినద్వయంబును లివర్పూ రేగ ఁగా నెంత యున్
ఖిన్నత్వంబున స్టాకుమారుదొరకు న్నిర్వేదముం దెల్పుక
మ్మ న్నారీమణి వ్రాసి పుచ్చె నట యమ్మాడ్కి న్మనోనాథుఁ డా
పన్నుం డౌటకు నెట్టిదుఃఖమునకుం బాత్రంబు గా కుండు నో. 156



లండనులోని ఆల్బర్టు మిమోరియలు. రాణీగారిభర్తజ్ఞాపకార్థమై
కట్టించబడెను. 156



ప్రిన్సు ఆఫ్ వేల్సు ప్రభువునకును అలెగ్జాండ్రా రాణీగారికిని జరిగిన వివాహమహోత్సవము. 157

మ. అకటా యవ్వరదంపతుల్ దమకు నత్యాసన్న మూనార్తిఁ గా
నక యయ్యోఁటు నిజోపయామదినసానందోత్సవంబుల్ సము
త్సుకులై చేసి రెఱుంగ శక్య మగు నే దుర్దైవకృత్యంబు ని
ర్వికలత్వం బొనరించువాఁ డహహ యతిప్రేమంబు నీ నేటికిన్. 157

సీ. అతిగుణశాలి యహానాత్మేశుఁ బాసిన
　　　నెవ్వగ కాయమ నిలయ మయ్యెఁ
బ్రజలసంతాపంబుఁ బాపుకర్జంబున
　　　జాగరూకత గల్గి సంచరించె
ఖనిజముల్ ద్రవ్వెడు మనుజశతద్వయం
　　　బం దొకపెట్టు గా నడఁగి పోవ
వారికళత్రాదిబంధుజనంబుల
　　　రావించి సాంత్వవాగ్రచన మీఱఁ

గీ. దత్తదుచితంబులైనవిత్తంబు లొసఁగె
భర్తృవిరహంబు గలనెల బాయకుండఁ
దనదుదుస్తరశోకంబుఁ దడన దయ్యె
నౌర శ్రీరాజ్ఞి గుణరాశి యనఁగ నల దె. 158

చ. ఇలు వెడలంగ లేక చిర మేకత ముండియు రాజకార్యముల్
గఁలతపడంగ నీక యొసకంబునఁ జేయుచు జ్యేష్ఠపుత్త్రి పెం
డిలి యగుచుండునప్పుడు గడిందివిఘ్నాత దేశకంబునం
దల యొకయింత వంచికొని దవ్వుగ నుండెను రాజ్ఞి యొక్కచోన్.

క. ఆదేవి దుఃఖవారిధి
నీదుచు నీరీతి నుండ నెడపక జామా
తాదుహితాపుత్త్రికపౌ
త్త్రాదుల విరహంబు మిగుల నలమట జేసెన్. 160

చ. అది యిటు లుండ నామె జననాది గ దౌర్యోగము నేము మాద్ధృతిం
బదిలము గాఁ గనుంగొనెడు మాతులుఁ డౌలియొఫాల్డు పేఁడు న
ర్వదియవనత్సరంబునను ద్వాదశమాసమునందు భూస్థలిన్
వదలి చనంగ నామెదురవస్థ నచింపఁ గ నేరిశక్య మౌ. 161

వ. అమ్మహీనాయికా రత్నంబు చెందరాని యిడుమలం జెంది ధైర్యం
బునం గాలంబుఁ గడుపు చుండె నంత. 162

సీ. ఇట్టి యుమ్మలికంబు లించుక పీడంగ
నొకనాఁడు నయ్యాళి నుండి వచ్చి
స్వభవనప్రాకారసరణి నేగుచు నుండ
నం దార్థరోకాన్న రనెడుతరుణుఁ.
డొకచేతఁ జీటి యు నొకచేఁ దుపాకి యుం
గొని వచ్చి రాణిపై గురి యొనర్పఁ
దత్పరివార ప్రధానుఁ డౌ జాన్ బ్రౌను
వెనుక వచ్చి తుపాకిఁ గొనియె బలిమి

గీ. మఱి యు రోజరు మెక్లీన్ సమాఖ్యుఁ డామె
విండ్సరుపురంబునకు నేగువేళ రథము
నందుఁ గాల్చెఁ దుపాకి నయ్యది యుఁ దప్పె
దైవకృప గల్గ నాపదల్ దప్పు టరు దె. 163

ఆ. అందు నొకనిఁ గళల నడిపించెఁ జెఱసాల
యొక్క వర్ష మెంచి యొరుని వెట్టె
యగుటఁ దెలసి రాజ్ఞి యభిమతమ్ము గఁ జెఱ
నునిచి రెల్లవారు నుచితమనఁ గ. 164

క. మును శాకశాలం బగు పది
యొనిమిదిశతములనునఱున దెనిమిదియనయే
టిని మొదలు రాణి జేసిన
ఘనకార్యమ్ములను వరుసఁ గడక వచింతున్. 165

ఉ. యూరపులో మహీధవుల నొల్లక యెల్లప్రజల్ స్వతంత్రతఁ
గోరి చరించుటన్ మిగులక్షోభము గల్గినదాని నోర్వఁ గా
నేరక ఫ్రాన్సుదేశధరణీపతి ఫారిసు వీడు వీడుచుం
బేరును మార్చి స్మిత్తనెడుపేరును దాలిచి చేరె లండనున్. 166

వ. అక్కటా ఫ్రాన్సుదేశాధినాథుండగు లూయిసు ఫిలిప్పు సకుటుంబమ్ము గా నెట్టి యిడుమలం గుడుచుచుండెనో మనము తద్దేశ వాసులకు విరుద్ధాచరణలంపటుల మని తెలియ కుండం దాటస్థ్యం బు నటించుచు నాతనిన్ సాధ్యగతిఁ బోచుట యావశ్యకంబు మఱి యు స్వప్రయోజనంబుకన్నం బ్రజానురాగం బధికంబు గాఁ దలంచు వారి యన్యోన్యశాసనంబులం గీటునంబుచ్చు కుంద మని తనమాతు లునకుం గమ్ము యనిచి రాజ్ఞీమణి యాతని గౌరవించి కాపాడం దొడంగె. 167

గీ. దేశసంక్షోభ మిట్టుల వర్తింప నామె
వ్రాసె నయ్యెడ సచివుతో భర్తతోడఁ
దలఁచి యిర్వదివేలలేఖలను నన్య
దేశరాజ్యప్రవృత్తులు దెల్పుచుండి. 168

శా. లండన్ పట్టణమం దొకప్పుడు నికాల స్సామరస్యామహీ
శుం డేతెంచి యు రాణి గౌరవమునం జూడం గఁ దుర్కీమహీ
శుం డౌనాసులతాను క్రైస్తవుల హెచ్చుల్ మాన్చి బాధించునం
చుండున్ రాజ్ఞి యుదగ్రప్రధానులును దా ముద్రోషులౌచున్ వినన్.

గీ. ఇట్లు సుల్తానుపైఁ గోప మెరియఁ జేసి
వెడలి రాణి యు సచివులు విడువ రాష్ట్ర
పక్ష మింగ్లండుమానవుల్ బవరమునకుఁ
జాల రనుచుఁ దురుష్కదేశంబుఁ బట్టె. 170

గీ. అయినఁ గ్రైస్తవబాధల నణఁచు నెపముఁ
బూని టర్కీయుఁ దద్రాజధాని యగుచుఁ
దనరు కన్స్టాంటునోపిలుఁ గొనుచుఁ గృష్ణ
భూమిమన్యసముద్రాంతభూమి నేలి. 171

క. చిరకాంక్షిత మగుహిందూ
ధరణిపయిం దుదకు వెడలఁ దలఁచి దురాశా
పరుఁడై యుండుట నెంచుచు
వెర వొప్పఁగ నపుడు రాజ్ఞి విజిగీషఁ దగన్. 172

చ. దురమున గ్రెంచివారలను దోడ్పడ రష్యకు దాడిఁ బుచ్చె ను
గ్ధురగతి రష్యవార లురుదోర్బలు లయ్యును మంత్రిసైనికే
శ్వరులకుఁ గల్గు లోపమున వారల కాక్రిమియాదురంబునన్
జరిగెఁ బరాభవంబు పలుసారులు దుర్జయహూణసేనచేన్. 173

ఉ. ఇట్టిపరాభవంబునకు నెంతయు నంత మనంబులోపలం
బుట్టఁగ రష్యనాయకుఁడు పోరెమొ దినంబున కందు శస్త్రసం
ఘట్టితు లైనవారలకు గాయము లెల్లను మాన్పి ధాత్రులం
బెట్టి యొనర్చె నొక్కసతి వేసట లేక మహోపచారముల్. 174

వ. ఫ్లోరెన్సునైటింగే లను నాసతీమణి యొనర్చిన యామయావి సంరక్ష
ణంబు లక్షముఖంబుల నైనం బొగడఁ దరంబె యామెకు శ్రీ మహా
రాజ్ఞీమణి మగరాలం గూర్చిన పతకంబుఁ బారితోషికంబుగా నొసం
గెఁ దదనంతరంబ. 175

శా. బంగాళాభటు లుర్వి జేని నెదిరింపన్ వార లుత్సాహ మొం
దంగా దుష్టులతోడఁ గూడుకొని నానాసాహ బుద్రిక్తుఁ డై
పొంగన్ మానిచి క్రూరతన్ మనుజులం బోకార్పఁ గా నీక క్యా
న్నిం గన్ జేనిమతంబుతోఁ గలసి పూనెన్ రాజ్ఞి యంచద్దయన్.

ఆ. అందువలన సదయ యగుప్రభు ఐని జనుల్
హాస్యము గ నొనర్చి నట్టిపేరు
సార్థకంబు గాఁగ జరుపుచు నానాఁటఁ
దగినబిరుదు గాఁగఁ దాల్చె దాని. 177

శా. బాలస్త్రీజనముఖ్యబాధకులు భూపద్రోహముల్సేయు దు
శ్శీలుర్ దండ్యు లటన్న మీమతము నేఁ జేకొంటి నింగ్లాండుభూ
పాలోద్యోగు లనేకులుం బగిలు దీర్పన్ మాన్పుయత్నంబున
న్నీలోఁ గూడితి నంచు రాడ్మణి యంపెం గమ్మ క్యాన్నింగుకై.

క. పదునెనిమిదిశతముల నేఁ
బదియేనిమిదివత్సరపు నవంబరునెలలోఁ
జదివిరి హిందూరాజ్యా
స్పదము న శ్రీరాజ్ఞి గొన్న ప్రకటన మెల్లన్. 179

వ. ఇ ట్లింగ్లాండం బ్రకటించిన యా పత్రంబున శ్రీరాజ్ఞీ గుణ విశేషములం దెలుపు తద్వాక్యంబులం గొన్నిఁటిం జెప్పెద నె ట్లంటేని. 180

క. క్రీస్తుమతంబును మేము ప్ర
శ స్తం బని నమ్మినం బ్రజలస్వాచార
ధ్వస్తులఁ జేసెదుతలఁపున
వా స్తవము గఁ బూన నంచుఁ బలుకుచు నుంటిన్. 181

మ. స్వమతాచారము లెవ్వ రేవిధమునం బాటించినన్ వారి న
క్రమదండార్హులఁ జేయ జాల మటి ధర్మం బొప్ప రక్షింతు ను
త్తమపూజాకులధర్మమార్గములచెంతం బోవునుద్యోగులన్
నిమసం బోర్వక నిగ్రహింతు నిది నానేమంబు వాక్రుచ్చెదన్. 182

ఆ. ఎట్టిజాతివార లేనియు నేతెగ
వార లేని యోగ్యపత్రనమున
విద్యచేత సద్వివేకంబుచే నర్హు
లేని రాచపనుల నిడుదు మరసి. 183

ఉ. దేవునిసత్కృప న్మరల దేశము నెమ్మది నొంది యుండ హిం
దూనరదేశసంస్థితజనుల్ సుఖియించుపనుల్ రచించి లా
భౌనియా మైనమార్గమున నందటి నేలఁగ భూరిశక్తి మా
కీవుత సర్వశక్తుఁడగు నీశ్వరుఁ డంచును మ్రొక్కి వేఁడెదన్. 184

క. ఈరీతిం దనయుద్యమ
మారాజ్ఞి సమస్తజనులు నానందింపన్
ధీరత బ్రకటింపఁగ విను
వా రామెం బొగడి రధికవాగ్వైఖరులన్. 185

శా. హిందూస్థానమునం దొకప్పుడు నుమున్నెన్నఁగ లేనట్టికో
ల్వొందం బొప్పఁగ ఢిల్లిలో జరిగె మేలై డెబ్బదేడేఁటియా
దిం దానం బ్రకటించె లిట్టనను మంత్రిశ్రేష్ఠుఁ డారాజ్ఞికిన్
హింయాదేశపుచక్రవర్తిని యనన్ హెచ్చైన పేరబ్బుటన్. 186

వ ఎనబదియేడుసంఖ్యగలయేఁటను దొంబదియేడువత్సరం
బున వరరాజ్ఞి రాజ్యమును బొందినయేఁబదియర్వదేఁడు లో
టను బహుళోత్సవంబులు కడంగి యొనర్చిరి హిందువుల్ మహీ
జనహితసర్మకార్యములు సల్పిరి యెల్లెడ రాణిపేరటన్. 187

గీ. అట్టిరెండవయుత్సవమందు నెల్జి
నవెడురాట్ప్రతినిధి నిఖిలాననీశు
లున్నసిమ్లానగరసభ నెన్ని మెచ్చె
రాణిసౌభాగ్యప్రవృత్తులు రాజ్యకృతులు. 188

సీ. ఇద్దేశి రాజ్యంబు నేలుకాలమునందు
దురము లెచ్చటనొ నిద్దురను జెందెఁ
బ్రజలు సౌఖ్యంబునఁ బ్రబలుటఁ దత్సంఖ్య
బడిబడి హెచ్చి యిబ్బడి నహించె
మహి యెల్లయెడ నదీమాతృకయై పండ
ధనధాన్యములు ను వర్ధనముఁ జెందె
ననురక్తి మీఱంగ జనుల నేలుచు నుంట
రాజ్యంబు నానాఁటఁ బ్రాజ్య మయ్యె

గీ. సేనలకుఁ గల్గు లెక్క యనూన మయ్యె
రమణఁ బుడమినిఁ బాలించురమణి చిరము
నాయురారోగ్యములఁ జెంది యప్రతిహతి
నేలవలె నని కోరి రన్నేల జనులు. 189

మ. కలలో ధూమశతాంగధూమనసనౌకల్ తంత్రివార్తాదులం
దెలియం జాలనియెల్లమానవులకుం దే టయ్యె దేశస్థితుల్
బలిసెన్ సద్వ్యవహారముల్ బగఱచే బాధల్ గదల్ బట్టెఁ జో
రులపే ర్మాసెను రాజ్ఞి యేలుబడిలో ద్రోహంబు లారెన్ మహిన్ .

శా. నద్యంభ(స్సృతిచే మరుస్థలములన్ నామంబులున్ మాసె స
ద్విద్యాశాలలు వైద్యశాలలు మహిన్ వృద్ధిన్ నహించె న్మహీ
శోద్యోగంబులు హెచ్చుమీఱెఁ బదవుల్ యుక్తోరుఘంటాపథ
ప్రద్యోతస్థితిఁ దాల్చెఁ జేపడియెఁ జిత్రం బొప్పునిష్టార్థముల్. 191

క. తనజనులమదియుఁ దనమది
యనువుగ నేకీభవింప నాసతినిజయా
ననమున ముదిమినిఁ బ్రజలం
దనిపెన్ గౌరవవివేకతత్పర యగుచున్. 192

చ. అతులితరాజ్యవైభవసమన్విత యయ్యుఁ బ్రజానురాగ సం
యుతమతి లౌకికాంగనకు నుద్దినహించుచు నుండునీమె స
న్నుతచరితం బె యచ్చటి యనూనచరిత్రలయందు దీర్ఘ మై
మతిఁ గరఁగించె నెల్లరకు మాటికి మాటికి గణ్యమాన మై. 193

చ. మతములు నీతివిద్యలు ను మార్పులు బోధలు రాచకర్జముల్
శతము సహస్ర మై జనులస్వాంతములన్ శిలలందుఁ జెక్కిన
ట్లతివిశదస్థితిన్ విడక యంటుట వెన్నెలఁ బోలెఁ జల్లనౌ
చతురతదీయరాజ్యగతి సంస్మృతిఁ బాయదు మానవాళికిన్. 194

ఉ. ఆమె యొనర్చు నేలుబడికన్నఁ దదీయచరిత్ర మెల్లరున్
వేమరు సన్నుతింత్రు పృథివీధుర నీమె వహించునప్డు నీ
గ్రోమహిలోనఁ బ్రాఁత యగుక్రూరపుబానిసవృత్తి నాఁడునాఁ
డే మయి పోయె నో శ్రుతికి నేనియు రాదు బ్రిటీషుసీమలోన్.

మ. ఇటు లీహూణమహీశరాజ్య మెలమిన్ హెచ్చెందఁ గా జర్మనీ
యిటలీఫ్రాన్సులరాజ్యముల్ విషమతాహీనస్థితిం బూనెఁ ద
క్కటిరాజ్యంబులపేరుమాత్ర మొకచోఁ గాన్పించె హద్దుల్ పరి
స్ఫుటరీతిం గన రాక కొన్ని చెడె దుర్బోధస్వరూపంబు లై. 196

వ. ఇట్లనేకదేశంబు లనేక వ్యత్యాసంబులచేఁ జెడిపోయినను రాజ్ఞీ
మణి క్రమక్రమంబునఁ గాలంబు గడచుకొలందిం బ్రజానురాగ విశ్వా
సపురస్సరంబు గాఁ బ్రవర్తించుచు దేశాభివృద్ధ్యేకపరత్వంబున స
ర్వజనాదరణీయచరిత్రంబునం బ్రవర్తించు చుండె. 197

చ. ఒకయెడఁ గ్రుంకుచో నుదయ మొందును వేఱొకప్రక్కఁ బద్మనా
యకుఁడు తదీయరాజ్యమున నట్లగుటన్ రవి సంతతంబు వీ
డక పరమాదరంబునఁ గడంగి కనుంగొను నామెపాలనా
ధికత నటంచుఁ దోఁచఁ దగు దేశము నేలె నిరాకులంబుగన్. 198

గీ. తొల్లి జార్జులు నల్వురు తుర్యవిల్లి
యమ్ము హానోవ రనునంశమందుఁ జిరము
రాజ్యభారముఁ బూని రీరాణి వారి
మించి బహుకాల ముర్విఁ బాలించె నహహ. 199

ఉ. అచ్చెరు వీవసంతసుమ మాతతరాజ్యమదాతపంబుచేఁ
బొచ్చెము లేక వాడుదలఁ బొందక సత్సుమనోమనోజ్ఞమై
హెచ్చు వహించె సత్కవుల కెందఱి కేని యుఁ దద్గుణంబులన్
ముచ్చట గా వచింతు మనుపూనిక చెల్లు నె సత్యమారయన్. 200

గీ. ఆమె చాతుర్య మే మొ ప్రజానురాగ
బీజ మొక్కటి వెదఁ జల్లి పృథులమనుజ
విశ్వసనభూరుహంబులు వేలకొలఁదిఁ
గాఁ గ మొలపించి నానాఁటఁ గడఁగి పెంచె. 201

వ. ఇట్లు సకలజనమనోహ్లాదం బతిశయింపం బృథ్వీమండలం బేలుచున్న విక్టోరియామహారాజ్ఞీమణికి నేకోనసప్తతివర్షంబులును ద ద్రాజ్యాధికారంబునకు నేకోనపంచాశద్వత్సరంబులుం గడచె నందుఁ బంచాశం బగు షడశీత్యుత్తరాష్టాదశ శతవర్షంబున జూనుమాసంబున నేకవింశవాసరం బుత్సవోచితం బయ్యె రాజ్ఞీనిదేశం బగుట నా మరుచటి వత్సరంబున. 202

క. జూబిలియుత్సవ మెసఁగెం
జాబిలివెలుఁగొచు నిఖిలజననాథులు నా
నాబలికరులయి కనుఁగొని
రే బలియున కైనఁ గలవె యింతటివేడ్కల్. 203

శా. శ్రీరాజ్ఞీమణి యుత్సవాగతజనోత్సేకంబు వాతాయన
ద్వార మ్మొం దరసెన్ దదీయజనవాత్సల్యంబు స్పష్టంబు గా
నౌరా యిర్వదిమైదువేలజనులన్ హర్షించి హిందూస్థలిం
గారాగారనిబద్ధుల న్విడచి రాకాలంబునన్ వేడ్కకై 204

ఉ. ఏమరుపాటు లేక ప్రజ నేఁబదివర్షము లొక్కరీతి ను
ద్దామదయాస్వభావము ను ధర్మముఁ దప్పక యేలినట్టియా
ధీమతికిం గృతజ్ఞతను దెల్పుట కయ్యెడ మంచివేళఁ గా
నేమనిచెప్పనచ్చు జను లేపునఁ జల్లినవాక్సుమంబులన్. 205

శా. వేలున్ లక్షలుఁ గాఁగ వచ్చుటకి నై విచ్చేసి యున్నట్టిభూ
పాలాదుల్ దగ నొక్కటొక్కటినిఁ గాఁ బాలొందియారాజ్ఞిస
చ్ఛీలాదుల్ గొనియాడఁ దద్గుణగణ శ్రీసంఖ్య హా చెప్పటచే
వేలున్ లక్షలు గాఁ గనొక్కఁ డొకఁ డే వేడ్కం బ్రశంసించఁ డే

ఉ. అప్పురి రాట్పథంబుల జనౌఘము మోదరసంపు వెల్లువల్
దెప్పర మాటఁ గాలినడఁ దీరుగ సాఁగ దటంచు నెంచి పూ
దెప్పను జెందె నోయనఁ గఁ దీరుగ రత్నవిభూషణాఢ్యమై
యొప్పులు గుల్కు రాడ్రథము నొందె మహీపతి స్వారి యేఁగఁగన్.

చ. ప్రకటితవాద్యముల్ నృపుల బండ్లు సతీశకటంబు లామెపా
త్రికలును మీఁగడం దొరయు తేటగుతేజులఁ దేజుమీఱుత
చ్ఛకటము రా యథాక్రమత సాఁగిరి వెస్టుమినిస్టరాబికిన్
బ్రకటరసానుకూల మగు భానమునం బ్రజ నచ్చి చూడఁ గన్. 208

క. మాడువులు మేటిగృహములు
మేడలునుం బ్రతినినాద మిషమునఁదామున్
వేడుక మంగళగానము
బాడం గాఁ దొడఁగె శుద్ధ భానం బెసఁగన్. 209

క. వివిధరుచికలితకాచ
ప్రవిమలజాలాంతరముల భానుమరీచుల్
దవిలి యొకవింతగలిగెం
జెవినెటునోఁకింతుఁ జూడఁ జెల్లుం దానిన్. 210

ఉ. ఈగతి దేవళంబునకు నేగి మహోన్నతవైభవంబుతో
బాగుగ రాణి బల్కె మహీ భారముఁ బూనిన పెక్కునాళ్ళ కే
నీగుడిఁ జెంది వెండి యును నీశ్వరుఁ గొల్వఁ గఁ గంటిఁ దత్కృపన్
సాఁగుచు నుండె రాజ్యము ఘనంబుగ వర్ధిలె నాఁడునాఁటికిన్. 211



రాణిగారి జూబిలీ పండుగ జూచుటకై నిరీక్షించుట. 168.

క. ధర్మాధర్మముఁ గను నెడ
నిర్మలగతి నాదుమదిని నిలచుచుఁ దత్త
త్కార్యములత్రోవ లెల్ల స
మర్మకము గఁ దెల్పునట్టి మాన్యులఁ గొలుతున్. 212

గీ. అనుచుఁ బ్రార్థించుచో నపు డచట నున్న
వారిమేనులు పులకలు వార టరు దె
యూనుడువు లెల్ల వీనుల నానువారి
దేహములు గగ్గురించు సందేహ మేది. 213

వ. ఇట్లు కొంతదడ నయ్యెం దదనంతరంబ. 214

ఉ. రాజగృహంబుచెంత కమరం జనుదేరుచు నుండునప్పు డా
రాజనరాలి పైఁ గురియు రమ్యతరంబగుపూలవాన నీ
రాజనరత్నదీపికల రాజి యుఁ గన్నుల కింపుఁ బెంపుచున్
రాజిలె వేడ్కఁ జూడ నగరంబు నహించినకన్ను లో యనన్.

మ. చెలులుం జుట్టలు నర్వులుం బరిచితుల్ చిత్రోత్సవం బయ్యెడం
గలయం జూడఁగ నెంద ఱెందఱొకొ యాగ్రామంబునన్ వచ్చినం
దెలియం జాలక యుండె నొక్కఁడు ను దద్దేవివినిక్షిప్తదృ
ష్టుల నన్యంబున సోఁక నీక మదిలోఁ జొక్కెం దదద్వైతతన్. 216

శా. ఆరాజ్ఞీమణియింటి కిట్లరిగ శేషాహంబు వేవేగఁ బో
నారేయుత్సన మేమి చెప్పఁ గలఁ డయ్యారే సహస్రాస్యుఁడున్
తారామార్గము నంటఁ గా వెలుగుమొత్తం బై నపల్పంజులన్
ధీరుల్ కృష్ణవలక్షపక్షములు భేదింపంగ లే రైర హో. 21

సీ. రివ్వురివ్వున నంత రిక్షంబునకుఁ బోవు
తారబాణంబుల మేర యెంత
వివిధపుష్పోపేత వృక్షంబు లన నొప్పు
చిచ్చుబుడ్డుల నెన్ని చెప్ప నేమి
కణుదురుల్ రేఁగిన కైవడిఁ జెలరేఁగు
నల సిసింద్రీ లెన్న నలవియేది
శశిసహస్రము వెల్గు సరణిఁగాన్పించెడు
పగలువత్తుల కెద్ది పాటిగలదు

గీ. చాలు నే నిట్లు వర్ణింప సాఁగు టేమి
కొంత కొంత వచింపంగ నింతపాటి
దనెడిబుద్ధిజనించు నో వినెడువారి
కకట! చెడఁ జేయుచుంటి నో రాపలేక. 218

చ. అపుడు నెయింటుగుబ్బలికి నందఱుఁ బంజులతోడ నేగి త
ద్వీపుల తటంబులం గలసి విచ్చుచుఁ గూడుచు భూరివాద్యముల్
విపులయు నింగి భోరుకొన వెల్గఁ గఁ జేసిన వహ్ని యయ్యెడన్
స్థపుటితకీలజిహ్వలను జూచి నభస్థలి నాకె నుద్ధతిన్. 219

ఆ. రేయి వచ్చు నని నిరీక్షించువారలు
దెల్లవారె ననుచుఁ దెలుపునట్టి
వారితోడఁ గొంతవా దొనర్చి రమేయ
దీప్తిచేత రాత్రిఁ దెలియ లేక. 220

క. లండనులో ముద్రక్రియఁ
నిండినయుత్సవము విరియ నెరయుచు హిందూ
ఖండమున నొప్పె నప్పుడు
పండితులకు నుడువ లేనిపాటిది యగుచుఁ. 221

సీ. కచ్చిబీహారుభూకాంతుండుఁ దత్సతి
పరిషియాదేశభూపాలకుండు
మణికిరీటవిరాజ మానుఁ డౌహోల్కారు
హైదరుబాదుకోఁ డగునిజాము
అలసయాందేశేశుఁ డగుదేవనంగస
వరప్రకా రనుమహీ వల్లభుండు
తేజమొప్పుజపాను రాజౌకొమాచు ను
మున్నగుహిందుభూ భుజులు వచ్చి

ఆ. రపుడు నూరుపెట్టె లంపిరి హిందువుల్
కొన్ని లెల్లవారుఁ గలసి మఱి యుఁ
గాంత యొకయణాప్రకారము డెబ్బది
యైదువేలు పౌను లంపి రటకు. 222

సీ. స్కాట్లాండుదేశజుల్ కంచుతో శ్రీరాజ్ఞి
ప్రతిమ నొనర్చి యర్పణము సేయఁ
బ్రిన్సాపువేల్సు స్థాపించె నప్పుడు రాణి
బహుమతం లొసఁగెను బహుజనులకు

విద్యార్థులకు గొప్ప విందులు గావించెఁ
బడఁతులకును మేలితోడవు లొసఁగె
వైద్యశాలలు మఱివిద్యలశాలలు
నుంపించె సమ్మోద ముప్పతిల్ల

గీ. ఇట్లు లుండంగ యెనుబదియెనిమి దేఁట
నాస్ట్రియాదేశమున కాదినరిగె రాజ్ఞి
యాత్మజాం డేలువేల్సు నకరుగ నందు
సన్నుతించిరి సర్వభూజానివరులు. 223

చ. ఇతరులఁ బోలెఁదన్ను సుతుఁ డెక్కుడుగౌరవ మొప్పఁజూచినన్
హితమతి దీననల్ బలికి యించుక నాదగుబర్వఁ దగ్గఁ జే
సితి వని పుత్త్రినిం బొగడెఁ జెన్నుగ నెన్బదితొమ్మిదేఁట శో
భితగుణ తత్తనూజ యగు ప్రిన్సెసులూయిని సమ్మదంబుతోన్. 224

వ. పైపుద్యూకను నరునికిం బరిణయం బొనరించి యథోచిత కృతులం
గాలంబు గడపుచుం దొంబదిరెండవయేఁట. 225

గీ. పిండ రనువాని గారడి పృథువిశాల
మైన బాల్మోర దనునట్టి హాలులోన
మనుజనాయిక మనుమల మనుమరాండ్రఁ
జెంత నిడుకొని కనుఁగొనె స్వాంత మలర. 226

ఆ. ఆమె జన్మభూమి యైన కెన్సింగ్టను
నగరులోనఁ దత్తనయయు నామె
ప్రతిమ నిల్పె నిన్నిః పదివర్ష ములదాఁక
లీలఁ జూపె జూబిలీమహంబు. 227

సీ. హిందుదేశపుకవు లెంగ జేనీ యుశ్స
నంబు వర్ణించిరి బహురచనల
ని క్లాల్లదేశస్థు లెంచి రింకొకవింత
గలదు రుష్యాదేశ కాంత యొకతె
బీద యయ్యును గోర్కి యేది యు లే కామె
నీక్షించి ముద మంది యేగనార
వృద్ధ యయ్యును దనయేర్పాటునకు భేద
మించుక లే కుండ సంచరించుఁ

ఆ. దన్నుఁ బెంచినట్టిదాదివలన వేగ
లేన నభ్యసించి వేవినంత
ధౌతవస్త్రములను దాల్చి యిం పగుచోట
నల్పభుక్తిఁ జేసి యరుగ స్వారి. 228

చ. కడునడి వచ్చి రాజ్యగతకార్యములం గలకాగితమ్ము లే
ర్పడఁ బరికించి ధర్మ మెడబాటును బూనక సంతకమ్ములన్
గడుకొని చేసి సౌధతలగామిని యై స్వసుకాలెజీయనం
బడుసుమకుంజ మొంది యటుపై జను సాతిథి యాచు భుక్తికిన్.

సీ. ప్రిన్సెసుక్రిస్టియన్ పేరొందుకూఁతుతో
భుజియించి శతపదంబులను నడచి
తనరహస్యపుకమ్మలను వ్రాసి రాజ్యతం
త్రము దినచర్యపొత్తమున వ్రాసి

సద్గ్రంథములు కొన్ని చదువును జదివింపఁ
బైని హింసాస్థానభాపఁ గఱచు
విండ్సరునం దైన వివిధవస్తుప్రద
ర్శనమున కనువైనసన్నకట్టు

గీ. మొదలు గాఁగల శిల్పముల్ బిదపఁ జేసి
విలుచు నటుపైని రత్నాదివివిధవస్తు
వామె కొను ననునిశ్చయ మంది తెచ్చు
ఇతరకులమానసంబులు పగప కుండ. 230

సీ. అటుపిమ్మట విమర్శనార్థమై వచ్చిన
గ్రంథము ల్పత్రికల్ గడఁగి చూచు
సంజప్రొద్దున బంధుసఖిబాలకాదుల
కనురూపబహుమతు లంపు చుండు
నిష్టజనంబుతో నిష్టభుక్తి యొనర్చి
గీతసత్కథల నంగీకరించుఁ
బరిమితవచనము ల్పలికి నిద్రించు నీ
గతి దినదినమును గడపుచుండ

గీ. వర్షదశకంబుఁ గడవఁ దొంబదియు నేడు
సంఖ్యగల క్రీస్తువర్షాంబు జరుగు చుండ
నొక్కనాఁ డష్టవాహసంయుక్తరథము
నెక్కి యధికోత్సవంబున కేగుదెంచె. 231

క. అష్టదిశాగతజను లతి
తుష్టిం బ్రాపించఁ గా నతులితోరుశుభా
విష్టం బై రాజ్ఞీ మణి
షష్టితమాబ్దోత్సవంబు జరిగెం బిదపన్. 232

గీ. అరయ హైమం బనెడుపేర నధిక మహిమఁ
తొల్లిటిది యైనజూబిలితోడ నిదియు
జరుపమునఁ జిన్నదయ్యెను బరువునందుఁ
బంత మొనరించి యధికతఁ గొంత జూపె. 233

క. నాయెడ జనులకు గలనిర
పాయపుభక్తికిఁ గృతజ్ఞభావముతోఁ ద
చ్ఛ్రేయముఁ గోరుదు ననుతం
త్రీయంత్రపువార్తఁ బుచ్చె దేశంబులకున్. 234

సీ. లండ నెల్ల గులాబిదండలతో నిండె
హిందుదేశంబున నెన్నఁ దగిన
ఘనుఁ డౌ ప్రతాపసిం గనువానినయ్యెడ
నతిముదంబునఁ జూచి రఖిలజనులు
గ్రాఫిక్కు మొదలుగాఁ గలసభ లలరించి
రింద్రలోకమ్మున కెన యనంగ
మకుటధారణమహామహము తా నై యొప్పు
నబ్బిగృహంబున కరిగి యందు

గీ. నప్పటికి నిప్పటికిఁ గల్గువ్యత్యయంబు
పెండ్లి దాంపత్యసుఖము ను బిడ్డ లాదవు
టకట ప్రియమృతి బందులయాపదలు ను
నాది గాఁ గల పెద నెంచె నశ్రు లురుల. 235

క. కలకత్తానస్థానమున
నిలకంపము గల్గిచెలఁచె నీయుత్సవముల్
గలచోట్ల నెల్ల హిందూ
స్థలి నెంతటియుత్సవంబు జరుగక యుండెన్. 236

సీ. మేలిమహారాష్ట్రి మేలుగ్వాలియ లరు
సదిలక్ష లర్థంబు వ్యయము సేసెఁ
బది కోక్కఁడు గఁ జెఱఁ బడ్డవారిని వీడె
నీగతి జరిగె న నేకదినము
లపుడు విద్యార్థులయయుతంబునకు రాజ్ఞి
మతులు పొంగఁ గ బహుమతు లొసంగె
నాంగ్లేయకవివరుం డగువిల్లియంవాట్స
నధికవాఙ్మాధురి యలవరించి

గీ. వర్ణనముఁ జేసె నీయుత్సవమ్ము మిగుల
తెలుఁగుబాసను నాశక్తికొలఁది నేనుఁ
గొంత వర్ణించితిని బుధుల్ సంతసింప
రాజ్ఞిగుణములు మది నసురక్తి నిటుల. 237

ఉ. శ్రీరమణీయమౌ కరుణఁ జిక్కెడు నైజకటాక్షవీక్షణో
దారతలోకమేల నిలఁదా జనియించి యశంబుదేశముల్
గౌరరుచుల్ మనోహరముగా నొనరించెననన్ జెలంగు వి
క్టోరియ చక్రవర్తినికిఁ గోరెద సౌఖ్యము దైవమీవుతన్. 238

సీ. ఏకళానిధి సుఖాలోకప్రసాదంబు
కువలయామోదంబు కుదురుపరుప
నేప్రభారాశి యహీనప్రతాపంబు
చెలఁగి జడాశయశ్రీ లడంప
నేజీవనప్రద హితమహౌదార్యంబు
సద్దయాస్తోక హర్షంబు సేయ
నేచతురానన వాచాప్రచారంబు
వేదమై విబుధాళి వినుతిఁ గొనఁగ

గీ. నట్టి మనపాలి విక్టోరియాభిధాన
చక్రవర్తిని కిటమీఁది షష్టిహోయ
నోత్సవము కయి యత్నించు చున్న యట్టి
ధన్యులార! మహాజనమాన్యులార!. 239

మ. వినుఁడీ యో మహనీయులార యిపుడా విక్టోరియాచక్రవ
ర్తిని లోకైకపవిత్రచిత్రతరచారిత్రంబులన్ శ్రోత్రముల్
దనుపం గోరుచుఁ జిల్కపల్కులను సంశ్లాఘింతు సద్భారతీ
ఘను లెటం దమ కింపుసొంపుఁ దొలఁకంగాఁ జేయ వే నా నుడుల్.

### స్రగ్ధర.

ము న్నా యిఙ్గ్లాండుదేశంబున నెసఁ డనిలో
భోరునన్ ఫేరు లెప్లన్
మి న్నంటన్ భోరుకోల్పన్ జెదరి నరపతుల్
నీడలం గాంచుచుం బ
ర్వ న్నానాశావకాశప్రథితుఁ డగుచు నౌ
ప్పారె నాల్ఫోర్డు దీ గ్రే
ట న్నాథుం డామె సద్రాజ్యమునకుఁ దొలి భ
ద్రాసనంబున్ గడించెన్. 241

సీ. పిమ్మటఁదన్ను లోకమ్ములు పొగడఁగ
మూఁడవజార్జి తా భూమి నేలఁ
దరువాతఁ దనకీర్తి దశదిశల్ వ్యాపింప
నాల్గవజార్జి తా నేల నేలఁ
బిదప శౌర్యౌదార్య విదితుఁడౌ నాల్గవ
వుల్లియం బను ఱేఁడు పుడమి నేల
నటమీఁద నిజభాగ్య మగు మహాభాగ్యము
జగము నిరాతంకముగ భుజింప

గీ. భువి జనించిన సురరాజ భూజ మనఁగ
నఖిలసద్గుణమణిఖని యగుచుఁ గ్రీస్తు
శకము నిధి చంద్ర వసు చంద్ర సంఖ్యఁ దనర
నవని విక్టోరియారాజ్ఞి యవతరించె. 242



1887. విక్టోరియారాజ్ఞి.

సీ. బీదసాదలఁ జూచియాదరించెడు దయ
పుట్టువుతోడె కన్పట్టి తెల్పెఁ
దిట్టువారల నైనఁ గొట్టరాచను తాల్మి
యుగ్గుబాలనె నేర్చి యుగ్గడించెఁ
గ్రూరుల క్రోధాలఁ జేరరా దను నీతి
వెన్నతోడ నె తగ నెన్న నేర్చెఁ
గిట్టని వారి కాల్మొక్కెడు మగఁటిమి
తప్పటడ్గుల వేయు నప్పు డరసె

ఆ. మిన్ను విఱిగి మేని మీఁదఁ బడినఁ గల
నేని బెదరుగుండె యెఱుఁగ దయ్యె
నహహ యేమిచెప్ప నగు నామె వర్ణింప
నాదిఫణికి నైన నలవి యగునె. 246

ఉ. ఆ సుదతీలలామ సుగుణావళిసీమ బ్రిటానుదేశ సం
వాసులు పార్లమెంటుసభవారు స్వదేశవిభుత్వభద్రసిం
హాసనమందు నిల్పుటకు యత్నముఁ జేయుచు వెస్టుమిన్స్టరా
బీసదనంబు నందుఁ గడుఁ బేమిఁనిఁ బట్టముఁ గట్టి రయ్యెడన్. 247

లయగ్రాహి

మంగళరవంబుల నెసంగు శుభవాద్యములు
రంగముల నాటలు చెలంగ రుచిరంబై
యంగనల పాటలఁ గరంగుచు మనంబు లల
రంగ సభవార లరులం గలయఁ జల్లన్



ప్రిన్సు లియోపాల్డు ప్రభువు.



ప్రిఞ్ సెస్ హెలెఞ్ - అల్బని ప్రభ్వి.

నింగిని ప్రతిధ్వనులనుం గొలుపు బారుల ఫ్లీ
రంగు లరి గుండె లదరం గఁ గడు మోఁయఁగా
బొంగుచు మహాజను లాసంగెడు కిరీట మట
నంగి యల రాణి శిరముం గదియఁ దాల్చెఁగా.

ఆ. పదునెనిమిదవ దగువత్సరంబున భద్ర
పీఠపదవి నడసి పేర్మిఁ గనియు
ధర్మభీతిచేతఁ దాఁ దలంకెను గాని
యాత్మలోన నుబ్బ దయ్యె నహహ. 249

చ. అటుపయి లోక మెల్లఁ గొనియాడఁగ జల్లఁగ నేల నేలి ప్రా
కటగుణసంపదం దనకుఁ గంటికి నింపును సొం పమర్చి కూ
కటులనుఁ గొల్చి పోల్చిన ప్రకారము కూర్చిన యాల్బరట్ప్రభు
న్పటుబలధైర్యధుర్యుఁ బ్రియవల్లభుఁ గా వరియించె నంతటన్. 250

గీ. క్రమమునం గనె సుతులను విమలచిత్ర
చరితులను నవనిధులనఁ బరగువారి
నందు మన యువరాజు ప్రిన్సాఫువేల్సు
ప్రథమపుత్త్రుఁడు గాఁ బుట్ట వచ్చె నిటకు. 251

శా. ఈరాజ్ఞీవిభుతామనోజ్ఞతను దా రీస్టిండియాకంపెనీ
వార ల్గన్గొని యిండియాప్రభుత కై ప్రార్థింపఁ గా నర్థిఁ ద
ద్భారం బూనుచు రామరాజ్య మనఁ గాఁ బ్రాజ్యంబుగా నొప్పహిం
దూరాజ్యమ్మును నేల నేర్చె నెట నే దోషంబు లేక

చ. తొలుత మహమ్మదీయప్రభు దోషమహాతపతప్త నిండియా
సలలితకల్పవల్లి జనసన్నుతపాలనదోహదక్రియా
కలన స్వదేశవాసులకుఁ గాంక్షితసత్ఫలసిద్ధిఁ గూర్పఁ గా
విలసిలఁ జేసెఁ గా! మహిమ వెల్లడిఁ జేయుచు నెల్లదిక్కులన్. 253

సీ. జారత్వ మనుమాట చాటుమాటునఁ దూఱె
దారులదోపిడి పేరడంగె
బందిపోటులవారు బొందలపాలైరి
కన్నగాండ్రకు నోట మన్ను పడియె
నన్యాయ మనుపల్కు లన్యభూముల కేగె
కూటసాక్ష్యము లెల్లఁ గూలిపోయె
వంచనగాండ్రింట మంచాలఁ బట్టిరి
లంచపంచము లన్ని పంచఁ దూఱె

గీ. దుర్నయము లెల్ల డొంకలఁ దూఱఁ జొచ్చె
నీతిబాధలు గతిలేక నూతఁ బడియెఁ
బక్షపాతము దరిలేక భిక్ష మెత్తెఁ
జక్రవర్తిని రాజ్యంబు సలుపునపుడు. 254

సీ. కాశికిఁ బోవుట కాటికిఁ బోవుట
యనుమాట రైలుబండ్లను దొలంగె
సాఁగినచో బండి సాఁగ కున్నను మొండి
యనుమాట రోడ్డుల నడఁగిపోయెఁ



విక్టోరియారాజ్ఞీ ప్రిన్సు ఆఫ్ వేల్సు, డ్యూక్ ఆఫ్ యార్కు, డ్యూ
యార్కు కుమారుడు (రాణీగారి పుత్రుడు, పౌత్రుడు, ప్రపౌత్ర

బండుట యొకయేఁట నెండుట యొకయేఁట
నను మాట కాల్వల నాగిపోయె
దూరపువార్తలు తీరని యార్తులౌ
ననుమాట టప్పాల నణఁగిపోయె

గీ. బేరసారపు జనులు కుబేరులైరి
నరుల చదువులు మూలధనంబు లయ్యె
సకలవాసంబులును జిత్రశాల లయ్యెఁ
బ్రోడ యీ రాణి మన తోడునీడ కాఁగ. 255

గీ. కడుపులోఁ జల్ల కదలని కరణిఁ బ్రజలఁ
గన్నతల్లిని మఱపించి కాచి ప్రోచు
చుండుటం జేసి కొన్నాళ్ళ కిండియాకుఁ
జక్రవర్తిని యయ్యె దిక్చక్ర మలర. 256

చ. ఇదె సుదినం బటంచుఁ గవు లెన్నియొ సన్నుతులన్ రచింపఁ గా
నిదె సుదినం బటంచు బుధు లెందఱొ దీవన లందఁ జేయఁ గా
నిదె సుదినం బటంచు నృపు లెన్నొ మహోత్సవముల్ ఘటింపఁగా
నదె సుదినం బటంచు సుర లప్పుడు చల్లిరి పుష్పవర్షముల్. 257

సీ. దానంబునకు రాని ధనము ధనం బౌనె
కొట్టులలోఁ బూడ్చి పెట్ట నేల
మానంబునకుఁ గాని మగఁటిమి మగఁటిమె
కత్తి కఠార్లచే పట్ట నేల

జ్ఞానంబునకుఁ గాని చదు వది చదు వౌ నె
రేయుం బవలు నిద్రఁ బోయ నేల
సాయంబునకుఁ గాని కాయంబు కాయం బె
పెరుఁగుఁ బాలును బోసి పెంచ నేల

గీ. అనుచుఁ దలపోసి తలపోసి యాత్మలోన
నెందు నేనిఁ బ్రమాదంబు నొంద కుండ
ధర్మసరణిని సకల సత్కర్మగతులఁ
జక్రవర్తిని వర్తిల్లె సత్యకీర్తి. 258

సీ. గంగ గోదావరి కావేరిఁ గృష్ణలు
కట్టించి కాల్వలు క్రమము గాను
త్రవ్వించి జలములు తగ దొప్ప నూషర
క్షేత్రముల్ దివ్యసుక్షేత్రములు గఁ
జేసి బాటలు బండ్లు వాసిమీఱఁగఁ జూపి
ధర్మసత్రంబులు దార్ల నిల్పి
తంత్రివార్తలు పొగయంత్రముల్ నావికా
సూత్రముల్ దగునట్లు సూటిపఱచి

గీ. నట్టి యశమును వర్ణింప నలవి యగు నె
భరతఖండంబు నేలెడి భవ్యమూర్తి
ప్రజలఁ బ్రీతిగఁ బాలించి ప్రబలకీర్తి
నొందు మో యమ్మ సుజను లానంద మొంద. 259

గీ. వేడ్కతోఁ దుత విద్వన్నరు విచారణంబు
సల్పుచును బీదసాదల సాకు నాఁడె
తెలిసె నౌదార్యగుణరాశి తెల్లముగను
గావు మో యమ్మ ప్రజలను గరుణ మీఱ. 260

క. వెనుకటి జూబిలి యుత్సవ
మున వేడుక లెల్లఁ గాంచి పుణ్యవశమునన్
మన మలరెన్ మేదిని తా
ల్చిన డైమండ్జూబిలిం భళీ కనుఁగొనఁగన్. 261

క. అమ్మా నీ దయచేఁ గద
యిమ్మానవు లెల్ల నెందు నే కొఱఁతలు లే
కి మ్మహి వర్ధిలుఁ గల్గిరి
సమ్మద మొందుచును సకల సౌఖ్యము లొలయన్. 262

ఉ. వర్ధిలుఁగాత నెల్ల కవి వర్యులు సభ్యులు నుం గడుం గడున్
సార్థకు లౌచు రాజ్ఞి సరసంబులు గుల్కెడి చిల్కపల్కులన్
వర్ధిలు కాన్పురె న్నిటను వాంఛలఁ దీర్చి ముదంబుఁ గూర్చుచున్
వర్ధిలుఁగాత సూరిజనవర్గ మనర్గళ రాజపూజ్యమై 263

మానిని. పావననామ మహామహిమాన్వితపాతకజాత వినీతమనో
భావిత చిన్మయరూప హిరణ్మయ భాస్వర భూషణభూషిత మూ
ర్తీ విదితామలకీర్తిని మామక దివ్య వచోరచనాకృత తా
రావళినిం గళమందు ధరించిన రాణినిఁ గావవె ధన్యకృపన్. ”

ఆ. వృద్ధ యైనరాణి విక్టోరియాయని
పిలువఁ దగినయట్టి పెద్దలందు
గురువయస్క సాక్సికోబర్గరాణి యై
తపి సహించుచుండె రాజ్ఞివదెన. 265

ఆ. దేశయాత్ర లరుగుతీపు ను మనుజుల
కుశల మరయునట్టికోరిక యును
ప్రాయ మరుగ నరుగ బలితంబు లౌచుండె
నీతివేత్రి భూమి నేత్రి కపుడు. 266

శా. లోకాతీతమహోరురాజ్యరమతో లో నైరి శ్రీరాజ్ఞికిన్
లోకాతీతధనాఢ్యు లామె ముదలన్ లోఁ బడ్డ వా రారయన్
లోకం బెల్లెడ నిండి యుండిరి దురాలోకస్వరూపంబుతో
లోకాలోకము దన్ని దేశమునకున్ లో నై యడంగెన్ మహిన్.

గీ. మహిధవుల కెల్ల నిజశిరోమాలిక యగు
నమ్మహారాజ్ఞి యాజ్ఞ నిరాకరించి
యాఫ్రికాఖండమందు బోయరులు మేటి
యరు అయి రెదిర్చి కడఁగిరి దురమునకును. 268

క. ఆదరము యోధసంచయ
మేదుర మై చూడఁ జూడ మృత్యునకు మహా
హ్లాదమ్మున నటియించెడు
మేదిని యై వాక్యసరణి మేరన్ మీరెన్. 269



రాణీగారు, ఒక పేదవారింటికి వెళ్ళుట.

సీ. చెవులు చిల్లులు వారఁ జిఱుతుపాకులభూరి
రవము లెసంగఁగ రవలఁ బరపి
పెటెలుపెటేలునఁ బ్రేలుతుపాకుల
మొత్తంబులను బడమొత్త సాఁగి
గుభెలుగుభేలున గుండియల్ ప్రీలఁగ
గుండ్ల దెబ్బల క్షీరంగులను దాల్చి
జాడ గానఁగ రాక చయ్యన బైఁ బడి
తెరలించుమందులతిత్తిఁ గాల్చి

గీ. వీరి వారు ను వారిని వీరు మిగిలి
యుభయసేనలవారలు నొక్కరీతి
గుం డ్లఁ దీసినబంటులు లై కండపిరికి
తనముఁ గానక పోరిరి ధైర్యగరిమ. 270

గీ. కూటయుద్ధంబులకుఁ జొచ్చుకొలఁదు లెఱిఁగి
కూటయంత్రంబులను దరికొల్పి మఱియు
గిరులపై నెక్కుదారి వేగిర మె పట్టి
హూణసేనలు పగవారి నోడియ సాఁగె. 271

చ. గడియలు గావు జాములు ను గావు దినంబులు గావు మాసముల్
బడి బడి సాఁగఁ గా వెనుక పాదముఁ బెట్టక రెండుసేనలుం
బిడుగులు దూలురీతి ననిఁ బేర్చుచుఁ జేయఁగ నందు మేదినిం
బడినమదేభవాహరథపత్తిగణంబు గణింప నేటికిన్. 272

క. పలుదెఱఁగుల వర్ణింపఁ గ
ఫలమే మగు నోడువారిపాటులు ననిలో
గెలు పొందువారిశౌర్యముఁ
దలఁచెడువారలకు మదినిఁ దాఁకొన వోకో. 273

గీ. బోయరులు బోయ లనఁ దగి పొలుపు మాసి
రందు హతశేషు లగువార లలసి సొలసి
తెరపి దైయున్న చెఱసాల లూరసి మిగులఁ
జిన్నఁబోవక యుండఁగఁ జేసె రహహా. 274

సీ. పందొమ్మిదవశతాబ్దంబున బోయర్ల
కలనయ్యె నట వేలకొలఁదిజనులు
వలదుయుద్ధం బని పలుమరు వేఁడిరి
లార్డురాబర్టు సాలంబునందు
జయ మొంది శ్రీరాజ్ఞి సత్ప్రతిష్ఠ యొసంగె
నామె యాతనిఁ గొనియాడె మిగుల
బహరంపుదెబ్బలఁ బడి వైద్యశాలల
నుండువారిని రాజ్ఞి యుచితరీతి

ఆ. నాదరించి బాధ యణఁగె నే యెచ్చట
గాయ మొదవె మనసు గలఁగు చుండెఁ
దగుచికిత్స లెల్లఁ దగులుచు నుండె నే
యేపటాలమందుఁ నెసఁగు దీవు. 275

క. నీపే రే మని యడుగుచు
దాపునకుం జనుచుఁ బూలచండ గళమునం
బ్రాపించి తనకరంబుల
ప్రాపఱ్యోన్ వారిమంచిభానంబులకున్. 276

చ. అవనిపనేత్రి కీర్తి విజయం బొదవం గఁ బ్రిటోరియామహా
త్సన మతిరమ్య మాచు నసుధాస్థలి నెల్లెడ సాఁగె దాని దా
ననవనచిత్రచిత్రపరిణాహగతుల్ వివరించి చెప్పఁ గా
నవుఁ గద నూఱువత్సరము లంతటిచాతురి గల్గె నేని యున్. 277

మ. అధికైశ్వర్యముఁ గీర్తిసంపద యు సమ్యగ్జ్ఞానసంపత్తి యున్
బుధనర్గంబులు వేయినోళ్ళఁ బొగడం బొల్పొంది సద్వైభవిన్
న్యధ నెల్లం దొలఁగించి భూమిజనులన్ న్యాయంబునం బ్రోచుచు
న్విధుతారిచ్ఛట యైనరాణ్మణి యుర్విన్ సత్ప్రతిష్ఠం గనున్.

శా. పాడిం దప్పక భూమిధారణమహాభారంబునన్ రాజ్ఞికిన్
దోడై యామె నిదేశముల్ నడపుచున్ స్తుత్యప్రభావాఢ్యుఁ డా
గ్లాడుస్టన్ సముభిఖ్యమంత్రి యిహలోకంబున్ విధిప్రేరణన్
వీడెన్ లోకము నెల్ల నంధతమసావిష్టంబుఁ గావించుచున్. 279

వ. అట్టి యతి దుస్సహం బగు వార్త నాకర్ణించి య ద్దేవి యిట్లనియె.

ఉ. నాపినప్రాయ మందు నొకనాఁ డొక చల్లని ప్రాగ్భువేళ ఘుం
టాపథ మందు స్వైరగమనం బొనరించుచు నుండ వృద్ధ యా
తాపసి యోర్తు నాదు కరతామరసంబును జూచి తల్లిరో
భూపరిపాలనక్షమతఁ బొల్చెద వీ వొనరించు సర్వలో
కోపకృతిం బ్రసిద్ధ మయి యొప్పును దత్సమయంబు భూమిలోన్.

ఉ. బాసట నీకు నొచు ఘనభావముఁ గీర్తియుఁ గల్గి ధీరుఁడా
నీ సచివుం డొకండు మరణించిన పైనిఁ గొలందికాల మం
దోసతి నీవు పీడఁ గల పుర్వి నటంచు వచించె నప్పు గా
నే సకలంబు సత్యముగ నిందనుకన్ జరిగెం గ్రమంబునన్. 282

ఉ. కావున నేను నింక బహుకాలము భూతల మందు నుండ నం
చావిదితంబు గా జనుల కందఱికి న్వివరించు నంత న
ద్దేవి వచించు పల్కు లతి తీక్ష్ణము లై చెవిసోఁక బంధుమి
త్రావళి కెల్ల నప్డు హృదయంబులు ప్రీలె సహస్రభంగులన్. 283

ఆ. దేహపాటనంబు దీరెను రాజ్ఞికి
గృహము వెడలు శక్తి యుడిలె నంచు
నింతమాత్ర వార్త యెల్లర కహిత మై
భువనితలము నందు నావరించె. 284

గీ. అకట! నోటను వచియింప నలవిగాదు
ఘోరతర మాచు నెల్లరఁ గూల్చు వార్త
పిదప నొక్కటి విన నయ్యెఁ బిడుగుఁ బోలె
నప్పటి యవస్థ నుడువఁ గ నలవి గాదు. 285

క. కా దొకనినిఁ బదుగురినిం
గా దది వేవురినిఁ గాదు కా దయుతంబున్
మేదిని నెల్ల జనంబుల
వేదనలో ముంచె నాప్రవృత్తి యొకమొగిన్. 286



విక్టోరియా రాజ్ఞిగారి సంతానము.

ఉ. సర్వమహీప్రజం దనప్రజల్ వలె నేలినయట్టిరాజ్ఞికి
దుర్వచ మైనయట్టిదశ దొట్టెఁ గదా యతినిందనీయ మా
శార్వరివర్ష మాఘమునఁ జంద్రదినప్రథమద్వితీయనాఁ
డుర్విని గల్గుమానవుల కోపనిదుర్దశ గల్గె నక్కటా.　　287

సీ. అతిమూరదేశసంస్థితి గల్గి యుండి యు
నెల్లవారలఁ క్షేమ నేలు చుంట
వచనమాత్రంబున వ్యవహారములఁ బలు
చక్కనిరీతిని జరుపు చుంట
జనసంఘముల నెల్లఁ దనకన్నబిడ్డల
కరణి నాదరమున నరయు చుంట
శత్రుమిత్రవిభేదసరణులఁ గానక
న్యాయమార్గంబున నడచు చుంట

గీ. తనదుపతి యైనవెన్నునిగొనము లూని
మహి నవతరించినట్టిపద్మాసధూటి
యనఁ గ నొప్పెడువిక్టోరియావధూటి
భామినీమాత్ర మనుచును బలుక వశ మె.　　288

మ. నలువా! యే మని దూఱువాఁడ నిను నెన్నాళ్లో విచారించి ని
శ్చలవృత్తిన్ సృజియించినావు గద యీసమ్రాట్స్త్రీరత్నముం
గలఁతం బెట్టితి విప్డు డామెఁ బరలోకం బొందఁ గాఁ జేసి నీ
తలతో నిట్టిసతిన్ సృజింపఁ గల వే తథ్యంబు చింతించు మా.　　289

ఉ. ఓజలరాశిదుర్గవర! యోగిరిదుర్గములార! యిందు మీ
రోజ మెసంగ నడ్డుపడి యుండి విరోధుల నెల్ల నడ్డుచున్
రాజిలు చుండి నేడు మనరాజ్ఞిపయిం బడుమృత్యుశత్రు నే
యోజను లోనికిన్ విడచి యుంటిరి మీస్థితి యేల కాల్ప నే. 290

క. ఓమానితదుర్గములా
రా మిత్త్రిం జూచి మృగయుం డనియెడు మదితో
సామాన్యదృష్టిఁ జూచితి
రీమోసము మీకు నేటికేగతిఁ గల్గెన్. 291

ఉ. మ్రొక్కులదేవరా కలరె పూర్వము భూతల మేలువారియం
దొక్కరుఁ డైన నిట్టినృపుఁ డొక్కక్షణంబు ను నీవు జూతు వే
యిక్కడ రాణి యేలని మహీతల ముండె నటంచు నెంచ నేఁ
డక్కటయట్టిరాజ్యమున కారయఁ గదా పలుకారుచీఁకటుల్. 292

క. అమ్మా యీక్రియ నగచెడు
మమ్మున్ విడనాడి పోన మంచియె మాసౌ
ఖ్యమ్ములుఁ గష్టము లరయుచు
నెమ్మది సేయం గఁ దగిన నేర్పరు లెవ రో. 293

ఉ. నీ కొకలోటు లే దనుట నిశ్చయ మీ వెట నున్నఁ జూడు మా
నీకయి దుఃఖ మొందునవనీజనులం దగ దిట్టిమాట యు
న్నాకు న దే మనన్ మనసునం బొడకట్టెడు మెట్లు నీకు న
వ్యాకులచిత్రభోగముల నందెదులోకమునందు నుండఁ గన్. 294



విక్టోరియారాజ్ఞి. 2వ సంవత్సరము. తల్లి కెంటు ప్రభ్వి.

క. ఇనుం బవలుఙ్ రేయి యు
నీనామముఁ దలఁచు చంద్రు నిరతిం దేవీ
మానవులు నీగుణంబు లె
ధ్యానించుచు నుంద్రు దేవి యనుట యె గురి గాన్. 295

క. ఈవిద్యలు నీబుద్ధులు
నీవివిధసుఖంబు లెల్ల నీ వొసఁగిన వౌఁ
గావున నీప్రజ లెల్లం
దావకనామంబు విడువఁ దలఁతు రె తల్లీ. 296

ఉ. భూపరిపాలనక్షములు భూపతు లియ్యెడ నెంద ఱెంద ఱో
యాపగ రానితాపముల నందుచు నుండిరి మాకు నీశుఁడౌ
నీపెదపుత్త్రుఁ డీవగవు నిల్పఁ గఁ జాలక యుండెఁ జూడుమా
మాపని యేమి యౌనితఁడు మాననిదుఃఖముతోడ నుండినన్. 297

క. ఎంతటిరోగము లయ్యు న
నింతటిలోపల నె చొచ్చి యే పరచు నె యే
వింత యొ రాజ్ఞీమృతివృ
త్తాంతం బవలీల జనుల నబలులఁ జేసెన్. 298

క. ఇడ రాని యాయు విడితివి
జడములకు ను జిల్వలకు ను సత్కృపతో నీ
పుడమిం బరిపాలించెదు
నొడయని కీఁ జాల వై తె యోదైవంబా. 299

సీ. సితపక్ష మయ్యు నసితపక్ష మని తోఁచ
గాఢాంధకారంబు గ్రమ్మ సాఁగె
మృత్యువు వెన్నంటి మీఁదఁ బడ్డవిధాన
గుండె లెల్లరకును గొట్టుకొనియె
నిష్టగోష్ఠీవార్త లించుకనవ్వులు
శబ్దమొక్కింతయు సమసి పోయె
యేవార్త వచ్చునో యీవేళ ననుచింత
దక్క వే ఱొకచింత దగుల దయ్యె

గీ. చెదరి పోయెదుగుండియ నదుముపోల్కి
హృదయముల హస్తములు సేర్చి యెల్లవారు
రాణి లోకాంతరముఁ జెందురాత్రిఁ దలఁపఁ
గాళరాత్రి యె మనుజసంఘంబునకును. 300

శా. ఆరాజ్ఞీమణి స్వర్గ మొందె నని యత్యానందులై యుత్సవ
ప్రారంభంబున దేవతావరులు తారాజువ్వలన్ భూమికిం
జేర న్వీడి రథోముఖంబుగ ననన్ నీరంధ్రమై యయ్యెడం
దారాజాలము వ్రాలె మానవులడెందంబు ల్గదుల్ గ్రయ్యఁగన్.

ఉ. ఏలినభూమి నెండ ఱొకొ యేలిక లెందఱొ పోయి రీగతిం
దాలిమిఁ దాలి నీ కయి వెత న్మనుజావళు లేడ్చు టెల్ల నీ
మేలిగుణంబుల న్మరువ మేకొనఁ జాలమిఁ గాదె యెవ్వరిం
జాలఁగఁ జెప్పుకొందు రొకొ చన్నయెడన్ మహివారు సద్గుణుల్



గతించిన ప్రిన్సు ఆల్బర్టువిక్టరు ప్రభువు క్రిస్టియన్ యడ్వర్డు.

క. వినుఁ డీ చర్చుల ఘంటలు
గణగణ మ్రోయంగ సాఁగెఁ గల దే మనుచుం
జను లెల్లఁ బెద్దపెట్టుగ
వనరిరి మాతృమృతి విన్న వారలఁ బోలెన్. 303

ఉ. నీపని వీడ కుంటి గద నీరజనాయక నీకు మోద మి
ట్లేపగిదిన్ మదిం గలిగె నింతటిరాణి గతించె మూఢు లా
రా పరమార్థము న్వినుడి రాణి మహోన్నతలోక మొందుచో
నేపున సద్విమానమున నేగఁ గఁ జూచితి నంత యేటికిన్. 304

క. ఎందఱు పుట్టి రొ చచ్చి రొ
యెందఱు భూతలమునందు నీవిక్టోర్యా
సుందరి కీడగు మనుజుల
విందు మొకో! కందు మొక్కొ విధిసర్గమునన్. 305

క. పుట్టినదుఃఖము మనమున
నెట్టిన నాపంగ నెవఁడు నేర్చును మనుజుం
డెట్టిదృఢత్వముఁ గల్గి యుఁ
గట్టి న్నిలుపంగఁ బోరలుఁ గా దె జలంబుల్. 306

ఉ. ఇందు సమస్తభోగములు నిష్టగతిన్ సమకూరి యుండగాఁ
బొందఁగ నేల స్వర్గమును భూపతిరత్నమ వైద్యశాలలన్
మందు లొసంగి యెందఱిని మానవులం బ్రతికించి తీవు నీ
కందొకఁ డైన నాయు విడి యాపదు మర్త్యులభాగ్యహీనతన్. 307

క. కాలము నిల్వక వడి వడి
నేలా పరచెద వొ పరచి యెం దేగెద వో
మే లైనవారి నేరిచి
యీలీలన్ సమయ జేయ నే వడి యెల్లన్. 308

సీ. నిను బ్రత్యహంబు సు నిద్ర లేపెడు సూర్యుఁ
డీపెద్దనిద్దుర లేపఁ డేల
ఇంచుక మొరయు నాలించెదునీ విప్డు
వీరిరోదనములు విన వి దేల
వెతఁ గల్గ నీ కడ విన్నవింతుము నేటి
యీ వెత వినుటకు నెవరు గలరు
నీకు నామోదంబు నెరపెడుపువ్వుల
వలపు లేటికి నేఁడు వలవకుంటి

గీ. ఎనుచు ఎగచిరి నీవు లోకాంతరమున
కరిగినట్టిదినం బెల్ల యహములందు
నధికపాపిష్ఠ మై జను లందఱికిని
దలఁచఁ జెప్పఁ గ రాని దై కలఁతపరచు. 309

ఉ. ఎంతటిబుద్ధిశాలులను నేచుచు నెంతటిధైర్యయుక్త మా
స్వాంతము నైన వే కలఁచఁ జాలినలేమిడి నైనఁ బొందఁ గాఁ
గొంత సహింప వచ్చుఁ గద ఘోరతరం బగునీదుపంచతో
నంతము మూర్ఛఁ ద్రోసెఁ జెవిఁ దార్కొనుమాత్రనఁ దల్లి రాణిరో.

చ. అవతారంబును వీడి నీ వరుగుచో నయ్యయ్యొ నీపిల్ల లౌ
నవనీమానవు లేడ్వ వింత యగు నే యాపన్నతం గూలి యీ
వివిధోర్వీరుహముఖ్యము ల్వగపుచే వేసారున ట్లుండె ము
న్నవలీలం బ్రతివాక్య మిత్తు విపు డాహా మొఱ్ఱ లాలింప వో. 311

సీ. ఆకర్ణపూర్ణంబు లైనట్టినేత్రముల్
మేల్గులాబీవన్నె మెఱయుమేను
మేలిబంగరుపోల్కి మించినముంగురు
లందంపునగ వొప్పునధరపుటము
సదయ మై యొప్పారుహృదయప్రవృత్తి యు
నారాధనీయ మానాకృతి యును
మాననీయము లైనసూనృతవాక్యముల్
స్నేహంబు మున్ను మన్న చిల్కుదృష్టి

గీ. మరువ నగు నమ్మ మాకు నో మాన్యశీల
నీకుఁ బ్రతినిధి గా మమ్ము నీసుతుండు
ప్రోచు దక్షత నైన నీప్రోపు మాకుఁ
బాదుకొని యుండి మది నెడఁ బాయఁ గలదె. 312

క. ఓమిత్త్రి మానవులం
బ్రేమన్ రక్షించు చున్నశ్రీరాజ్ఞి దయన్
మా మొఱ విని యును విడువ వి
కే మనఁ గా వచ్చుఁ గ్రూరహృదయుఁడవు గదా. 313

మ. అకటా యిందఱియాయువుల్ గొనెడినీ కంతంబు లే దాయె నో
వికటాకారపుమిత్తి యొక్కఁడును నిన్వీక్షింప లే డయ్యె ద
ర్శకలక్షాన్విత మౌచు నాకసముఁ జేరం జూచునమ్మేడలో
నికి నె క్లేగి తో చూతు రేనియు భటుల్ నీప్రాణముల్ దీయ రే.

చ. ఋజుపథవర్తనంబ గుణహీనత శాంతి యుఁ గల్గి శత్రుభూ
భుజులను రాజ్యతంత్రములఁ బోరిత ముండియు నాదరంబునన్
సుజనులతోడఁ దుల్యము గఁ జూచినయీసుగుణాఢ్య రాణి వా
రిజభవుసృష్టి నెల్ల నలరించెఁ గదా తనవైభవోన్నతిన్. 315

ఉ. అన్నములేనివారు ను గదాతురదేహులు బిచ్చకుంటులుం
గన్నులు లేనివారు నధికశ్రమ మొందఁ గ లేకచావుకై
తెన్నులు జూచు చుండ నతిదీర్ఘతరాయు వొసంగి లోకులన్
మన్ననఁ బ్రోచురాజ్ఞి మటుమాయముఁ జేసి తె క్రూర దయ్యమా.

చ. యమసమభిక్ష్యచోరుఁడు జనావళికిం గన రాక వచ్చి య
ర్యమసమతేజ మొప్పెడుననర్ఘ్యతరంబగు కోహినూరువ
జ్రమునకు వన్నె వెట్టఁ దగురాణియనం దగుగొప్పరత్నము
న్నిమిషములోనఁ జేకొని చనెం దమముల్ జగ మావరింపఁ గన్.

ఉ. తీరనిక్షామబాధలను దేశవిపత్తులు గల్గుటన్ మహా
మారి మసంగుటం దెగినమానవులం దగువర్తనంబులం
దారుచునట్టిమేలిజననాథుఁడు లేమిని దైవ మీమె నీ
ధారుణిఁ బాపి న్యాయపుపదం బిడె నో పరలోకధారుణిన్. 318

సీ. సభ్యులారా! మున్ను సభలలో నేదేవి
నుతియింతు మామె స్వర్గతికి నేగె
సతులార! యేదేవి సర్వవిద్యలు మీకుఁ
గలిపించె నామె స్వర్గతికి నేగె
మతకర్తలార! స్వైరత మీకు నేదేవి
గతిఁ జూపె నామె స్వర్గతికి నేగె
జనులార! మన కెల్ల సౌఖ్యంబు లేదేవి
గలిగించె నామె స్వర్గతికి నేగెఁ

గీ. పెద్దలను బిన్నలను మఱిబీదవారి
ధనికుల సమానరీతిఁ గాఁ గనుచు లోక
మేలె నేదేవి యామె నేఁ డెల్లజనుల
మించునాపత్పయోనిధి ముంచె నకట. 319

శా. మారాజ్ఞీమణి మాకు నీఁ గలిగినన్ మమ్ముం బ్రసాదించు వే
మారు న్వేఁడెద మోయిదైవమ! మహిం బల్మానవుల్ జచ్చుచో
నీరీతి న్నిను వేఁడుచుందు మని నీ వెంచం గ్రోఁ బో కట్లు గా
దీ రాజద్గుణరాశి సాటి యగువా రెం దేని యు న్లేరు గా. 320

క. తక్కటి రాజులకంటెన్
మిక్కిలికాలంబు నేలె మిక్కిలి రాజ్యం
బక్కాలరాజ్యముల కిను
మిక్కిలి యై రాణికీర్తి మించెం జగతిన్. 321

క. ఓయంతక నిను నిందలు
సేయం గా నేల మేము జేసినపాపం
బాయమఁ గొని పోయెం గద
చేయం గల దేమి మించఁ జేసినపనికిన్. 322

ఉ. మృత్యువు కాకికై పడిఁ దమిస్రముపోలిక నల్లనై హతా
త్కృత్యము మీఱఁ బైఁ బడును తెల్లముగా నని నిందసేతు రా
మత్యనుకూలత న్మనము మానక తిట్టినఁ గొంకి పోవునే
ముత్యమువంటి రాణి కిఁక మోసము తప్పఁ గఁ జేయువార మే.

గీ. ఎన్ని వగపులఁ బడిన నే మున్న దింక
రాణియంతటిగుణశాలి రాజరాజు
వెలయఁ గల్గెను ప్రిన్సుఫువేల్సు మనకు
మనుద మాతని దరిఁజేరి మనుజులార. 324

క. కోటీరనిహితచంద్రా
పాటీరస్వచ్ఛదేహ పటురుచిసాంద్రా
కొటీరవాసిమునిహృ
త్పేటీరత్నాయమానపృథుతరరూపా. 325

కవిరాజవిరాజితము.

శివ శివకృత్యసమాదర చిత్తవశీకృత తిగ్మకరాయితమా
భవ భవశాంగరుచిప్రతిపాదితతామరసాహితకోటిరుచీ
భవ భవపాశసహస్రనిరంతరబద్ధవిదూర పదానతపా
సవ సవనాశనరక్షణసాదర చారుసుశీతలదృష్టియుతా. 326

## గద్యము.

ఇది శ్రీమన్మంత్రిప్రెగడ వంశపయఃపారావార రాకాసుధాకరరాజ
బిరుదాంకిత భుజంగరాయామాత్యపౌత్త్రి హారితస గోత్ర పవిత్ర
దుర్గామల్లికార్జునప్రసాదరాయనరపుత్త్రి శ్రీమార్కండేయవర
ప్రసాదజనిత సరసాష్టావధానాది విచిత్ర కవితాధౌరేయ
బుధజనవిధేయ భుజంగరాయనామధేయ
ప్రణీతం బయినసంతకుసుమ మను
మహాప్రబంధంబునందుఁ
దృతీయాశ్వాసము.
సర్వంబు సంపూర్ణము.
శ్రీ. శ్రీ. శ్రీ.

